భగవాన్ వేదవ్యాస మహర్షి రచించిన

# శ్రీ అగ్ని పురాణం






జిల్లెళ్ళమూడి అమ్మ

మాతృశ్రీ అనసూయాదేవి ఆశీస్సులతో...

వచనం : డాక్టర్ జయంతి చక్రవర్తి

ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి.,

ప్రచురణ



శ్రీ బాలాజీ పబ్లికేషన్స్

28-25-32/1, అరండల్‌పేట, ఏలూరురోడ్, విజయవాడ-2

సెల్ : 9441176276 / 9966675815

# శ్రీ అగ్ని పురాణం


| | | |
|---|---|---|
| వచనం | : | డాక్టర్ **జయంతి చక్రవర్తి**<br>విజయవాడ. 9390526272 |
| కాపీరైట్ | : | పబ్లిషర్స్ |
| ప్రథమ ముద్రణ | : | 2014 |
| ముఖచిత్రం | : | రమణ |
| డి.టి.పి. &<br>పేజి లే-అవుట్ | : | విద్యార్థి క్రియేషన్స్<br>విజయవాడ |
| ముద్రణ | : | శ్రీ స్వామి ఆఫ్‌సెట్ ప్రింటర్స్<br>విజయవాడ-3 |
| ప్రచురణ | : | **శ్రీ బాలాజీ పబ్లికేషన్స్**<br>నసురుల్లాఖాన్ వీధి<br>అరండల్‌పేట, విజయవాడ |
| వెల | : | ₹. 60 /- |




ఆర్షవిజ్ఞాన భాండాగారాలైన అష్టాదశ పురాణాలని ఆంధ్రుజాతికి అందించిన శ్రీ వేంకటేశ్వర ఆర్షభారతి ట్రస్ట్ వారికి, ఆ పురాణాలను అనువదించిన మహారచయితలకి సహస్రాధిక ప్రణామాలు సమర్పిస్తున్నాం.

# భగవాన్ వేదవ్యాస మహర్షి

## వ్యాసగుహ, సరస్వతీ తీరం, బదరీనాథ్



*అచతుర్వదనో బ్రహ్మా ద్విబాహురపరోహరిః ।*
*అఫాలలోచనః శంభుర్భగవాన్ బాదరాయణః ॥*

## కృతజ్ఞతలు

అష్టాదశ పురాణాలని సామాన్య జనానికి అందించాలని సంకల్పించిన శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ అధినేత **శ్రీ పుట్టగుంట వీరయ్యచౌదరి (బోస్) గారికి** ముందుగా ప్రత్యేక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

ఈ గ్రంథాలకి తమ అమూల్యమైన ఆశీస్సులందించిన శ్రీ పీఠాధిపతులు పరమపూజ్య **శ్రీశ్రీశ్రీ పరిపూర్ణానంద సరస్వతీ స్వామివారికి,** అస్మద్గురువర్యులు ఆర్షవిద్యాసాగర **బ్రహ్మశ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి గారికి** సహస్రాధిక వందనాలు సమర్పిస్తున్నాను.

ప్రోత్సహించిన మిత్రులు రోహిత్ ప్రింటర్స్ అధినేత శ్రీ పుప్పాల అప్పారావు గారికి, డా॥ కానుకొల్లు బాలకృష్ణ, వలివేటి శివరామకృష్ణమూర్తి, వేదాంతం సార్వభౌమ, ఉన్నవ గణేష్‌లకి..... అలాగే ఈ గ్రంథాన్ని డి.టి.పి. చేసిన శ్రీమతి వినీల గారికి పేజి మేకింగ్ చేసిన విద్యార్థి క్రియేషన్స్ వారికి ప్రత్యేక అభినందనలు...




Sreepeetam
# 1-9-278/10/1, Lalitha Nagar, Vidyanagar, Hyderabad - 500 044.
Ph: 27076655, M: 098490 33991

# ఆశీస్సులు

డా॥ జయంతి చక్రవర్తి గారు అనేక ఆధ్యాత్మిక రచనల ద్వారా తెలుగు పాఠకులకు సుపరిచితులు. విజయవాడ కనకదుర్గ దేవస్థానం పక్షాన వెలువడుతున్న 'కనకదుర్గ ప్రభ' పత్రికకు ప్రారంభ సంపాదకులుగా ఆయన పేరు తెచ్చుకున్నారు. 'దశ మహావిద్యలు' పుస్తక రచన తరువాత డా॥చక్రవర్తి గారు అష్టాదశ పురాణాలను తెలుగు పాఠక ప్రపంచంలోకి లోతుగా తీసుకువెళ్లాలని సంకల్పించారు. ఒక్కొక్క పురాణ సారాంశాన్ని ఒక్కొక్క చిన్న పుస్తకంగా విడుదల చేయాలన్న ఆ రచయిత సంకల్పం ప్రశంసనీయం.

ఈ చిన్నిపొత్తాలు పాఠకులందరికీ ప్రయోజనకరంగా, సదుపాయకరంగా ఉంటాయి. వీటి ఉపయోగాన్ని పాఠకులందరూ అందిపుచ్చుకోవాలని మనసారా ఆకాంక్షిస్తున్నాను.



స్వామి పరిపూర్ణానంద

**జయ వత్సరం, శ్రావణ పూర్ణిమ**

**(10.8.2014)**

"ఆర్షవిద్యాసాగర", "మధురభారతి"
మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి



దూరవాణి : 81061 96418

301, శ్రీ సాయి ఎన్‌క్లేవ్, అడవి శేషగిరిరావు వీధి, లక్ష్మీనగర్
సత్యనారాయణపురం, విజయవాడ-520011



తేది : 19-8-2014

## ఇది సృష్టి కథ

"అన్నీ వేదాల్లోనే ఉన్నాయిష" అనే వెక్కిరింపు లోకంలో బాగా ప్రచారంలో ఉంది. వెక్కిరించడానికి అన్నమాటే అయినా, ఇది నిజమని మాత్రం చెప్పక తప్పదు. వేదం సృష్టితత్త్వాన్ని, సృష్టికి మానవుడికి ఉన్న సంబంధాన్ని, మానవుడికి సృష్టికర్తతో గల అనుబంధాన్ని వ్యక్తం చేసింది. వేదం ఏ ఒక్కరో రచించిన గ్రంథం కాదు. సృష్టితత్త్వాన్ని, పరమాత్మ తత్త్వాన్ని తెలుసుకోవాలని ఆరాటపడిన మహర్షి సముదాయానికి అంతర్నేత్రానికి గోచరించిన ఒక దర్శనం. హృదయస్థానంలో వినిపించిన ఒక నాదం (శ్రుతి).వేదం 'అపౌరుషేయం' అని కూడా పెద్దలు గుర్తించారు. 'అపౌరుషేయం' అంటే మానవుమాత్రుడి రచన కాదు అని అర్థం.

అనాదిగా అలా దిగి వచ్చిన వేదం వ్యాసమహర్షి కాలానికి చిక్కువడిన దారాల రాశిగా ఉంటే, ఆ చిక్కును విడదీసి, వేదవిభాగ నిర్ణయంచేసి, వేదం మనకు అక్కరకు వచ్చేలా చేశాడు ఆ మహర్షి. ఆనాటి నుండి అతడికి 'వేదవ్యాసుడు' అనే పేరు వచ్చింది. సకల వేదాల సారాన్ని 555 సూత్రాలుగా "బ్రహ్మసూత్రాలు" రచించాడు. అయినా, ఆ మహర్షికి తృప్తి కలుగలేదు. వేదమనే విత్తనంలో నుంచి విశాలమైన పురాణ మహావృక్షాలను అంకురింపచేశాడు. అందుకే పురాణాలకు

"వేదోపబృంహణాలు" అని పేరు. "ఉపబృంహణం" అంటే విత్తనాలు నుంచి మొలక రావడం. విత్తనంలో ఏమి ఉన్నదో మొలకలో, మొక్కలో, చెట్టులో అదే ఉంటుంది.

వేదవాఙ్మయంలో దాగిన సృష్టితత్త్వాన్ని కథారూపంగా వివరించడానికి అష్టాదశ పురాణాలను రచించాడు వ్యాసమహర్షి. మానవాభ్యుదయం కోసం వెలువడిన ఈ పురాణ వాఙ్మయసారాన్ని సంక్షిప్తంగా సంకలనం చేసి అందిస్తే, ఈనాటి సమాజానికి శ్రేయస్సు కలుగుతుందని సంకల్పించాడు మా శిష్యమిత్రుడు డా॥ జయంతి చక్రవర్తి. తన ఓర్పు నేర్పులతో అష్టాదశ పురాణాల ఆంతర్యాన్ని వాడుకభాషలో నేటి జన సామాన్యానికి అందుబాటులోకి తెచ్చే పవిత్రమైన బాధ్యతను నెరవేర్చాడు.

మంచి సాహిత్యాన్ని మన సమాజానికి అందించే మహత్తర లక్ష్యంతో శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ వారు ఈ అష్టాదశ పురాణాలని ప్రచురించటానికి ముందుకు వచ్చారు. వీరిద్వారా ఇంకా ఎన్నో చక్కని గ్రంథాలు వెలుగు చూస్తున్నాయి.

పురాణ వాఙ్మయంలోని పుణ్యకథా విశేషాలను ఈనాటి సమాజానికి పంచే కృషిలో పాలు పంచుకుంటున్న మా చక్రవర్తి, సంప్రదాయ సాహిత్యాన్ని ప్రచురించే సత్కార్యాన్ని మహాయజ్ఞంగా స్వీకరించిన ప్రచురణకర్త శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ వారు ఎంతైనా అభినందనీయులు.

వీరిద్దరికీ ఆ అంతర్యామి అనంత శుభాలనూ ప్రసాదించాలని ఆశీర్వదిస్తూ, ఈ గ్రంథాలు ప్రజలకు చేరువ కాగలవని ఆకాంక్షిస్తున్నాను.

- మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి



# పురాణ పురుషుడు శ్రీమన్నారాయణుడు



# విషయసూచిక

# ఉపోద్ఘాతము

అం.ఆ

**వక్రతుండ మహాకాయ కోటిసూర్య సమప్రభ ।**
**నిర్విఘ్నం కురుమేదేవ సర్వకార్యేషు సర్వదా ॥**

**వ్యాసం వశిష్ఠనప్తారం శక్తేః పౌత్ర మకల్మషమ్ ।**
**పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్ ॥**

## అష్టాదశ పురాణాలు

మన భారతవాఙ్మయంలో వేదాల తరువాత అంతటి ప్రాశస్త్యాన్ని పొందిన గ్రంథాలు పురాణాలు. వేదాల్లో చెప్పిన ధర్మాల్ని కథలరూపంలో, ఆఖ్యానాల రూపంలో సామాన్యులకు సైతం అర్థమయ్యేలా తెలియచెప్పేవే పురాణాలు. అందుకే పురాణాల్ని పంచమవేదంగా కీర్తించారు. అసలు పురాణం అంటే? పురా పినవం-పురాతనమైనప్పటికీ నూతనంగా వుండేది అని అర్థం. అలాగే 'పురా ఆనతి' అంటే ప్రాచీనకాలంలో జరిగింది అని, వాయుపురాణం పురాణశబ్దాన్ని నిర్వచిస్తే, 'పురాఏతత్ అభూత్' పూర్వం ఇలా జరిగింది అని బ్రహ్మాండ పురాణం పురాణశబ్దానికి అర్థాన్ని చెబుతుంది. వీటన్నిటినీ క్రోడీకరించి చూస్తే పురాణం అంటే పూర్వకాలంలో జరిగిన ఎన్నో విషయాల్ని వివరించి చెప్పేది అని తెలుస్తోంది.

పురాణాలు ఎన్ని-

పురాణాలు మహాపురాణాలు, ఉపపురాణాలని రెండు విధాలుగా వున్నాయి. మహాపురాణాలు 18, అలాగే ఉపపురాణాలు 18.

**బ్రహ్మం పాద్మం వైష్ణవం చ వాయవీయం తథైవచ ।**
**భాగవతం నారదదీయం మార్కండేయంచ కీర్తితమ్ ॥**

**ఆగ్నేయంచ భవిష్యంచ బ్రహ్మవైవర్త లింగకే ।**
**వారాహంచ తథా స్కాందం వామనం కూర్మ సంజ్ఞకమ్ ।**
**మాత్స్యం చ గారుడం తద్వద్బ్రహ్మాండాఖ్యమితి త్రిషట్ ॥**

1.బ్రహ్మపురాణం 2.పద్మపురాణం 3.విష్ణుపురాణం 4.వాయు పురాణం 5.భాగవత పురాణం 6.నారదపురాణం 7.మార్కండేయ పురాణం

8.అగ్నిపురాణం 9.భవిష్యపురాణం 10.బ్రహ్మవైవర్త పురాణం 11.లింగపురాణం 12. వరాహ పురాణం 13.స్కాంద పురాణం 14.వామన పురాణం 15.కూర్మ పురాణం 16.మత్స్య పురాణం 17.గరుడ పురాణం 18.బ్రహ్మాండ పురాణం- ఈ పద్దెనిమిదీ మహాపురాణాలు. అలాగే 18 ఉపపురాణాలు కూడా వున్నాయి. ఈ మహాపురాణాల పేర్లని గుర్తుంచుకోవటానికి శ్లోకం కూడా వుంది.

**'మ' ద్వయం 'భ' ద్వయం చైవ 'బ్ర'త్రయం 'వ' చతుష్టయం।**
**అనాపలింగ కూస్కాని పురాణాని పృథక్ పృథక్ ॥**

'మ' తో మొదలయ్యేవి రెండు 1.మత్స్య 2.మార్కండేయ

'భ' తో మొదలయ్యేవి రెండు 1.భాగవత 2.భవిష్య

'బ్ర' తో మొదలయ్యేవి మూడు 1.బ్రహ్మ 2.బ్రహ్మవైవర్త 3.బ్రహ్మాండ

'వ' తో మొదలయ్యేవి నాలుగు 1.వాయు 2.విష్ణు 3.వామన 4.వరాహ

అ-అగ్ని, నా-నారద, ప-పద్మ, లిం-లింగ, గ-గరుడ, కూ-కూర్మ, స్కా-స్కాంద ఇలా మొత్తం పద్దెనిమిది పురాణాలు.

## పురాణాలు విష్ణుస్వరూపం

అష్టాదశ పురాణాలను సాక్షాత్తు విష్ణు స్వరూపంగా పోల్చారు. 18 పురాణాలని మహావిష్ణువు శరీరంలోని 18 అంగాలుగా భావిస్తారు మన ప్రాచీన ఋషులు.

1. బ్రహ్మపురాణం - శ్రీ మహావిష్ణువు శిరస్సు
2. పద్మపురాణం - శ్రీ మహావిష్ణువు హృదయం
3. విష్ణుపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిభుజం
4. వాయుపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమభుజం
5. భాగవతపురాణం - శ్రీ మహావిష్ణువు ఊరువులు
6. నారదపురాణం - శ్రీ మహావిష్ణువు నాభి
7. మార్కండేయపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిపాదం
8. అగ్నిపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమపాదం

9. భవిష్యపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిమోకాలు
10. బ్రహ్మవైవర్తపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమమోకాలు
11. లింగపురాణం - శ్రీ మహావిష్ణువు కుడి చీలమండ
12. వరాహపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమ చీలమండ
13. స్కందపురాణం - శ్రీ మహావిష్ణువు కేశాలు
14. వామనపురాణం - శ్రీ మహావిష్ణువు చర్మం
15. కూర్మపురాణం - శ్రీ మహావిష్ణువు పృష్ఠభాగం
16. మత్స్యపురాణం - శ్రీ మహావిష్ణువు మెదడు
17. గరుడపురాణం - శ్రీ మహావిష్ణువు మాంససారం
18. బ్రహ్మాండపురాణం - శ్రీ మహావిష్ణువు ఎముకలు

పురాణ లక్షణం :-

**సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశోమన్వంత రాణి చ ।**
**వంశానుచరితం చేతి పురాణం పంచ లక్షణం ॥**

పురాణానికి ఐదు లక్షణాలు ప్రధానంగా వుండాలని చెప్పారు. 1.సర్గ-అంటే ప్రపంచ సృష్టి, 2.ప్రతిసర్గ-ఈ ప్రపంచ ప్రళయం, 3.వంశం-రాజుల, ఋషుల, దేవతలకు సంబంధించిన వంశ విశేషాలు-అవతారాలు 4.వంశానుచరితం-రాజవంశాలలో, ఋషుల వంశాలలో పుట్టిన వారి జీవితచరిత్రలు, 5.మన్వంతరాలు-మనువులు, మనువు ద్వారా ఏర్పడ్డ సంతతి, ఆయా మన్వంతరాలలో జరిగిన విశేషాలు. ఈ విధంగా ప్రతిపురాణం పంచలక్షణాలతో కూడి వుంటుంది.

పురాణకర్త :-

**విష్ణోరంశో మునిర్జాత సత్యవత్యాం పరాశరాత్ ।**
**పురాణ సంహితాం దద్యే తేషాం ధర్మ విధిత్సయా ॥**

అనే ఈ ప్రమాణ శ్లోకం ప్రకారం సత్యవతీ పరాశర మహర్షి కుమారుడుగా శ్రీ మహావిష్ణు అంశంతో జన్మించిన వ్యాసుడే అష్టాదశ పురాణాల కర్త అని తెలుస్తోంది. ఈయననే కృష్ణద్వైపాయనుడు అని కూడా అంటారు. పురాణాలకు కర్త వ్యాసుడైతే వక్త సూతమహర్షి. ఈయన నైమిశారణ్యంలో శౌనకాది మహామునులకు ఈ పురాణాలన్నిటినీ ప్రబోధించాడు.

పురాణాల ప్రాచీనత :-

వేద వాఙ్మయం ఎంత విస్తృతంగా వుందో, పురాణ వాఙ్మయం కూడా అంత విస్తృతంగా వుంది. సాధారణంగా లోకంలో వేదాలు అత్యంత ప్రాచీనమైనవని చెబుతారు. అయితే ఈ శ్లోకం వేదాలకన్నా పురాణాలే ప్రాచీనమైనవని చెబుతుంది.

**పురాణం సర్వశాస్త్రాణాం ప్రథమం బ్రహ్మణాస్మృతమ్ ।**
**నిత్యం శబ్దమయం పుణ్యం శతకోటి ప్రవిస్తరమ్ ।**
**అనంతరంచ వక్త్రేభ్యః వేదాంతస్య వినిర్గతాః ॥**

పూర్వం బ్రహ్మ నోటి నుంచి వందకోట్ల శ్లోకాలతో ముందు పురాణాలు బయలుదేరి ఆ తరువాత వేదాలు బయలుదేరాయట. ఇలా వందకోట్ల శ్లోకాలతో చతుర్ముఖ బ్రహ్మతో చెప్పబడ్డ పురాణం మొత్తం ఒక్కటిగానే వుండేది. అల్పబుద్ధులైన మానవుల కోసం ఆ బ్రహ్మదేవుడే వ్యాసుడి రూపంలో వచ్చి ఆ కోటిశ్లోకాల పురాణాన్ని నాలుగు లక్షల శ్లోకాలలోకి కుదించి దాన్ని పద్దెనిమిది పురాణాలుగా రచించాడని స్కందపురాణం చెబుతుంది.

**పురాణమేక మేవాసీ దస్మిన్ కల్పాంతరే నృప ।**
**త్రివర్గ సాధనం పుణ్యం శతకోటి ప్రవిస్తరమ్ ॥**
**స్మృత్వా జగాదచ మునీన్ ప్రతి దేవశ్చతుర్ముఖః ।**
**చతుర్లక్ష ప్రమాణేన ద్వాపరే ద్వాపరే సదా ।**
**తదష్టాదశధా కృత్వా భూర్లోకేఽ స్మిన్ ప్రభాష్యతే ॥** *(స్కంద పురాణం)*

## పాఠకులకు నమస్కారం

భగవాన్ వేదవ్యాస మహర్షి రచించిన అష్టాదశ పురాణాలు ఆర్షవిద్యా భాండాగారాలు. ఆ భాండాగారాలలో నిక్షిప్తమైన ప్రధాన విషయాల్ని 18 పుస్తకాలుగా క్రోడీకరించి మీ ముందుకు తెస్తున్నాం. సరళమైన భాషలో మేము ప్రచురించిన ఈ 18 పురాణాలని ఆదరించి, మమ్మల్ని ప్రోత్సహిస్తారని ఆశిస్తూ... మీ

***- ప్రకాశకులు, వచనకర్త***

# అష్టాదశ పురాణాల మొదటి వక్త - శ్రోత

అష్టాదశ పురాణాలను మొదటగా చెప్పిన వక్తలు వారి నుంచి మొదటిసారి విన్న శ్రోతలు ఈ క్రింద చెప్పిన విధంగా వుంటారు. అదేవిధంగా ఒక్కొక్క పురాణానికి వక్తృ శ్రోతృపరంపర వేరువేరు విధాలుగా ఉండవచ్చు.

| సం. పురాణం | ఏకల్ప వృత్తాంతం | వక్తృశ్రోతలు |
|---|---|---|
| 1. బ్రహ్మ పురాణాన్ని | బ్రహ్మ కల్పంలో | బ్రహ్మ మరీచి మహామునికి బోధించాడు |
| 2. పద్మ పురాణాన్ని | పద్మ కల్పంలో | స్వాయంభువమనువు బ్రహ్మకు బోధించాడు |
| 3. విష్ణు పురాణాన్ని | వరాహ కల్పంలో | పరాశరుడు బ్రహ్మకు బోధించాడు |
| 4. శివ(వాయు)పురాణాన్ని | శ్వేత కల్పంలో | శివుడు వాయువుకు బోధించాడు |
| 5. భాగవత పురాణాన్ని | సారస్వత కల్పంలో | విష్ణువు బ్రహ్మకు బోధించాడు |
| 6. నారద పురాణాన్ని | బృహత్ కల్పంలో | పూర్వ భాగాన్ని – సనకాదులు నారదునికి బోధించారు. ఉత్తరభాగాన్ని – వశిష్ఠుడు మాంధాతకు బోధించాడు |
| 7. మార్కండేయ పురాణాన్ని | శ్వేత వారాహకల్పంలో | మార్కండేయుడు జైమినికి బోధించాడు |
| 8. అగ్ని పురాణాన్ని | ఈశాన కల్పంలో | అగ్నిదేవుడు వశిష్ఠునికి బోధించాడు |
| 9. భవిష్య పురాణాన్ని | అఘోర కల్పంలో | బ్రహ్మ మనువుకు బోధించాడు |
| 10. బ్రహ్మవైవర్త పురాణాన్ని | రథంతర కల్పంలో | సావర్ణి నారదునికి బోధించాడు |
| 11. లింగ పురాణాన్ని | కల్పాంత కల్పంలో | పరమశివుడు నారదునికి బోధించాడు |
| 12. వరాహ పురాణాన్ని | మనుకల్పంలో | విష్ణువు పృథ్వికి బోధించాడు |
| 13. స్కాంద పురాణాన్ని | తత్పురుషకల్పంలో | స్కందుడు భూమికి బోధించాడు |
| 14. వామన పురాణాన్ని | కూర్మ కల్పంలో | బ్రహ్మ పులస్త్య మహామునికి బోధించాడు |
| 15. కూర్మ పురాణాన్ని | లక్ష్మీ కల్పంలో | విష్ణువు పులస్త్య మహామునికి బోధించాడు |
| 16. మత్స్య పురాణాన్ని | సప్త కల్పంలో | విష్ణువు మనువుకు బోధించాడు |
| 17. గరుడ పురాణాన్ని | గరుడ కల్పంలో | విష్ణువు మనువుకు బోధించాడు |
| 18. బ్రహ్మాండ పురాణాన్ని | భవిష్య కల్పంలో | బ్రహ్మ మనువుకు బోధించాడు |

# పురాణాలు ఎందుకు చదవాలి?

**పురాణశ్రవణే శ్రద్ధా యస్య స్యాద్భ్రాతరస్వహమ్ ।**
**తస్య సాక్షాత్ప్రసన్నః స్యాత్ శివో విష్ణుశ్చ సానుగః ॥**

**యత్స్నాత్వా పుష్కరే తీర్థే యాగే సింధౌ చ సంగమే ।**
**తత్ఫలం ద్విగుణం తస్య శ్రద్ధయా వై శృణోతి యః ॥**

**యే పఠంతి పురాణాని శృణ్వన్తి చ సమాహితాః ।**
**ప్రత్యక్షరం లభంత్యేతే కపిలాదానజం ఫలమ్ ॥**

**అపుత్రో లభతే పుత్రం ధనార్థీ లభతే ధనమ్ ।**
**విద్యార్థీ లభతే విద్యాం మోక్షార్థీ మోక్షమాప్నుయాత్ ॥**

**యే శృణ్వన్తి పురాణాని కోటిజన్మార్జితం ఖలు ।**
**పాపజాలంతు తే హిత్వా గచ్ఛన్తి హరిమందిరమ్ ॥**

పురాణాలు వినడంలో ఎవరికైతే శ్రద్ధ ఉంటుందో మరియు నిత్యము ఎవరైతే శ్రవణం చేస్తారో, అటువంటి వారి విషయంలో శివ-కేశవులు మరియు వారి గణాలు సంపూర్ణానుగ్రహం ప్రదర్శిస్తారు. పుష్కర తీర్థాల్లో, ప్రయాగ మొదలైన నదీసంగమ క్షేత్రాల్లో స్నానాలాచరిస్తే ఏవిధమైన పుణ్యం పొందగలరో దాని రెట్టింపు పుణ్యం పురాణ శ్రోతలకు లభిస్తుంది. భక్తి శ్రద్ధలతో పురాణ పఠన-శ్రవణాలు చేసేవారు కపిలగోవును దానం చేస్తే కలిగే పుణ్యరాశిని పొందగలరు. పుత్రులు లేనివారు పుత్రులను, దరిద్రులు ధనాన్ని, విద్యార్థులు విద్యను, మోక్షగాములు మోక్షాన్ని పొందగలరు. పురాణ శ్రోతలు తమ కోటి జన్మల పాపాలను దూరం చేసికొని చివర్లో శ్రీమన్నారాయణమూర్తి సాయుజ్యం పొందగలరు.

# పురాణ వైభవం

**అష్టాదశ పురాణానాం నామధేయాని యః పఠేత్ ।**
**త్రి సంధ్యాం జపతే నిత్యం సోఽశ్వమేధ ఫలం లభేత్ ॥**

ఈ అష్టాదశ మహాపురాణాల పేర్లను ఉదయ-మధ్యాహ్న-సాయంకాల సమయాల్లో ఎవరైతే పఠిస్తారో వారు అశ్వమేధ ఫలాన్ని పొందగలరని భావం.

# శ్రీ అగ్ని పురాణం



శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్।
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వ విఘ్నోపశాంతయే ॥

నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్।
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్ ॥

అష్టాదశ పురాణాలలో ఎనిమిదోది శ్రీఅగ్ని మహాపురాణం. వామోహ్యాగ్నేయముచ్యతే అన్నమాట ప్రకారం శ్రీమహావిష్ణువుకి ఎడమపాదంగా ఈ పురాణం వర్ణించబడుతుంది. ఈ పురాణంలో మొత్తం 383 అధ్యాయాలు ప్రస్తుతం లభిస్తున్న ప్రతిలో 12000 శ్లోకాలు ఉన్నాయి. "వశిష్ఠా యాగ్నినా ప్రోక్తమాగ్నేయం తత్ప్ర చక్షతే" అన్న వాక్యాన్ననుసరించి అగ్నిదేవుడు ఈ పురాణాన్ని వశిష్ఠ మహర్షికి బోధించాడని తెలుస్తోంది.

అన్ని పురాణాలలోకీ ఈ అగ్నిపురాణం చాలా విశిష్ఠంగా కనిపిస్తుంది. నిజానికి దీన్నొక విజ్ఞాన సర్వస్వం అనవచ్చు. ఎన్నో ధార్మికవిషయాలతో పాటు ఆగమ, శిల్పశాస్త్ర, మంత్ర, తంత్ర, జ్యోతిషవిజ్ఞానానికి సంబంధించిన విశేషాలు ఆయుర్వేదానికి, ఆరోగ్యానికి సంబంధించిన విశేషాలు అలాగే నగర, గ్రామ, తటాక, ఆలయ ప్రతిష్ఠా పద్ధతులు ఇలా ఎన్నో అంశాల్ని వివరించింది ఈ పురాణం.

## అగ్నిపురాణంలో చెప్పిన విషయాలు

**1-50 అధ్యాయాలు :** వీటిలో మత్స్యావతార కథనం, కూర్మావతారకథనం, శ్రీహరి ధరించిన ఇతర అవతారాల విశేషాలు, రామాయణంలోని ఏడుకాండలు (బాల నుంచి ఉత్తరకాండ వరకు), శ్రీహరి వంశ కథనం, భారతాఖ్యానం, కౌరవపాండవ సంగ్రామం, పాండవుల సంక్షిప్త చరిత్ర, బుద్ధ, కల్కి అవతారాలు, జగత్సృష్టి స్వాయంభువ మనువంశం, కశ్యపవంశ విశేషాలు, సామాన్య

దేవతాపూజా విధానం, స్నానవిధి కుండనిర్మాణం, అగ్నికార్యవిధి, వాసుదేవాది మంత్ర లక్షణం, ముద్రాలక్షణం, సర్వసిద్ధి, ఆచార్య అభిషేక విధానం, సర్వతోభద్ర మండల విధి, సంస్కార కథనం, శ్రీధరుడి నిత్యపూజావిధి, అగ్నికార్యం, విష్ణుపవిత్రారోపణావిధి, దేవాలయ నిర్మాణఫలం, భూపరిగ్రహ విధానం, శిలాన్యాసవిధి, ప్రాసాదలక్షణం, వాసుదేవ ప్రతిమాలక్షణం, శాలగ్రామమూర్తి లక్షణం, చతుర్వింశతి మూర్తిస్తోత్రం, దేవీ ప్రతిమాలక్షణం వంటి ప్రధాన విషయాలు వివరించబడ్డాయి.

**50-100 అధ్యాయాలు :** ఈ అధ్యాయాలలో సూర్య ప్రతిమాలక్షణం, చతుష్షష్టియోగినీ లక్షణం, లింగాదిలక్షణం, కుంభాధివాసం, స్నపనాది విధానం, వాసుదేవ ప్రతిష్ఠావిధి, లక్ష్మీ ప్రతిష్ఠావిధి, సుదర్శనచక్రాది ప్రతిష్ఠావిధానం, సాధారణ ప్రతిష్ఠావిధానం, జీర్ణోద్ధారవిధి, దేవయాత్రోత్సవం, వృక్షప్రతిష్ఠ, గణేశ పూజావిధానం, స్నాన తర్పణ విధి, సూర్యపూజా విధానం, శివపూజ హోమ విధానం, దమనకారోహణం, సమయదీక్ష, సంస్కార దీక్ష, ప్రతిష్ఠాకళా శోధనం, నిర్వాణదీక్షావిధి, అభిషేకవిధి, నానామంత్రాది కథనం, వాస్తుప్రతిష్ఠా విధి, వాస్తుపూజ, అధివాస విధానం, శివప్రతిష్ఠ, గౌరీప్రతిష్ఠ, సూర్య ప్రతిష్ఠ లాంటి ప్రధాన విషయాలు వర్ణించబడ్డాయి.

**100-150 అధ్యాయాలు :** వీటిలో నగరవాస్తు విధానం, స్వాయంభువ సర్గకథనం, భువనకోశ నిర్మాణం, తీర్థమాహాత్మ్యం, గంగామాహాత్మ్యం, ప్రయాగ, వారణాసీ, నర్మదా, గయాక్షేత్ర మాహాత్మ్యాలు గయాయాత్రావిధి, శ్రాద్ధకల్పం, భారతవర్షం, జ్యోతిశ్శాస్త్రసారం, కాలగణనం, నక్షత్రనిర్ణయం, అర్ఘకాండం, మండలవర్ణనం, త్రైలోక్యవిజయవిద్య, నక్షత్ర చక్రం, మహామారీవిద్య, షట్కర్మ నిరూపణం, మంత్రఔషధాలు, లక్ష కోటి హోమాలు, మన్వంతరాల వర్ణన లాంటి ముఖ్యమైన విశేషాలు సవివరంగా చెప్పబడ్డాయి.

**150-200 అధ్యాయాలు :** ఇందులో వర్ణాశ్రమధర్మాలు, వివాహ విషయాలు, ఆచారవర్ణనం, వానప్రస్థ ధర్మాలు, యతిధర్మనిరూపణం, శ్రాద్ధకల్పం, నవగ్రహ

హోమం, అయిత, లక్షకోటి హోమవిధానాలు, మహాపాతకాది ప్రాయశ్చిత్తాలు, వ్రతపరిభాష, ప్రతిపత్ వ్రతాలు, విదియ, తదియ, చతుర్థి, పంచమి, షష్ఠి, సప్తమి, అష్టమి, నవమి, దశమి, ఏకాదశీ, ద్వాదశీ, త్రయోదశీ, చతుర్దశీ వ్రతాలు, శివరాత్రి వ్రతం, ఏకవార వ్రతాలు, నక్షత్రవ్రతాలు, ఏకదిన వ్రతాలు, మాసవ్రతాలు దీపదాన వ్రతం లాంటి విలువైన విషయాలు వర్ణించబడ్డాయి.

**200-250 అధ్యాయాలు :** ఈ అధ్యాయాలలో వరుసగా నవవ్యూహఅర్చనా విధానం, నరకస్వరూపం, భీష్మపంచక వ్రతం, కౌముద వ్రతం, షోడశ మహాదానాల వర్ణన, పృథ్వీదానం, మంత్రమాహాత్మ్య కథనం, సంధ్యావిధి, గాయత్రీమంత్రార్థం, రాజ్యాభిషేకం, రాజధర్మాలు, స్వప్నాధ్యాయం, దుఃస్వప్న నివారణ, శకున వర్ణన, శ్రీస్తోత్ర వర్ణనం, రాజనీతి కథనం, పురుష లక్షణం, స్త్రీ లక్షణం, రత్న పరీక్ష, ధనుర్వేదం లాంటి ఎన్నో విషయాలు వివరించబడ్డాయి.

**250-300 అధ్యాయాలు :** వీటిలో వ్యవహారకాండ, దాయవిభాగం, వేదపారాయణ విధానం, ఉత్పాతశాంతి పద్ధతులు, దిక్పాలక, వినాయక స్నానవిధులు, మహేశ్వర స్నానం, నీరాజనవిధి, ఛత్రచామర మంత్రాలు, విష్ణు పంజరస్తోత్రం, వేదశాఖలు, దానాదిమాహాత్మ్యం, సూర్యవంశ వర్ణనం, చంద్రవంశ వర్ణనం, యదువంశం, ద్వాదశ సంగ్రామాలు, సిద్ధౌషధాలు, సర్వరోగహరౌషధాలు, రసాది లక్షణం, వృక్షాయుర్వేదం, నానారోగహరౌషధాలు, మంత్ర రూపఔషధాలు, మృత సంజీవన సిద్ధయోగాలు, మృత్యుంజయకల్పం, మంత్రపరిభాష, బాలగ్రహహర తంత్రం లాంటి విశేషాలు సవివరంగా చెప్పబడ్డాయి.

**300-350 అధ్యాయాలు :** ఈ అధ్యాయాలలో సూర్యార్చనావిధానం, పంచాక్షరాది పూజావిధి, నరసింహమంత్రాలు, లక్ష్మీ పూజావిధి, త్వరితామాలా మంత్రాలు, వివిధరకాల మంత్రాలు, స్తంభనమంత్రాలు, వాగీశ్వరీ పూజావిధానం, పాశుపత శాంతి, రుద్రశాంతి మంత్రాలు, గౌరీపూజా విధానం, ఛందస్సారం, ఛందోజాతి నిరూపణం, శిక్షానిరూపణం, కావ్యాదిలక్షణం, నాటకలక్షణ నిరూపణం, శృంగారాది రసనిరూపణం వంటి విషయాలు ప్రధానంగా చెప్పబడ్డాయి.

**350-383 అధ్యాయాలు :** వీటిలో స్త్రీలింగ శబ్దసిద్ధరూప నిరూపణం, నపుంసక లింగ శబ్దరూపనిరూపణం, కారక నిరూపణం, సమాస నిరూపణం, తద్ధితనిరూపణం, కృదంత నిరూపణం, శబ్దకోశం, నానార్థవర్గం, భూమ్యాదివర్గం, మనుష్యవర్గ నిరూపణం, బ్రహ్మ వర్గనిరూపణం, సామాన్య నామలింగ వర్ణనం, నరక నిరూపణం, యమనియమాలు, ధ్యాననిరూపణం, ధారణ యోగం, సమాధి, బ్రహ్మవిజ్ఞానం, గీతాసారం యమగీత, ఆగ్నేయపురాణ మాహాత్మ్యం లాంటి విశేషాలు ప్రధానంగా వివరించబడ్డాయి.

## ఋషులు సూతుణ్ణి ప్రశ్నించటం

శ్రియం సరస్వతీం గౌరీం గణేశస్కన్ద మీశ్వరమ్ ।
బ్రహ్మాణం వహ్నిమింద్రాదీన్వాసుదేవం నమామ్యహమ్ ॥

శ్రీమహాలక్ష్మికి, సరస్వతీదేవికి, గౌరికి, గణపతికి, కుమారస్వామికి, పరమేశ్వరుడికి, అగ్నికి, ఇంద్రాది దేవతలకి శ్రీమహావిష్ణువుకి నమస్కరిస్తున్నాను. పూర్వం నైమిశారణ్యంలో తపస్సు చేసుకుంటున్న మునులు సూతమహర్షి అక్కడికి రాగా ఆయనతో దేనిని గురించి తెలుసుకుంటే సర్వజ్ఞత్వం లభిస్తుందో చెప్పమని ప్రార్థించారు.

సూతమహర్షి అక్కడున్న మునులందరితో – ఈ జగత్తుని సృష్టించి, పోషించి లయం చేసే భగవంతుడు శ్రీమహావిష్ణువే. ఆయన అన్ని రకాల సారాలలో కన్నా సారమైనవాడు. 'నేనే ఆ పరబ్రహ్మని' అని భావిస్తూ ఆ విష్ణువు గురించి తెలుసుకుంటే ఎవరికైనా సర్వజ్ఞత్వం లభిస్తుంది.

శబ్దాలకి గోచరమయ్యే సగుణ బ్రహ్మని గురించి అలాగే అవాఙ్మానస గోచరుడైన నిర్గుణ పరబ్రహ్మని గురించి తెలుసుకోవాలి. అధర్వవేదానికి చెందిన ముండకోపనిషత్తు కూడా ఇదే విషయాన్ని చెబుతుంది.

మహర్షులారా! పూర్వం నేను, శుకమహర్షి, పైలుడు బదరికాశ్రమంలో ఉన్న వ్యాసులవారిని దర్శించాలని వెళ్ళాం. ఆయనతో మేము గురుదేవా! మాకు పరంకన్నా పరమైనది, సారభూతమైనది అయిన పరబ్రహ్మ గురించి చెప్పమని ప్రార్థించాం. అప్పుడాయన మాతో ఇలా అన్నాడు.

సూతా! పూర్వం నేను వశిష్ఠ మహర్షిని ఇదే విషయం గురించి ప్రశ్నించాను. అప్పుడాయన నాకు అగ్న్యాది దేవతలకు, మునులకు మీరడిగిన విషయం గురించి ఏం చెప్పాడో అదే మీకు చెబుతా వినండి అని చెప్పటం ప్రారంభించాడు.

బ్రహ్మవిద్య అనేది నాశనం లేని పరావిద్య. ఆ బ్రహ్మవిద్యని ప్రతిపాదించే అగ్ని పురాణం కూడా పరబ్రహ్మ స్వరూపమే. సకల దేవతలకీ సుఖాన్ని కలిగించే ఋగ్వేదాదికాలు కూడా ఆ పరబ్రహ్మ స్వరూపాలే.

అగ్నిచెప్పిన పురాణం కనుక దీన్ని ఆగ్నేయ పురాణం అంటారు. ఇది వేదంతో సమానమైనది. దీన్ని చదివేవారికి, వినేవారికీ కూడా ఇది ముక్తినిస్తుంది. కాలాగ్ని స్వరూపుడు, జ్యోతిరూపుడు, సంసార సాగరాన్ని దాటించే నావలాంటి వాడైన విష్ణుదేవుణ్ణి (అగ్ని) పూర్వం వశిష్ఠ మహర్షి సకల మునిజనసమేతుడై ఇలా ప్రశ్నించాడు.

భగవాన్! సకల విద్యలకీ సారమైన ఏ పరబ్రహ్మను గురించి తెలుసుకుంటే మానవుడు సర్వజ్ఞత్వాన్ని పొందుతాడో అలాంటిది, సంసార సాగరాన్ని దాటించేది అయిన ఆ పరబ్రహ్మ గురించి మాకు చెప్పు అని ప్రార్థించాడు.

విష్ణువు వశిష్ఠుడితో ఓ వశిష్ఠా! నేనే కాలాగ్ని రుద్రుణ్ణి. సర్వ స్వరూపుణ్ణి. అన్నిటికీ కారణ భూతుణ్ణి నేనే. అతి ప్రాచీనమైన విద్యాసారాన్ని చెబుతున్నా విను.

పూర్వం మత్స్యకూర్మాది అవతారాల్ని ధరించిన నేను సృష్టికి, ప్రళయానికి, వంశానికి, మన్వంతరాలకి, వంశాను చరిత్రలకి కారణమయ్యాను.

పర–అపర అనే రెండు రకాల విద్యలున్నాయి. ఇవి రెండూ శ్రీమహావిష్ణువునైన నా స్వరూపాలే.

వశిష్ఠా! ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అధర్వవేదం అనే నాలుగు వేదాలూ శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పం అనే ఆరు వేదాంగాలు, కోశం, మీమాంస, ధర్మశాస్త్రం, పురాణం, న్యాయశాస్త్రం,

ఆయుర్వేదం, ధనుర్వేదం, అర్థశాస్త్రం, సంగీతం ఇలాంటివన్నీ అపరవిద్యలు. దృష్టికి గోచరించనిది, పట్టుకోవటానికి శక్యం కానిది, ఎలాంటి గోత్రం శాఖ లేనిది, నిత్యమై ప్రకాశించేది అయిన పరబ్రహ్మను గురించి బోధించే విద్యే పరావిద్య అని విష్ణువు వశిష్ఠుడికి బోధించాడు.

ఈ విధంగా వ్యాసమహర్షి తాను పూర్వం వశిష్ఠ మహర్షి ద్వారా తెలుసుకున్న పరబ్రహ్మ విద్య గురించి (సూతమహర్షికి) చెప్పగా అదే మీకు నేను చెబుతున్నాను" అని అన్నాడు సూతమహర్షి.

## మత్స్యావతారం

వశిష్ఠ మహర్షి అగ్ని దేవుడితో "వైశ్వానరా! పూర్వం నీవు శ్రీమహావిష్ణువు ద్వారా విన్న పురాణాన్ని నాకు చెప్పు అని ప్రార్థించగా, అగ్నిదేవుడు తాను విన్న పురాణంలోని విశేషాలన్నీ వశిష్ఠ మహర్షికి బోధించారు. ఇలా అగ్ని ద్వారా పురాణ విషయాలన్నీ చెప్పబడ్డాయి గనుక దీన్ని ఆగ్నేయ పురాణంగా లోకంలో వ్యవహరిస్తున్నారు.

పూర్వం గడిచిపోయిన కల్పం చివర బ్రహ్మదేవుడు నిద్రపోవటం వల్ల నిమిత్తప్రళయం ఏర్పడింది. అప్పుడు భూలోకంలో మొత్తం సముద్రంలో పూర్తిగా మునిగిపోయింది. తరువాత వైవస్వతమనువు ఆవిర్భవించి పరబ్రహ్మ గురించి తపస్సు చేసాడు. ఒకనాడాయన కృతమాల అనే నదిలో తర్పణాలు విడుస్తున్నప్పుడు ఆయన దోసిలిలోకి ఒక చిన్న చేప పిల్ల వచ్చింది.

వైవస్వతుడు ఆ చేప పిల్లని తిరిగి నీళ్ళలో పడేయబోయాడు. అప్పుడా చేపపిల్ల రాజా ఈ నదిలో మొసళ్ళున్నాయి. దయచేసి నన్ను ఈ నదిలోకి వదలకు అని ప్రార్థించింది. సరేనని జాలిపడ్డ మనువు దాన్ని తన కలశంలోని నీళ్ళలో వేసాడు. మర్నాడు కలశం మొత్తం నిండిపోయిన చేప రాజా! నాకొక పెద్ద స్థానాన్ని ఇవ్వు అని అడిగింది. రాజు దాన్ని తీసి బావిలో వేసాడు. అది బావంతా నిండిపోయింది. తిరిగి దాన్ని ఒక చెరువులోకి చేర్చాడు. ఆ మర్నాడే చేప చెరువంతా నిండిపోయింది. మనువు దాని ప్రార్థనవిని అక్కణ్ణుంచి తీసుకెళ్ళి సముద్రంలోకి చేర్చాడు.

మనువుకి ఆశ్చర్యం కలిగేలా సముద్రంలోకి చేరిన ఆ చేప క్షణాల్లోనే లక్షయోజనాల విస్తీర్ణంతో పెరిగిపోయింది. మనువు దాన్ని చూసి ఎవరు నీవు? అని ప్రశ్నించి ఒక్క క్షణం ఆగాడు. ఆయనకి సత్యం బోధపడింది. వెంటనే ఆ చేపకి నమస్కరించి నారాయణా! పరంధామా! ఏమిటీ మాయ! నన్నెందుకు మోహపరుస్తున్నావు? అని ప్రశ్నించాడు.

మనువు మాటలు విన్న మత్స్యావతార రూపంలో ఉన్న నారాయణుడు "రాజా! నేను ఈ జగత్తుని రక్షించటానికి, దుష్టుల్ని శిక్షించటానికి అవతరించాను. రాజా! ఈ రోజు నుంచి ఏడు రోజులు గడిచాక చివరిరోజు సముద్రాలన్నీ ఉప్పొంగి ఈ ప్రపంచాన్నంతా ముంచేస్తాయి. అప్పుడు నీ దగ్గరకి ఒకపెద్ద నావ వస్తుంది. అందులో మరోసృష్టికి కావలసిన బీజాలు, తదితర వస్తువుల్ని, సప్తర్షుల్ని వెంట బెట్టుకుని ఆ నావలోకి ప్రవేశించు. నీకు నీ పరివారానికీ ప్రళయం నుంచి రక్షణ లభిస్తుంది. అంతా మునిగి పోయాక నావ ఒక్కటే మిగిలి ఉంటుంది. అప్పుడు నేను మహామత్స్యరూపంలో నావ దగ్గరకి వస్తాను. అప్పుడా నావని నా కొమ్ముకి కట్టేయ్ అని చెప్పి ఆ మహామత్స్యం అంతర్ధానమయ్యింది.

మనువు ప్రళయం కోసం ఎదురు చూస్తూ కాలం గడుపుతున్నాడు. మత్స్యం చెప్పినట్టే ఏడోరోజు జల ప్రళయం వచ్చింది. మనువు వస్తువులన్నీ తీసుకుని నావ ఎక్కాడు. కొంతసేపటికి పదివేలకోట్ల యోజనాల విస్తీర్ణంలో ఉన్న మహామత్స్యం బంగారు కొమ్ముతో ఆ నావ దగ్గరకొచ్చింది. మనువు నావని ఆ కొమ్ముకి కట్టేశాడు.

మనుమహారాజు ప్రళయం ముగిశాక ఆ మహామత్స్యాన్ని స్తుతించి, మత్స్యరూపంలో వున్న నారాయణుడు చెప్పగా పాపాల్ని తొలగించే మత్స్య పురాణాన్ని శ్రద్ధగా విన్నాడు.

## కూర్మావతారం

పూర్వం దేవాసుర యుద్ధం జరిగినప్పుడు దుర్వాసుడి శాపఫలితంగా దేవతలందరూ రాక్షసుల చేతిలో ఓడిపోయారు. అందరూ తమ తమ స్థానాల్ని

అధికారాల్ని కోల్పోయి కళావిహీనులైపోయారు. అప్పుడు అందరూ కలిసి పాలసముద్రం మీద శయనించిన విష్ణువు దగ్గరకెళ్ళి ఆయన్ని భక్తిగా స్తుతించారు. అసురుల బారినుంచి కాపాడమని దీనంగా వేడుకున్నారు.

దేవతల ప్రార్థన విన్న విష్ణువు వారిని సముదాయించి "దేవతలారా! ముందు మీరు అసురులతో సంధిచేసుకోండి. ఆ తరువాత ఇద్దరూ కలిసి ఈ క్షీరసముద్రాన్ని మథించండి. దాని నుంచి అమృతం పుడుతుంది. అప్పుడు నేను మాయని ప్రయోగించి ఆ అమృతం అసురులకి దక్కకుండా మీకే దక్కేలా చేస్తాను. మందర పర్వతాన్ని కవ్వంగా, వాసుకిని త్రాడుగా చేసుకుని ఆలస్యం చేయకుండా మథనాన్ని ప్రారంభించండి" అని హితబోధ చేసాడు.

విష్ణువు ఆజ్ఞని విన్న దేవతలు వెంటనే అసురుల దగ్గర కెళ్ళి వారితో సంధి చేసుకున్నారు. ఆ వెంటనే ఇద్దరూ కలిసి మందర పర్వతాన్ని పాలసముద్రంలోకి దింపి వాసుకిని త్రాడుగా దానికి చుట్టి సాగరమథనం ప్రారంభించాయి. వాసుకి తలవైపు అసురులు, తోకవైపు దేవతలు ఉన్నారు. మథనం కొనసాగుతోంది. సర్పం నిట్టూర్పులకి దేవతలు అలసిపోతుంటే శ్రీహరి వారిని సేద తీర్చాడు. అటు తలవైపున్న అసురులు పాము నోటినుంచి వచ్చే విషజ్వాలలకి తట్టుకోలేక మరణిస్తున్నారు.

కొద్దిసేపు మథనం సాగాక ఉన్నట్టుండి మందర పర్వతం సముద్రంలోకి మునిగిపోయింది. ఎందుకంటే ఆ పర్వతానికి క్రింద గట్టి ఆధారమేమీ లేదు. అదిచూసిన మహావిష్ణువు కూర్మావతారాన్ని ధరించి సముద్రం అడుగుభాగానికి వెళ్ళి మందర పర్వతాన్ని పైకి లేపాడు. అలా మందర పర్వతం మహాకూర్మం వీపు మీద నిలబడింది. తిరిగి దేవదానవులు మథనాన్ని ప్రారంభించాయి. వెంటనే సముద్రంలోంచి కాలకూట విషం ఆవిర్భవించింది.

పరమేశ్వరుడు మహాభీకరంగా ఉన్న ఆ హాలాహలాన్ని మింగి దాన్ని తన కంఠంలో ఉంచుకున్నాడు. అందుకే ఆయన నీలకంఠుడయ్యాడు. తరువాత మథనం ద్వారా వారుణీదేవి (సుర), పారిజాతం, కౌస్తుభం, ఆవులు, అప్సరసలు

పుట్టారు. వారివెంటే లక్ష్మీదేవి ఆవిర్భవించి శ్రీమహావిష్ణువుని వరించింది. దేవతలంతా ఆ శ్రీదేవిని స్తుతించారు.

సముద్రమథనం అలాగే కొనసాగుతుండగా మరికొంతసేపటికి ఆయుర్వేద సృష్టికర్త అయిన ధన్వంతరి అమృతకుంభాన్ని తీసుకుని ఆవిర్భవించాడు. అది చూసిన వెంటనే అసురులు మథనం ఆపేసి ధన్వంతరి చేతిలో ఉన్న అమృతాన్ని లాక్కుని దాన్లో సగం దేవతలకిచ్చి వెళ్ళిపోయారు.

శ్రీమహావిష్ణువు ఆ దృశ్యాన్ని చూసి తాను జగదేక సౌందర్యవతి అయిన మోహినిగా అవతరించాడు. అద్భుత లావణ్యంతో మెరిసిపోతూ రాక్షసుల దగ్గరకి వెళ్ళాడు. అమృతాన్ని పంచుకునే తొందరలో ఉన్న అసురులు మోహినిని చూడగానే మైమరిచి పోయారు. ఒకరికన్నా ఒకరు ముందుకు తోసుకొచ్చి మోహినిని చేపట్టాలని ప్రయత్నించారు. "ఓ మోహినీ! నీవు నా భార్యవికా, లేదు లేదు నన్నే పెళ్ళాడు అంటూ ప్రాధేయపడ్డారు. వారిలో కొందరు అమృతభాండాన్ని ఆమెకిచ్చి ఓ మోహినీ! నీ దివ్యహస్తాలతో అమృతాన్ని మా అందరికీ సమంగా పంచు అని భాండాన్ని మోహిని చేతిలో పెట్టారు.

అసురుల నుంచి అమృతాన్ని గ్రహించిన విష్ణువు మాయోపాయంతో ఆ అమృతాన్ని ముందుగా దేవతల చేత త్రాగించాడు. అది గమనించిన రాహువనే రాక్షసుడు చంద్రుడి వేషం ధరించి దేవతల వరుసలో కూర్చున్నాడు. అతడు అమృతాన్ని తీసుకుని త్రాగబోతుండగా సూర్యచంద్రులు గమనించి ఆ విషయాన్ని విష్ణువుకి తెలియచేసారు. అప్పటికే రాహువు అమృతం చుక్కని నోట్లో వేసుకుని మింగబోతున్నాడు. తక్షణమే శ్రీహరి సుదర్శన చక్రంతో రాహువు తలని ఖండించాడు.

అమృతం చుక్క స్వీకరించిన కారణంగా రాహువు కేవలం శిరస్సుతో బ్రతికేవున్నాడు. శ్రీహరి దయతో రాహువుని వరం కోరుకోమనగా రాహువు తన మరణానికి కారకులైన సూర్యచంద్రులు తనకు పట్టుబడాలని కోరుకున్నాడు. అప్పుడు శ్రీహరి గ్రహణ కాలంలో నీ కోరిక తీరుతుంది అని వరమిచ్చాడు.

శ్రీహరి ఆ విధంగా మాయోపాయంతో దేవతలందరికీ అమృతాన్ని పంచి తను ధరించిన మోహినీ అవతారాన్ని పరిత్యజించాడు. శ్రీహరి జగదేక సౌందర్యవతిగా అవతరించాడని తెలుసుకున్న శివుడు ఆయన దగ్గరకొచ్చి తిరిగి మరోసారి తనకి మోహినీ అవతారాన్ని చూపమని కోరాడు. శివుడి మాట కాదనలేక శ్రీహరి తిరిగి మోహినిగా మారాడు.

అపురూప లావణ్యంతో మెరిసిపోతున్న మోహినిని చూడగానే శివుడికి మైకం కమ్మింది. మైమరచిపోయాడు. మాయకు చిక్కి అన్ని మరిచిపోయి ఉన్మత్తుడై మోహిని వెంటపడ్డాడు. ఆమె తప్పించుకు పారిపోయింది. శివుడు వదిలిపెట్టలేదు. దిగంబరుడై యుక్తా యుక్తాలు మరిచి వెంట పరుగెత్తాడు. అలా ఆయన మోహిని వ్యామోహంతో పరుగెడుతుంటే హృదయం స్పందించి వీర్యపు చుక్కలు రాలి నేలమీద పడ్డాయి. ఆ చుక్కలన్నీ ఎక్కడెక్కడ పడ్డాయో ఆయాచోట్ల బంగారు లింగాలు ఆవిర్భవించి, ఆ ప్రదేశాలన్నీ దివ్యక్షేత్రాలయ్యాయి. అలా కొంతదూరం పరుగెత్తాక శివుడికి మాయ తొలగిపోయింది. వెంటనే మనసుని స్వాధీనం చేసుకున్నాడు. ఊడిన వస్త్రాల్ని సరిచేసుకున్నాడు. అప్పుడు మోహిని రూపాన్ని వదిలేసిన విష్ణువు "శివా! ఇప్పటికి నీవు నా మాయని జయించావు. ఈ లోకంలో నీవు తప్ప నా మాయని ఎవరూ జయించలేరు" అని పలికాడు.

ఆ విధంగా శ్రీహరి సాయంతో అమృతాన్ని తాగి అమితబలవంతులైన దేవతలు అసురులమీదకి దండెత్తి వారిని అవలీలగా ఓడించి తిరిగి తమ తమ స్థానాల్ని అధికారాల్ని పొందారు. దేవతల చేతిలో ఓడిపోయిన అసురులంతా ఏం చేయాలో దిక్కుతోచక అందరూ కలిసి పాతాళానికి వెళ్ళిపోయారు.

## శ్రీహరి ధరించిన ఇతర అవతారాలు

**వరాహావతారం :** పూర్వం హిరణ్యాక్షుడనే రాక్షసుడుండేవాడు. వాడు అమిత బల పరాక్రమవంతుడు. తన భుజబలంతో స్వర్గం మీదకి దండెత్తి దేవతలందర్నీ తరిమేసి సింహాసనాన్ని అలంకరించాడు.

ఓడిపోయిన దేవతలంతా సామూహికంగా వచ్చి యజ్ఞస్వరూపుడైన విష్ణువుతో మొరపెట్టుకున్నారు. అప్పుడు శ్రీహరి వరాహరూపాన్ని ధరించి లోకకంటకుడైన హిరణ్యాక్షుణ్ణి సంహరించి దేవతలందరికీ ఆనందాన్ని చేకూర్చాడు.

**నరసింహావతారం :** హిరణ్యాక్షుడికి ఒక సోదరుడున్నాడు. అతడే మహాభయంకరుడు, హరిద్వేషి అయిన హిరణ్యకశిపుడు ఆ రాక్షసుడు దేవతలందరి యజ్ఞభాగాల్ని అపహరించి దేవతలందర్నీ తన బానిసలుగా చేసుకున్నాడు. వాడి కాలం ముగిసే సమయం వచ్చింది. శ్రీహరి నరసింహావతారాన్ని ధరించి హిరణ్యకశిపుణ్ణి దారుణంగా వధించాడు.

**వామనావతారం :** పూర్వం దేవాసుర సంగ్రామం జరిగినప్పుడు దేవతలంతా మహావీరుడు, అసురరాజు అయిన బలిచక్రవర్తి చేతిలో ఓటమిపాలయ్యారు. స్వర్గాన్ని కోల్పోయిన దేవతలంతా వెళ్ళి శ్రీహరిని శరణువేడుకోగా ఆయన అదితి, కశ్యపులకి వామనుడుగా జన్మించాడు. దేవతల మీద విజయం సాధించిన ఆనందంతో బలిచక్రవర్తి గొప్ప యాగాన్ని నిర్వహిస్తున్నాడు. వామనుడిగా ఉన్న శ్రీహరి ఆ యాగశాల దగ్గరకి వెళ్ళి వేద సూక్తాలు పఠించాడు. ముచ్చటగా ఉన్న ఆ బాలబ్రహ్మచారిని చూసి ఎంతో ఆనందించిన బలి అతడికి వరాలివ్వాలనుకున్నాడు. అది గ్రహించిన శుక్రాచార్యుడు బలిని వారించబోయాడు. అయితే ఆచార్యుడి మాటలు వినకుండా వడుగుని పిలిచి "ఏం వరంకావాలో కోరుకో" అని అన్నాడు బలి.

వామనుడు బలిచక్రవర్తితో రాజా! నాకు కేవలం మూడడుగులనేల చాలు అని కోరాడు. అలాగే ఇస్తున్నా తీసుకో అన్నాడు బలి. అంతే వామనుడు త్రివిక్రముడుగా మారి ఒక పాదంతో ఊర్ధ్వలోకాలన్నిటినీ ఆక్రమించి, మరోపాదంతో భూమండలాన్నంతా ఆక్రమించి మూడో అడుగుని బలి తలమీద వేసి పాతాళానికి అణగద్రొక్కాడు.

ఆ విధంగా శ్రీహరి వామనావతారాన్ని ధరించి బలిచక్రవర్తిని పాతాళానికి పంపి దేవతలు కోల్పోయిన స్వర్గాన్ని తిరిగి వారికి అందించాడు.

**పరశురామావతారం :** పూర్వం భూలోకమంతా క్షత్రియులతో నిండిపోయింది. అందరూ బలగర్వంతో ఎన్నో అకృత్యాలు చేస్తున్నారు. వారందర్నీ భూదేవి భరించలేకపోయింది. ఆ సమయంలో క్షత్రియుల్ని సంహరించి భూభారం తగ్గిద్దామని భావించాడు శ్రీహరి. దివ్య దంపతులైన జమదగ్ని రేణుకాదేవి సంతానంగా ఆయన అవతరించాడు. భృగుమహర్షి వంశంలో జన్మించినందువల్ల ఆయన భార్గవరాముడిగా, పరశువుని ఆయుధంగా ధరించటంతో పరశురాముడిగా ప్రసిద్ధి పొందాడు శ్రీహరి.

ఆ కాలంలో కార్తవీర్యుడనే మహాపరాక్రమవంతుడైన రాజుండేవాడు. అతడు దత్తాత్రేయుడి అనుగ్రహంతో వేయిచేతులు కలిగి సకలభూమండలాన్నీ పాలిస్తున్నాడు. ఒకనాడా రాజు సైన్యసమేతంగా వేటకెళ్ళాడు. వేటాడి అలసిపోయిన కార్తవీర్యుడికి అతడి సైన్యానికి అక్కడే ఆశ్రమంలో ఉన్న జమదగ్ని మహర్షి ఆతిథ్యమిచ్చాడు. తన దగ్గరున్న కామధేనువు సాయంతో వారందరికీ విందు భోజనాల్ని ఏర్పాటుచేసాడు.

కార్తవీర్యుడికి ఆ కామధేనువు మీద మనసు కలిగింది. దాన్ని తన కిమ్మని జమదగ్నిని కోరాడు. అందుకు జమదగ్ని అంగీకరించలేదు. కోపం వచ్చిన కార్తవీర్యుడు బలవంతంగా జమదగ్నిని హింసించి కామధేనువుని అపహరించాడు. ఈ విషయం తెలిసిన పరశురాముడు ఆగ్రహంతో బయలుదేరి మహావీరుడైన కార్తవీర్యుడి తలనరికి కామధేనువుని తిరిగి ఆశ్రమానికి తీసుకొచ్చాడు.

ఒకనాడు పరశురాముడు ఆశ్రమం విడిచి అడవిలోకి వెళ్ళాడు. అదే అదనుగా భావించిన కార్తవీర్యుడి కుమారులు జమదగ్ని ఆశ్రమంలోకి ప్రవేశించి ధ్యానం చేసుకుంటున్న జమదగ్ని మహర్షిని దారుణంగా సంహరించారు. అడవి నుంచి తిరిగి వచ్చిన పరశురాముడికి ఆశ్రమంలో తండ్రి శవం కనిపించింది. దివ్యదృష్టితో ఆ పని ఎవరు చేసారో గ్రహించాడు.

పరశురాముడికి ఆగ్రహం కట్టలు తెంచుకుంది. తన తండ్రి మరణానికి కారకులైన కార్తవీర్యుడి పుత్రుల్నే కాదు అహంభావంతో విర్రవీగుతున్న

సకల క్షత్రియుల్నీ సంహరిస్తానని ప్రతిజ్ఞచేసాడు. వెంటనే తన గండ్రగొడ్డలి ధరించి 21 సార్లు భూమండలమంతా తిరిగి క్షత్రియుడన్న వాడు లేకుండా అందర్నీ సంహరించాడు. అలా అందర్నీ వధించిన పరశురాముడు సరాసరి కురుక్షేత్రానికి వచ్చి అక్కడ పితృదేవతలకి తర్పణాలు, పిండప్రదానాలు చేసి వారిని సంతృప్తి పరిచాడు. తరువాత తాను సంపాదించిన భూమండలాన్నంతా కశ్యపుడికి దానం చేసి తపస్సు చేసుకోవటానికి మహేంద్రగిరి పైకి వెళ్ళిపోయాడు.

శ్రీహరి ధరించిన మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామనావతార, పరశురామావతార గాధల్ని విన్నవారు స్వర్గాన్ని చేరుకుంటారు.

## శ్రీమద్రామాయణం - బాల కాండ

సృష్టి ఆరంభంలో శ్రీమహావిష్ణువు నాభి కమలం నుంచి బ్రహ్మదేవుడు మొదట ఆవిర్భవించాడు. ఆయన తన మనసు నుంచి మరీచ్యాది మహర్షుల్ని సృష్టించాడు. మరీచి మహర్షికి కశ్యపుడు, కశ్యపుడికి సూర్యుడు, సూర్యుడికి వైవస్వత మనువు, ఆ వైవస్వత మనువుకి ఇక్ష్వాకువు అనేవారు పుత్రులుగా జన్మించారు.

ఇక్ష్వాకు మహారాజుకి కకుత్థ్సుడు, ఆయనకి రఘువు, రఘువుకి అజమహారాజు, అజుడికి దశరథమహారాజు జన్మించారు.

లోకరక్షకుడైన శ్రీమన్నారాయణుడు రావణాది దుష్టరాక్షసుల్ని సంహిరించటం కోసం తానే నాలుగు అంశాలుగా మారి దశరథ మహారాజుకి కౌసల్య ద్వారా శ్రీరాముడిగా, కైకేయి ద్వారా భరతుడిగా, సుమిత్రాదేవి ద్వారా లక్ష్మణ-శత్రుఘ్నులుగా అవతరించాడు. ఈ జననం ఎలా జరిగిందంటే సంతాన లేమితో బాధపడుతున్న దశరథమహారాజుకి ఋష్యశృంగమహర్షి యజ్ఞం చేసి పాయసాన్ని బహూకరించగా ఆ పాయసాన్ని స్వీకరించిన కౌసల్యాదులకి శ్రీరామాదులు జన్మించారు.

ఒకనాడు విశ్వామిత్రుడు తన యాగాన్ని సంరక్షించటంకోసం రామలక్ష్మణుల్ని తనతో పంపమని దశరథుణ్ణి కోరాడు. దశరథుడు ఆనందంగా తన పుత్రుల్ని ఆయన వెంట పంపాడు. విశ్వామిత్రుని యాగాన్ని రక్షిస్తున్న రాముడు తాటకి అనే రాక్షసిని సంహరించి ఆయనకి ఆనందాన్ని కలిగించాడు. తరువాత విశ్వామిత్రుడి అనుగ్రహంతో ఎన్నో శస్త్రాస్త్రాల్ని పొందాడు.

రాముడు తాను పొందిన అస్త్రాలలో మానవాస్త్రాన్ని ప్రయోగించి మారీచుణ్ణి హతమార్చాడు. అలాగే యజ్ఞాన్ని పాడుచేయటానికి వస్తున్న సుబాహుణ్ణి సైన్యసమేతంగా వధించాడు. తరువాత సిద్ధుడైన విశ్వామిత్రుడి ఆశ్రమంలో కొంతకాలం గడిపి, ఆయనతో కలిసి జనక మహారాజు నిర్వహిస్తున్న సీతా స్వయంవరానికి వెళ్ళాడు.

శతానంద మహర్షి విశ్వామిత్రుడి గొప్పతనం గురించి శ్రీరాముడికి చెప్పాడు. జనకమహారాజు చేస్తున్న యాగశాలకి ముందుగా విశ్వామిత్రుడు రామలక్ష్మణులు వెళ్ళారు. అక్కడ జనకమహారాజు విశ్వామిత్రుడితో పాటు శ్రీరాముణ్ణి కూడా సత్కరించి పూజించాడు.

తరువాత శ్రీరాముడు స్వయంవర మండపంలో ప్రవేశించి శివధనస్సుని ఎక్కుపెట్టి దాన్ని సునాయాసంగా విరిచాడు. జనక మహారాజు ఎంతో ఆనందంగా అయోనిజ, భూమిజ అయిన తన కుమార్తె సీతని శ్రీరాముడికి సమర్పించాడు. తరువాత రాముడు తల్లి తండ్రుల్ని పిలిపించి వారంతా వచ్చాక తాను సీతని, లక్ష్మణుడు ఊర్మిళాదేవిని, జనకుడి సోదరుడైన కుశధ్వజుడి కుమార్తెలైన మాండవీ-శ్రుతకీర్తుల్ని భరత, శత్రుఘ్నులు వివాహం చేసుకున్నారు.

వివాహం శుభప్రదంగా జరిగాక జనకుడు రాముణ్ణి తగురీతిగా సత్కరించాడు. అక్కడి నుంచి వశిష్ఠుడితో బయలుదేరిన రాముడు దారిలో పరశురాముణ్ణి జయించి అయోధ్యకి క్షేమంగా చేరుకున్నాడు.

# అయోధ్య కాండ

రాముడి సోదరుడైన భరతుడు తన మేనమామ ఇంటికి వెళ్ళాడు. ఇక్కడ అయోధ్యలో రాముడు తండ్రి దశరథుణ్ణి సేవిస్తున్నాడు. ఒకరోజు దశరథుడు రాముణ్ణి పిలిచి "రామా! నీ గుణ గణాలు విని మన అయోధ్యా నగర ప్రజలు ఎప్పుడో తమ మనసుల్లో నిన్ను రాజ్యాభిషిక్తుణ్ణి చేసారు. కనుక రేపు ఉదయం నీకు యౌవరాజ్యాభిషేకం శాస్త్రోక్తంగా చేయాలనుకుంటున్నాను. ఈ రోజు రాత్రి నీవు సీతా సహితుడవై వ్రతాన్ని అవలంబించు" అన్నాడు. వశిష్ఠుడు, సృష్టి, జయంతుడు, విజయుడు, సిద్ధార్థుడు, రాష్ట్ర వర్ధనుడు, అశోకుడు, ధర్మపాలుడు, సుమంతుడు అనే ఎనిమిది మంది మంత్రులు కూడా అదే విషయాన్ని రాముడికి చెప్పారు.

తండ్రి ఆజ్ఞని పాటించి రాముడు ఆ రోజు రాత్రి దేవతల్ని పూజించి సీతాదేవితో సహా వ్రతాన్ని అవలంబించాడు. దశరథుడు వశిష్ఠ మహర్షితో శ్రీరామపట్టాభిషేకానికి కావలసిన ఏర్పాట్లన్నిటినీ పర్యవేక్షించమని కోరి కైకేయి భవనానికి వెళ్ళాడు. అంతకుముందే కైకేయి ఇష్టసఖి మంధర అయోధ్యానగరాన్ని అలంకరించటం, శ్రీరాముడికి పట్టాభిషేకం జరగబోవటం లాంటి విషయాల్ని తెలుసుకుని తన యజమానురాలైన కైకేయికి చెప్పింది. పూర్వం ఏదో కారణంగా కైకేయి అపరాధం చేయగా శ్రీరాముడు ఆమెకి ఏదో చిన్న శిక్ష విధింపచేసాడు. అది మనసులో ఉంచుకున్న కైకేయి రాముడి మీద వైరాన్ని పెంచుకుంది.

మంధర ఆమె దగ్గరకి చేరి అమ్మా! ఇకనైనా మేలుకోండి. శ్రీరాముడికి రాజ్యాభిషేకం చేస్తే అది మీకూ నాకు మరణ సదృశమే. అది ఆపటానికి ఏదైనా చేయండి అని నూరిపోసింది. మంధర మాటలు విన్న కైకేయి "మంధరా! నాకు భరతుడు ఎంతో శ్రీరాముడు అంతే. అయితే నా కొడుకు రాజవ్వాలని నాకూ ఉంది. ఏం చేయాలో తెలియటం లేదు. ఎవరు రాజైతే ఏముందిలే" అని అన్నది.

కైకేయి మాటలు మంధరకి కోపం తెప్పించాయి. ఆమె మీద ఉన్న చనువుతో ఓ పిచ్చితల్లీ॥ ఇప్పుడు జాగ్రత్త పడకపోతే నీకు మంచి జరగదు.

రాముడు రాజయ్యాడు. అతడి కుమారుడు అతడి తరువాత ఆ కుమారుడి కుమారుడు రాజులవుతారు గానీ నీ భరతుడు ఎప్పటికీ రాజుకాలేడమ్మా! నీ కొడుకు రాజవ్వాలంటే ఒకే ఒక ఉపాయముంది చెబుతున్నా విను –

పూర్వం దేవాసుర సంగ్రామంలో శంబరుడు దేవతలందర్నీ సంహరించాడు. ఆ యుద్ధంలో నీ భర్త దశరథుడు కూడా పాల్గొన్నాడు. అయితే శంబరుడి చేతిలో మరణించకుండా నీ విద్యా ప్రభావంతో ఆనాడు ఆయన్ని కాపాడావు. అప్పుడాయన నీకు రెండు వరాలిచ్చాడు గుర్తుందా! ఇప్పుడా రెండు వరాల్నీ కోరుకో – వాటిలో ఒకటి నీ భరతుడికి పట్టాభిషేకం. రెండు శ్రీరాముడు పద్నాలుగు సంవత్సరాలు వనవాసం చేయటం అని దుర్బోధ చేసింది మందర. కైకేయికి ఈ మాటలు నచ్చాయి. ఇదే తగిన సమయం అని భావించి కోప గృహానికి వెళ్ళింది. మూర్ఛవచ్చిన దానిలా నేలపై పడింది.

దశరథుడు అంతఃపురానికి వచ్చాడు. అక్కడ కోపగృహంలో కైకేయి ఉందని తెలుసుకుని ఆమె దగ్గరకి వెళ్ళాడు. కైకేయి నేలపై పడివుంది. దశరథుడికి ఎంతో ఆందోళన కలిగింది. ఆమెని లేపి అనునయంగా దేవీ! ఎందుకిలా ఉన్నావు చెప్పు నీకేం కావాలి అని అడిగాడు. కైకేయి దశరథుడి చేత మాట తీసుకుని తాను అడగాలనుకున్న రెండు వరాల్నీ అడిగింది. ఆమె కోరికలు వినగానే దశరథుడికి ఒక్క క్షణం గుండె ఆగినంత పనయ్యింది. కొద్ది సేపట్లో తేరుకుని కైకేయితో –

ఓసి పాపాత్మురాలా! శ్రీరాముడు నీకేం అపకారం చేసాడు? నేనేం పాపం చేసాను? నీ కోరికలు సమంజసం కాదు. నీ కోసం నేనీ పని చేస్తే లోకం నన్ను క్షమించదు. భరతుడు కూడా అన్న మీద విపరీతమైన ప్రేమాభిమానాలు కలిగినవాడు. యుగధర్మం ప్రకారం పెద్దకుమారుడికే రాజ్యాధికారం లభిస్తుంది. నీవు కోరినట్టు భరతుడు రాజై రాముడు అడవుల పాలైతే నేను ప్రాణాలతో ఉండను. విధవగా మారి నీవే రాజ్యాన్ని పాలించుకో! సరే నీకు మాటిచ్చాను. కనుక నీ కోరికలు నెరవేరుస్తాను అని కోపంగా చెప్పి కైకేయి భవనం వదిలి రాముడి దగ్గరకి వెళ్ళాడు దశరథుడు.

శ్రీరామా! నేను కైకేయి చేత వచింపబడ్డానయ్యా! ఆమెకి మాటిచ్చి నీకు ద్రోహం చేస్తున్నాను. ఆమె నిన్ను పద్నాలుగు సంవత్సరాలు వనవాసం పంపించమంది. భరతుడికి పట్టంకట్టమంది. ఇప్పుడు నేనేం చేయాలి? నిన్ను వదిలి నేనెలా ఉండగలను అని భోరున విలపించాడు.

తండ్రి మాటలు విన్న రాముడు శాంతంగా తండ్రీ! మీ ఆజ్ఞని తల్లి కైకేయి మాటని శిరసావహిస్తాను. పితృవాక్య పరిపాలన కన్నా మించిన ధర్మం ఏముంది? మీరేమీ బాధపడకండి అని ఆయన్ని ఓదార్చి కౌసల్యకి కైకేయికి ప్రదక్షిణ చేసి పెద్దలందరికీ నమస్కరించి సీతా లక్ష్మణ సమేతంగా అడవికి బయలుదేరాడు. వనవాసానికి వెళ్తున్న రాముణ్ణి అయోధ్యా నగరవాసులంతా అనుసరించారు. ఆ రాత్రి తమసానదీ తీరంలో విడిది చేసి మర్నాడు పౌరులందర్నీ వెనక్కి పంపి తాను అడవిలోకి వెళ్ళిపోయాడు.

ఇక్కడ అయోధ్యలో రాముడు లేక దశరథుడు పిచ్చివాడైపోయాడు. కౌసల్యామందిరానికి వెళ్ళి అక్కడే ఓదార్పు పొందుతున్నాడు. అయోధ్యావాసులు కూడా రాముడి వియోగాన్ని తట్టుకోలేక భోరున విలపించారు.

నారచీరలు ధరించి సీతా లక్ష్మణ సమేతుడై రాముడు శృంగబేరపురానికి వెళ్ళాడు. అక్కడ గుహుడు వీరికి స్వాగత సత్కారాలు జరిపి వారిని తన పడవమీద గంగని దాటించి ప్రయాగ క్షేత్రంలో దించాడు. రాముడు ప్రయాగలో ఉన్న భరద్వాజ మహర్షికి నమస్కరించి అక్కణ్ణుంచి చిత్రకూటపర్వతానికి చేరుకున్నాడు. అక్కడే వాస్తు పూజచేసి ఒక కుటీరాన్ని నిర్మించుకుని నివసించసాగాడు.

ఒకనాడు రాముడు సీతాదేవిని తీసుకువెళ్ళి చిత్రకూట పర్వతమంతా చూపించాడు. అప్పుడొక కాకి సీతాదేవి మీద దాడిచేసి తన కాలిగోళ్ళతో ఆమెని గీరింది. అప్పుడు రాముడు ఐషీకాస్త్రాన్ని ప్రయోగించి ఆ కాకి కన్ను పోగొట్టాడు. చివరికా కాకి ఆయన్నే వచ్చి శరణువేడింది.

ఇక్కడ అయోధ్యలో దశరథుడు కౌసల్యా తదితరులకి పూర్వం తన జీవితంలో జరిగిన ఒక సంఘటన గురించి ఇలా చెప్పాడు. "నేను కౌమార దశలో ఉన్నప్పుడు సరయూనదీ తీరంలో కుండని నీళ్ళలో ముంచి పైకి తీస్తున్న ఒక మునికుమారుణ్ణి దూరం నుంచి నా శబ్దవేధి విద్యతో బాణం ప్రయోగించి చంపాను. అది చూసి ఆ పిల్లవాడి తల్లి తండ్రులు ఎంతో విలపించారు. నిజానికి ఆ శబ్దం ఏదో జంతువుదనుకున్నాను. అక్కడొక పిల్లవాడున్నాడన్న విషయం ఎక్కడో దూరాన ఉన్న నాకు తెలియలేదు. నేను పరుగున వెళ్ళి ఆ బాలుడి తల్లి తండ్రుల్ని ఓదార్చాను. వారిద్దరూ "మాకీ పుత్రుడే ఆధారం. వాడులేని మేమిక జీవించలేం. మేమెలా పుత్రశోకంతో మరణిస్తున్నామో! నీవు కూడా అలాగే పుత్రశోకంతో మరణిస్తావు. ఇది తథ్యం" అని నన్ను శపించి ప్రాణాలు విడిచారు." దేవీ ఇది ఆనాడు జరిగిన సంఘటన అని చెప్పి విలపిస్తూ ఒక్కసారి హా రామా! అని గుండె పట్టుకుని నేలకొరిగి పోయాడు. దశరథుడి మరణంతో అయోధ్యానగరమంతా చింతాక్రాంతమయ్యింది.

దశరథుడు మరణించిన వార్త భరతుడికి తెలిసింది. వెంటనే మేనమామ ఇంటినుంచి బయలుదేరి అయోధ్యకి వచ్చాడు. తండ్రి మరణానికి ఎంతో చింతించి అందుకు కారకురాలైన తన తల్లి కైకేయిని దారుణంగా నిందించాడు. శాస్త్రోక్తంగా తండ్రికి సరయూనదీతీరంలో అంత్యక్రియలు నిర్వహించి దుఃఖసాగరంలో మునిగిపోయాడు. కొద్ది రోజుల తరువాత వశిష్ఠాది మహర్షులు వచ్చి నాయనా! నీ అన్నగారు వనవాసానికి వెళ్ళాడు. ఇక నీవు అయోధ్యా నగరాన్ని పాలించు అని చెప్పారు. అప్పుడు వారితో భరతుడిలా అన్నాడు.

"గురుదేవా! నేను కాదు రాముడే అయోధ్యకి వారసుడు. నేనెలాగైనా ఒప్పించి ఆయన్నిక్కడికి తీసుకువస్తానని" చెప్పి రాముడి దగ్గరకి పరివారంతో సహా బయలుదేరాడు. శృంగబేరం దాటి అక్కణ్ణుంచి ప్రయాగ చేరి భరద్వాజుడి ఆశీర్వచనాలు అందుకుని సరాసరి చిత్రకూటంలో ఉన్న రాముడి దగ్గరకి వెళ్ళాడు.

అన్నా! రామచంద్రా! ఎంతో ఘోరం జరిగిపోయింది. నీవులేని దిగులుతో మన తండ్రిగారు మరణించారు. నీవు వెంటనే వచ్చి అయోధ్యానగరాన్ని పాలించు.

నీవే అందుకు తగిన వాడివి” అని చెప్పి విలపించాడు. రాముడు కూడా తండ్రి మరణవార్త విని ఎంతో దుఃఖించాడు. కొద్దిసేపటికి తేరుకుని యథావిధిగా తండ్రికి తర్పణాలు విడిచాడు. భరతుణ్ణి దగ్గరకి పిలిచి “భరతా నేను పితృవాక్య పరిపాలన చేస్తూ వనవాసానికి వచ్చాను. మధ్యలో వెనక్కి రావటం ధర్మంకాదు. కనుక ఇదిగో నా పాదుకల్ని ఇస్తున్నాను వీటిని తీసుకెళ్ళి నీవే రాజ్యపాలన చేయి” అని నచ్చచెప్పి పంపించాడు. చేసేదేమీలేక అన్నమాటని గౌరవించి ఆయన పాదుకల్ని తీసుకున్న భరతుడు అయోధ్యకి వెళ్ళకుండా నందిగ్రామం చేరి అక్కడే నివసిస్తూ రామ పాదుకల్ని పూజిస్తూ రాజ్యాన్ని పాలించాడు.

## అరణ్యకాండ

రాముడు భరతుణ్ణి వెనక్కి పంపిన తరువాత చిత్రకూటాన్ని వదిలి దండకారణ్యంలోకి బయలుదేరాడు. దారిలో అత్రిమహర్షి ఆశ్రమాన్ని దర్శించి, అత్రి భార్య అనసూయని, అక్కడేవున్న శరభంగుణ్ణి అగస్త్యభ్రాతని, అగస్త్యుణ్ణి చూసి నమస్కరించాడు. అగస్త్యమహర్షి ధనస్సుని, ఖడ్గాన్ని రాముడికి అందించగా వాటిని స్వీకరించి దండకారణ్యంలోకి వెళ్ళాడు రాముడు. ఆ దండకారణ్యంలో జనస్థానం అనే సుందరమైన ప్రాంతం ఉంది. అది గోదావరీ తీరం. అక్కడే అందమైన పంచవటీ క్షేత్రం ఉంది. రాముడికి సీతకి ఆ ప్రాంతం ఎంతో నచ్చింది. వారు అక్కడే తమ నివాసాన్ని ఏర్పర్చుకున్నారు.

ఒకనాడు భయంకరురాలైన శూర్పణఖ అనే ఖరుడి సోదరి పంచవటికి వచ్చింది. అక్కడున్న రాముడి అందచందాలు చూసి మురిసి పోయింది. కామమోహితురాలైన శూర్పణఖ రాముడి దగ్గరకి వెళ్ళి నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నన్ను పెళ్ళి చేసుకో. మనకి అడ్డు లేకుండా వారిద్దర్నీ భక్షిస్తాను అని చెప్పింది. వెంటనే సీతా, లక్ష్మణుల్ని చంపబోయింది. అప్పుడు రాముడి ఆజ్ఞతో లక్ష్మణుడు శూర్పణఖ ముక్కు చెవులు కోసి పంపించాడు.

రక్తం కారుతున్న చెవులతో శూర్పణఖ తన అన్న ఖరుడి దగ్గరకి వెళ్ళి “అన్నా! పంచవటిలో ఎవరో ఇద్దరు రాకుమారులున్నారు. వారిలో ఒకర్ని

నేను వరించాను. మరొకడు నా ముక్కు చెవులు ఇదిగో ఇలా కోసి పంపాడు. నీవు వెంటనే వెళ్ళి వాళ్ళందర్నీ చంపిరా. లేకపోతే నేను జీవించను" అని చెప్పి విలపించింది.

చెల్లెలు బాధ చూడలేని ఖరుడు ఆమెని ఓదార్చి వెంటనే పద్నాలుగువేల మంది రాక్షసుల్ని వెంటబెట్టుకుని శ్రీరాముడితో యుద్ధం చేయటానికి బయలుదేరాడు. రాముడు తన శస్త్రాస్త్రాలతో ఖరుడిసైన్యాన్ని దారుణంగా చిత్రహింసల పాలుచేసాడు. అలా అందరు రాక్షసుల్ని చంపి చివరికి ఖర–దూషణలు ఇద్దర్నీ యమలోకానికి పంపించాడు.

రాముడి చేతిలో తన అన్నలిద్దరూ మరణించారని తెలుసుకున్న శూర్పణఖ లంకకి వెళ్ళి రాముడు ఖర– దూషణుల్ని చంపిన విషయం చెప్పింది. ఎంతో నిష్ఠూరంగా "అన్నా! నీవు రాజువే అయితే వెళ్ళి ప్రతీకారం తీర్చుకో పంచవటిలో ఉన్న రాముడి భార్య చాలా అందమైనది. ఆమెని అపహరించుకురా. అప్పుడు గానీ ఆ రాముడికి బుద్ధిరాదు. అతడు మన రాక్షసవీరులందర్నీ చంపాడు. ప్రతీకారం తీర్చుకోవలసిందే. ఇది నీకే సాధ్యం. ఆ రామలక్ష్మణుల రక్తం నాకు కావాలి. అన్నా! లే వెళ్ళు. ఆ సీతను తెచ్చి నీ భార్యగా చేసుకో" అని విన్నవించింది.

శూర్పణఖ మాటలు విన్న రావణుడు ఆమెని ఓదార్చి ఆమె చెప్పినట్టే చేస్తానని మాటిచ్చాడు. వెంటనే మహామాయగాడైన మారీచుణ్ణి పిలిచి "మారీచా! నీవు పంచవటికి వెళ్ళు. అక్కడ బంగారు లేడి రూపాన్ని ధరించి రామలక్ష్మణుల్ని ఆకర్షించి వారిని ఆశ్రమం నుంచి దూరంగా తీసుకుపో. అదే సమయంలో నేను వెళ్ళి సీతను అపహరిస్తా నేను చెప్పినట్టు చేయకపోతే నీకు నా చేతిలో చావు తప్పదు" అని హెచ్చరించి పంపించాడు.

మారీచుడు రావణుడి మాట ప్రకారం పంచవటికి బయలుదేరాడు. దారిలో ఇలా అనుకున్నాడు "ధనుర్ధారి అయిన రాముడు సాక్షాత్తు మృత్యుదేవతే. ఆయన బాణం ఎక్కుపెడితే దాని దెబ్బకి ఎవరైనా చావవలసిందే. నేనీ పని చేయకపోతే రావణుడు చంపుతాడు. చేస్తే రాముడి చేతిలో చావు తప్పదు.

సరే రావణుడి కన్నా ధర్మాత్ముడైన రాముడి చేతిలో చావటం మంచిది కదా!" అని అనుకున్నాడు. పంచవటిలోకి వచ్చిన మారీచుడు బంగారు లేడి రూపాన్ని ధరించి సీతాదేవికి కనిపించేలా సంచరించసాగాడు.

అందంగా గెంతులేస్తున్న బంగారు లేడిని సీతాదేవి చూసింది. ఎంతో ముచ్చట పడింది. వెంటనే రాముణ్ణి పిలిచి "నాథా! నాకా జింక కావాలి. ఎలాగైనా దాన్ని పట్టి తీసుకురండి" అని కోరింది. భార్య కోరిక తీర్చాలని భావించిన రాముడు లక్ష్మణుణ్ణి అక్కడే ఉంచి లేడిని పట్టుకోవటానికి బయలుదేరాడు. లేడి గెంతుతూ పారిపోయింది. రాముడు దాన్ని వెంబడిస్తున్నాడు. అది ఇక దొరకదని గ్రహించిన రాముడు దానిమీదకి బాణాన్ని ప్రయోగించాడు. లేడి రూపంలో ఉన్న మారీచుడు "హా సీతా! హా లక్ష్మణా! రక్షించండి" అని గట్టిగా అరిచి మరణించాడు.

అప్పటికే రాముడు లేడిని వెంబడించి చాలాదూరం వచ్చాడు. లేడి అరుపులు ఆయనకి చాలా విచిత్రంగా అనిపించాయి. అంతలో ఆ మాటలు మారీచుడి మాయా ప్రభావం వల్ల దూరంగా వున్నప్పటికీ పంచవటిలో ఉన్న సీతా-లక్ష్మణులకి వినిపించాయి. అయితే లక్ష్మణుడు అదేదో మాయ అని ఊరుకున్నాడు. కానీ సీతాదేవి అది గ్రహించక లక్ష్మణుణ్ణి రాముడికోసం పంపించింది.

లక్ష్మణుడు పంచవటిని విడిచి తప్పనిసరై రాముడి కోసం బయలుదేరాడు. అతడు అటు వెళ్ళాడో లేదో రావణుడు మారువేషంలో వచ్చి సీతను అపహరించి పుష్పక విమానంలో లంకకి తీసుకుపోయాడు. దారిలో అడ్డుపడ్డ జటాయువుని దారుణంగా గాయపరిచాడు. లంకకు తీసుకువెళ్ళిన సీతని అక్కడున్న అశోకవనంలో బంధించి" ఓ సీతా! నన్ను వరించు. నీకు సకల భోగాలూ అందిస్తాను. ఈ విశాల లంకారాజ్యానికి నిన్ను రాణినిచేస్తాను" అని కోరాడు. సీత మౌనంగా ఉంది. వెంటనే అక్కడున్న రాక్షసుల్ని పిలిచి ఈమెని జాగ్రత్తగా సంరక్షించండి అని ఆజ్ఞాపించి వెళ్ళాడు.

బంగారు లేడిని చంపిన రాముడు దాని దగ్గరకెళ్ళి చూడగా అక్కడ లేడి స్థానంలో రాక్షసుడు చచ్చిపడివున్నాడు. అదే సమయానికి రాముణ్ణి వెతుకుతూ లక్ష్మణుడక్కడికి వచ్చాడు. ఇద్దరూ అది మాయా మృగమని తమని మోసం చేసిందని గ్రహించారు. అంతలో సీతాదేవిని ఒంటరిగా వదిలి వచ్చిన సంగతి గుర్తుకువచ్చింది. హుటాహుటిన ఇద్దరూ తమ ఆశ్రమానికి బయలుదేరారు.

రామలక్ష్మణులు ఆశ్రమానికి వచ్చి చూసేసరికి సీతాదేవి అక్కడ కనిపించలేదు. అయ్యో! అనుకున్నదంతా జరిగింది. సీతను ఎవరో అపహరించారు. సీతా ఎక్కడున్నావు? అంటూ రాముడు విలపించసాగాడు. అన్న దుఃఖాన్ని చూసి లక్ష్మణుడు కూడా చలించి పోయాడు. ఇద్దరూ కలిసి సీతను అన్వేషించటం ప్రారంభించారు.

అలా అడవంతా సీత కోసం గాలిస్తున్న రామలక్ష్మణులకి ఒకచోట గాయాలతో కొన ఊపిరి కొట్టుకుంటున్న జటాయువు కనిపించాడు. ఆ పక్షిరాజు రాముణ్ణి చూసి "ప్రభూ! నీ భార్య సీతని రావణాసురుడనే లంకాధిపతి అపహరించాడు. అతన్ని అడ్డుకోబోతే ఇదిగో నాకీ దుర్గతి కలిగించాడు" అని చెప్పి ప్రాణాలు విడిచాడు. ఆ మాటలు విని రాముడు ఎంతో దుఃఖించాడు. కొద్ది సేపటికి దుఃఖాన్ని దిగమింగుకుని జటాయువుకి అంతిమ సంస్కారాలు చేసాడు.

వారిద్దరూ అలా ముందుకు సాగగా దారిలో కబంధుడనే రాక్షసుడు వారిని అడ్డుకున్నాడు. రాముడు కబంధుణ్ణి బాణంతో కొట్టాడు. వాడు శాపవిముక్తుడై "సీతా దేవి జాడ తెలుసుకోవటానికి సుగ్రీవుడి దగ్గరికి వెళ్ళమని" రాముడికి చెప్పి అదృశ్యమయ్యాడు.

## కిష్కింధ కాండ

సీతను అన్వేషిస్తూ రాముడు పంపానదీ తీరానికి చేరుకున్నాడు. అక్కడే శబరి ఆయనకి ఆతిథ్యమిచ్చింది. తరువాత హనుమంతుడు కనిపించి రాముణ్ణి

ఆప్తమిత్రుడిగా స్వీకరించాడు. ఒకనాడు సుగ్రీవుడు చూస్తుండగా ఒకే బాణంతో రాముడు ఏడు తాళ వృక్షాల్ని ఛేదించాడు. అలాగే దుందుభి అనే రాక్షసుడి శరీరాన్ని ఒక్క బాణం దెబ్బతో పదియోజనాల దూరంలో పడేలా విసిరేశాడు.

సుగ్రీవుడి భార్యను అపహరించి అన్యాయంగా అతడికి ద్రోహం చేసిన వారిని వధించి ఋష్యమూక పర్వతం మీదున్న కిష్కింధ రాజ్యానికి తిరిగి సుగ్రీవుణ్ణి రాజుగా చేసాడు. వాలి చెరపట్టిన అతడి భార్య రుమని తిరిగి అతడి దగ్గరకి చేర్పించాడు. ఆ కృతజ్ఞతతో సుగ్రీవుడు రాముణ్ణి గాఢంగా కౌగిలించుకుని మిత్రమా! నాకెంతో మేలు చేసావు. ఇందుకు బదులుగా నీ భార్య సీతను ఎలాగైనా అన్వేషించి నీకు చెబుతాను అని ప్రమాణం చేసాడు.

సుగ్రీవుడి మాటలు విన్నాక రాముడికి ధైర్యం వచ్చింది. అంతలోనే వర్షాకాలం కూడా వచ్చింది. ఆ నాలుగు మాసాలూ అన్వేషణ కొనసాగటం కష్టం. కనుక రాముడు మాల్యవంత పర్వతం మీద ఎలాగో సీతావిరహాన్ని తట్టుకుంటూ కాలం గడిపాడు.

వర్షాకాలమంతా సుగ్రీవుడు తన భార్యతో, పరివారంతో ఆనందంగా కాలం గడిపి సీతాన్వేషణ చేస్తానన్న విషయం మర్చిపోయాడు. అప్పుడు లక్ష్మణుడు అక్కడికి వచ్చి "సుగ్రీవా! మాటమీద నిలబడు. సీతను అన్వేషిస్తానన్న విషయం మర్చిపోయి ప్రవర్తిస్తున్నావు. ఇది నీకు భావ్యం కాదు అని హెచ్చరించాడు.

లక్ష్మణుడి మాటలతో సుగ్రీవుడికి తన తప్పు తెలిసివచ్చింది. వెంటనే రాముడి దగ్గరకి వెళ్ళి ఆయన పాదాలకి నమస్కరించి క్షమాపణ కోరాడు. తక్షణమే వానరవీరులందర్నీ పిలిచి తలో దిక్కుకీ పంపి ఒక్క నెలలోపు సీతాదేవి ఎక్కడుందో తెలుసుకుని రావాలి. లేకపోతే మీకు మరణం తప్పదు! అని హెచ్చరించి పంపించాడు. అందరూ సుగ్రీవాజ్ఞను అనుసరించి సీతాన్వేషణ కోసం బయలుదేరారు.

హనుమంతుడు రాముడి ఉంగరాన్ని తీసుకుని కొంతమంది వానరులతో కలిసి దక్షిణ దిశలో ఉన్న సప్రభ అనే గుహదగ్గరకి వచ్చాడు.

ఆ ప్రాంతమంతా అన్వేషించారు. వారికి ఎక్కడా సీత జాడ కనిపించలేదు. అంతలో ఒక మాసం గడువు పూర్తయ్యింది. వారంతా తమలో తాము ఇన్నాళ్ళు గడిచాక కూడా సీతజాడ తెలుసుకోలేకపోయాం. ఇక మనకి సుగ్రీవుడి చేతిలో మరణ దండన తప్పదు. సీతాదేవికోసం ఎదిరించి రావణుడి చేతిలో ప్రాణం కోల్పోయిన ఆ జటాయువు ఎంత ధన్యుడోకదా!" అని అనుకున్నారు.

రాముడి ప్రస్తావన జటాయువు పేరు విన్నాడు అక్కడున్న సంపాతి (పక్షి). వెంటనే ఆ వానరుల దగ్గరకి వచ్చి "వానరులారా! మీరు ప్రస్తావించిన జటాయువు నా సోదరుడు. ఒకనాడు నాతో కలిసి సూర్యమండలం వైపు ఎగిరాడు. సూర్యుడు వేడికి అతడు కాలిపోతుంటే నేను నా రెక్కలు కప్పి అతన్ని రక్షించాను. దానితో అతడు వేడినుంచి తప్పించుకోగా నా రెక్కలు కాలిపోయాయి. రాముడి కథని వినగానే నా రెక్కలు నాకు తిరిగి మొలిచాయి.

"వానరులారా! దుష్టరావణుడు నా సోదరుణ్ణి వధించాడు. వంద యోజనాల విస్తీర్ణంతో దక్షిణ దిక్కున పెద్ద సముద్రం ఉంది. దానిమధ్యలో రావణుడి లంకారాజ్యం నెలకొంది. ఆ లంకలో ఉన్న ఆశోకవనంలో సీతాదేవి బంధించబడి నాకు కనిపించింది. వెంటనే ఆ విషయాన్ని రామసుగ్రీవులకి చెప్పండి" అని అన్నాడు.

## సుందర కాండ

సంపాతి ద్వారా లంకలో సీతాదేవి ఉందన్న విషయాన్ని తెలుసుకున్న హనుమంతుడు, రామకార్యాన్ని సాధించటం కోసం వందయోజనాల విస్తీర్ణంలో ఉన్న సముద్రాన్ని దాటి లంకలోకి ప్రవేశించాడు. హనుమంతుడు సముద్ర లంఘనం చేసేడప్పుడు దారిలో పైకి లేచిన మైనాక పర్వతాన్ని చూసాడు. తరువాత తనని చంపాలని ప్రయత్నించిన సింహికని వధించి లంకలోకి వెళ్ళాడు.

లంకరాజ్యంలోకి ప్రవేశించిన హనుమంతుడు రావణుడి అంతఃపురాన్ని, కుంభకర్ణ విభీషణ ఇంద్రజిత్తు తదితరుల గృహాల్ని అన్నీ గాలించాడు. ఎక్కడా ఆయనకి సీతజాడ కనిపించలేదు. అప్పుడు ఎంతో చింతిస్తూ అక్కడున్న

అశోక వనంలోకి ప్రవేశించాడు. ఆ వనంలో విశాలమైన శింశుపావృక్షం వుంది. దాని మీదకెక్కి విశ్రాంతి తీసుకుంటున్నాడు. ఆ చెట్టు క్రిందే సీతాదేవి కూర్చుని ఉంది. అంతలో రావణుడు అక్కడికి వచ్చి సీతాదేవితో "దేవీ! నన్ను వరించు అని ప్రాధేయపడ్డాడు. చెట్టుమీదున్న హనుమంతుడికి ఈ మాటలు వినిపించాయి. కొమ్మలచాటు నుంచి క్రిందికి చూసాడు. ఎదురుగా రావణుడు శోకవదనంతో ఉన్న సీతాదేవి కనిపించారు. కొద్దిసేపటికి రావణుడు అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

హనుమంతుడు ఎంతో ఆనందంగా క్రిందకి దిగాడు. కాపలావున్న రాక్షసులకంట పడకుండా సీతాదేవి దగ్గరకి వెళ్ళి రాముడు క్షేమసమాచారాన్ని చెప్పి ఆయనిచ్చిన ముద్రికని సీతాదేవికి చూపించాడు. సీతాదేవి రాముడి ఉంగరాన్ని తీసుకుని ఓ వానరా! నిజంగా రాముడు జీవించి ఉన్నాడా? ఉంటే నన్నెందుకు ఇక్కణ్ణుంచి తీసుకుపోలేదు? అని ప్రశ్నించింది. అప్పుడు హనుమంతుడు ఆమెతో ఇలా అన్నాడు.

అమ్మా! సీతమ్మ తల్లీ! నీ కోసం రాముడు ఎన్నో ప్రదేశాలు గాలించాడమ్మా! ఆయనకి నీవెక్కడున్నదీ ఇప్పటిదాకా తెలియలేదు. ఇప్పుడు నే వెళ్ళి ఆయనకి నీ జాడ తెలిసిందని చెబుతాను. అతి త్వరలో సైన్యంతో లంకపై దండెత్తి నిన్ను తీసుకెళతాడు తల్లీ! నీవు ధైర్యంగా ఉండు" అని ఓదార్చాడు.

హనుమ మాటలు విన్న సీతాదేవికి ధైర్యం వచ్చింది. రాముడు తనని విడిపిస్తాడన్న నమ్మకం కుదిరింది. హనుమంతుడు ఆమెతో తల్లీ! నాకు ఏదైనా ఒక గుర్తు ఇస్తే దాన్ని రాముడికి చూపిస్తానని అడిగాడు. సీత తన చూడామణిని తీసి హనుమకిచ్చింది. హనుమంతుడు దాన్ని భద్రంగా దాచుకుని అతి త్వరలోనే తిరిగి వస్తానని చెప్పి బయలుదేరాడు.

అశోకవనం దాటి బైటికి వచ్చిన హనుమంతుడికి రావణుణ్ణి చూసి అతడికి ఒక గుణపాఠం నేర్పాలని అనిపించింది. వెంటనే తిరిగి అశోక వనంలోకి వెళ్ళి అక్కడున్న చెట్లని విరిచి అడ్డుకున్న ద్వారపాలకులందర్నీ చంపి

నానా భీభత్సం చేసాడు. ఆ విధ్వంసంలో భాగంగా రావణాసురుడి ఏడుగురు మంత్రికుమారుల్ని, రావణుడి పుత్రుడైన అక్షకుమారుణ్ణి వధించాడు. ఆ బీభత్సాన్ని ఆపటానికి ఇంద్రజిత్తు అక్కడికి వచ్చి నాగపాశంతో హనుమని బంధించి రావణుడి ఎదుట నిలబెట్టాడు.

రావణుడు హనుమని చూసి ఎవరు నీవు? అని ప్రశ్నించగా "నేను రాముడి దూతను. నా పేరు హనుమంతుడు. నీవు అన్యాయంగా అపహరించిన రాముడి భార్య సీతాదేవిని ఆయనకి అప్పగించు. లేకపోతే రాముడి బాణాల ధాటికి నీవు ఈ లంకలో వున్న రాక్షసులందరూ మరణిస్తారు. జాగ్రత్తగా ఆలోచించి మంచి నిర్ణయం తీసుకో" అని హెచ్చరించాడు హనుమంతుడు.

హనుమ మాటలు విన్న రావణుడికి ఒక్కసారిగా కోపం వచ్చింది. వెంటనే హనుమని చంపబోయాడు. అంతలో రావణుడి సోదరుడు విభీషణుడు అన్నని వారించి దూతని చంపకూడదని చెప్పాడు. అప్పుడు రావణుడు హనుమ తోకకి నిప్పంటించి వదిలిపెట్టమని ఆజ్ఞాపించాడు. రావణాజ్ఞ ప్రకారం అనుచరులు ఆయన తోకకి నిప్పంటించారు. హనుమంతుడు వారికి తగినశాస్తి చేయాలని భావించి నిప్పంచిన తోకతో లంకనంతా తగులబెట్టాడు.

ఆ విధంగా సీతను చూసి లంకని కాల్చి హనుమంతుడు సరాసరి రాముడి దగ్గరకి తిరిగి వచ్చాడు. 'చూసాను సీతను' అని రాముడికి శుభవార్తని చెప్పి ఆమె ఇచ్చిన చూడామణిని రాముడికి చూపించాడు. రాముడు ఎంతో ఆనందించి హనుమా! సీత ఎలాఉంది? ఏం చేస్తుంది? నాతో ఏం చెప్పమంది? అని ఆత్రంగా ప్రశ్నించాడు. హనుమంతుడు తాను లంకకు వెళ్ళిన దగ్గర్నుంచీ జరిగిన విషయాలు రాముడికి చెప్పాడు. అంతా విన్న రాముడు సీతాదేవి దుఃస్థితిని తలుచుకుని విలపించగా సుగ్రీవాదులు ఆయన్ని ఓదార్చారు. తరువాత అందరూ కలిసి సముద్ర తీరానికి చేరుకున్నారు.

అక్కడ లంకలో విభీషణుడు రావణుడి దగ్గరకి వెళ్ళి సోదరా! పరులభార్యని అపహరించటం ధర్మవిరుద్ధం. నీ వంటి మహాపురుషుడు అలాంటి

పనిచేయటం ఏమాత్రం తగదు. ఇప్పటికైనా మించిపోయింది లేదు. సీతాదేవిని రాముడికి అప్పగించి శరణువేడుకో. ఆయన దయామయుడు" అని ఉపదేశించాడు. అయితే గర్వం తలకెక్కిన రావణుడికి ఆ మాటలు ఏమాత్రం రుచించలేదు. అది విని ఊరుకోకుండా సోదరుడైన విభీషణుణ్ణి ఘోరంగా అవమానించాడు. అన్న ద్వారా అవమానించబడ్డ విభీషణుడికి ఇక లంకారాజ్యంలో ఉండాలనిపించలేదు. వెంటనే అక్కణ్ణుంచి బయలుదేరి రాముడి దగ్గరకి వచ్చి శరణు వేడుకున్నాడు. రాముడు విభీషణుణ్ణి అక్కున చేర్చుకుని, అతడి ధర్మబుద్ధిని ప్రశంసించి ఆ సముద్ర తీరంలోనే విభీషణుడిని లంకా రాజ్యాధిపతిగా అభిషేకించాడు.

లంకమీదకి దండెత్తటానికి దారిమ్మని రాముడు సముద్రుణ్ణి కోరాడు. అయితే సముద్రుడు రాముడి కోరికని వినీ విన్నట్టు ఊరుకున్నాడు. రాముడికి సముద్రుడి మీద ఆగ్రహం కలిగింది. ఒక్కసారి సముద్రుడి కేసి తన ధనస్సుని ఎక్కుపెట్టాడు. అంతే, చేసిన తప్పు గ్రహించిన సముద్రుడు పరుగున వచ్చి రాముడి పాదాలమీద పడ్డాడు. నలుడి ద్వారా తన (సముద్రం) మీద సేతువుని కట్టించి లంకకి వెళ్ళమని చెప్పాడు. రాముడు నలుణ్ణి పిలిచి సేతువు నిర్మించమని ఆజ్ఞాపించగా నలుడు అపారమైన వానర సైన్యం సాయంతో కొండలు చెట్లు రాళ్ళు అన్నిటినీ తెప్పించి సముద్రం మీద పెద్ద వారధి నిర్మించాడు. ఆ విధంగా నలుడు నిర్మించిన సేతువు ద్వారా రాముడు వానర సైన్యంతో కలిసి సముద్రాన్ని దాటి సువేల పర్వతం మీదనుంచుని లంకని చూసాడు.

## యుద్ధ కాండ

రాముడు ముందుగా అంగదుణ్ణి తన రాయబారిగా రావణుడి దగ్గరకి పంపాడు. అంగదుడు రావణుడి దగ్గరకి వెళ్ళి "రావణా! సీతాదేవిని వెంటనే శ్రీరామచంద్రుడికి అప్పగించు. లేకపోతే ఆయన చేతిలో నీకు మరణం తప్పదు" అని హెచ్చరించాడు. అయితే మదోన్మత్తుడైన రావణుడు తననే హెచ్చరించిన అంగదుణ్ణి చంపబోయాడు. అంగదుడు తప్పించుకుని సరాసరి రాముడి

దగ్గరకొచ్చి "రామా! రావణుడు యుద్ధాన్నే కోరుతున్నాడు. మన మాటని అంగీకరించలేదు. పైగా నన్ను చంపబోయాడు" అని విన్నవించాడు.

అంగదుడి మాటలు విన్న రాముడు ఇక యుద్ధం చేయక తప్పదని నిశ్చయించి సకల వానర సైన్యాన్ని తీసుకుని లంకమీదకి దండెత్తాడు. రాముడి వెంట మహావీరులైన హనుమంతుడు, మైందుడు, ద్వివిదుడు, జాంబవంతుడు, నలుడు, నీలుడు, తారుడు, అంగదుడు, ధూమ్రుడు, సుషేణుడు, కేసరి, గజ, పనస, వినత, రంభ, శరభ, క్రధనుడు, గవాక్షుడు, దధివక్త్రుడు, గవయుడు, గంధమాదనుడు – వీరందరికీ నాయకుడుగా మహాబలవంతుడైన సుగ్రీవుడు బయలుదేరారు.

లంకకు చేరుకున్న వానర అసుర సైన్యానికి మధ్య ఘోరమైన యుద్ధం ప్రారంభమైంది. రాక్షసులు భయంకరమైన మారణాయుధాలతో వానర సైన్యాన్ని ఎదుర్కోగా వానరులు వృక్షాలు, గోళ్ళు, బండరాళ్ళు, ఉపయోగించి అసురుల్ని ఎదుర్కొన్నారు. ఆ విధంగా వారిద్దరి మధ్యా పోరు ఘోరంగా కొనసాగింది. చివరికి రథ గజ తుంగ పదాతి సైన్యంతో వచ్చిన రాక్షసమూకనంతా రాముడు తన బాణాలతో ఛిన్నాభిన్నం చేసి వారందరినీ దారుణంగా వధించాడు.

హనుమంతుడు రావణుడి సైన్యాధిపతి ధూమ్రాక్షుణ్ణి ఒక పెద్ద పర్వత శిఖరాన్ని ప్రయోగించి వధించాడు. నీలుడు ఆయుద్ధంలో ఆకంపన ప్రహస్తులనే అసురుల్ని పరిమార్చాడు. అంతలో ఇంద్రజిత్తు యుద్ధరంగంలోకి వచ్చి తన నాగపాశాలతో రామలక్ష్మణుల్ని బంధించాడు. అప్పుడు గరుత్మంతుడు అక్కడికి రాగా ఆయన్ని చూడగానే భయపడిపోయిన నాగులు రామలక్ష్మణుల్ని వదిలి పారిపోయాయి. తిరిగి పైకి లేచిన రామలక్ష్మణులు తమ బాణాలతో ఎంతోమంది అసురుల్ని సంహరించారు. అలా ముఖ్యమైన రాక్షసవీరులంతా రాముడి చేతిలో మరణించారు.

యుద్ధరంగంలోకి రావణుడు స్వయంగా ప్రవేశించాడు. రామరావణుల యుద్ధం ప్రారంభమైంది. ఒకరిపై ఒకరు దివ్యాస్త్రాల్ని ప్రయోగించుకున్నారు.

రాముడు తన శరపరంపరతో రావణుడి శరీరాన్ని ఛిన్నాభిన్నం చేసాడు. రావణుడు ఇక యుద్ధం చేయలేక వెనక్కి వెళ్ళిపోయి సోదరుడైన కుంభకర్ణుణ్ణి నిద్రలేపాడు.

దారుణమైన దీర్ఘనిద్రనుంచి పైకి లేచిన కుంభకర్ణుడు లేచిన వెంటనే వెయ్యి కడవల మద్యాన్ని తాగి, ఆ వెంటనే వంద మహిషాల్ని ఆహారంగా తిన్నాడు. తనని నిద్ర లేపిన రావణుడితో “అన్నా! నీవు ధర్మపరుడైన రాముడి భార్యని అపహరించి ఎంతో పాపం చేసావు. అయినా నీవు నా అగ్రజుడివి కనుక నీ కోసం యుద్ధరంగానికి వెళ్ళి రాముణ్ణి సంహరిస్తాను” అని చెప్పి యుద్ధరంగానికి  వచ్చాడు.

మహాభీకరంగా పెద్ద పర్వతంలా ఉన్న కుంభకర్ణుణ్ణి చూసి వానరసైన్యం భయంతో పరుగులు తీసింది. కుంభకర్ణుడు దొరికిన వారిని దొరికినట్టు మట్టుబెడుతున్నాడు. అది చూసి సుగ్రీవుడు అతడి శరీరం పైకెక్కి చెవులు, ముక్కు కొరికేసాడు. దాంతో చిర్రెత్తిన కుంభకర్ణుడు అందిన వానరులందర్నీ తినటం మొదలుపెట్టాడు. చివరికి రాముడు తన దివ్యాస్త్రాల్ని ప్రయోగించి కుంభకర్ణుడి చేతుల్ని పాదాల్ని ఖండించి తరువాత అతడి తలని నరికేశాడు.

కుంభకర్ణుడు మరణించగానే మహావీరులైన కుంభ, నికుంభ, మకరాక్ష, మహోదర, మహాపార్శ్వ, మత్త, ఉన్మత్త, ప్రఘున, భాసకర్ణ, విరూపాక్ష, దేవాంతక, నరాంతక, త్రిశిరస్క, అతికాయులు వానరసైన్యం మీదకి దండెత్తారు. వారందర్నీ రామ లక్ష్మణ సుగ్రీవ అంగదాది వీరులు  అనాయాసంగా సంహరించారు.

ఇంద్రజిత్తు తిరిగి యుద్ధ రంగంలోకి వచ్చాడు. ఈసారి మహా శక్తివంతమైన నాగాస్త్రాన్ని రామ లక్ష్మణుల మీదకి ప్రయోగించాడు. విషంతో నిండిన ఆ అస్త్రాల ధాటికి తట్టుకోలేక రామలక్ష్మణులు ఇద్దరూ మూర్ఛపోయారు. వెంటనే హనుమంతుడు ఓషధులున్న పర్వతాన్ని పెకలించుకొచ్చి దానిపై మొలచిన ‘విశల్య’ అనే ఔషధితో రామలక్ష్మణుల్ని తిరిగి కోలుకునేలా చేసాడు.

రామలక్ష్మణులిద్దరూ తిరిగి కోలుకున్నారన్న విషయం ఇంద్రజిత్తుకి తెలిసింది. అతడు ఎలాగైనా వారిద్దర్నీ సంహరించాలనే సంకల్పంతో భయంకరమైన

నికుంభిలాహోమాన్ని ప్రారంభించాడు. అది గనుక పూర్తయితే దానిలోంచి మహాశక్తి ఆవిర్భవిస్తుంది. దాన్ని ఎదిరించటం ఎవరి తరం కాదు. ఈ విషయం రాముడికి తెలిసింది. వెంటనే లక్ష్మణుణ్ణి పంపించాడు. లక్ష్మణుడు ఇంద్రజిత్తు యాగం చేస్తున్న ప్రదేశానికి వచ్చి తన అస్త్రాలతో అతన్ని సంహరించాడు.

ఇంద్రజిత్తు మరణవార్త రావణుడికి తెలిసింది. అప్పటికే సోదరుల్ని, బంధువుల్ని కోల్పోయి దుఃఖంలో ఉన్న అతడికి కుమారుడి మరణవార్త అశనిపాతంలా తోచింది. దీనికంతటికీ కారణం సీతేనని భావించి వెంటనే అశోకవనానికి వెళ్ళి ఆమెని చంపబోయాడు. అదృష్టవశాత్తు ఆ సమయానికి అక్కడేవున్న అతడి భార్య అవింధ్య అనే పడతి రావణుణ్ణి స్త్రీ హత్య మహాపాపమని చెప్పి వారించింది. అక్కణ్ణుంచి రావణుడు రథాన్నెక్కి సరాసరి యుద్ధరంగానికి వచ్చాడు.

రాముడు కూడా యుద్ధరంగంలోకి ప్రవేశించాడు. ఇంద్రుడు పంపగా మాతలి అనేవాడు వచ్చి రాముడి రథానికి సారథిగా కూర్చున్నాడు. రథాన్ని అధిరోహించిన రాముడు రావణుడి ముందుకి వచ్చాడు. రామరావణుల యుద్ధం ప్రారంభమైంది. పరస్పరం దివ్యాస్త్రాలు ప్రయోగిస్తున్నారు. ఒకర్ని మించి మరొకరు పోరుకొనసాగిస్తున్నారు. వారిద్దరి మధ్య జరుగుతున్న యుద్ధాన్ని పైనుంచి చూస్తున్న దేవతలు “రామరావణ యుద్ధం రామరావణ యుద్ధంలాగానే ఉంది” అని అనుకున్నారు.

రాముడు విజృంభించి తన పరాక్రమాన్నంతా ప్రదర్శించి రావణుడి మీద శస్త్రాస్త్రాలు కురిపించాడు. అవన్నీ రావణుడి రథధ్వజాన్ని ఛేదించి, గుర్రాల్ని, సారధిని చంపి, రథాన్ని ఛిన్నాభిన్నం చేసి, రావణుడి ధనస్సుని, బాణాల్ని తలని ఛేదించాయి. అయితే ఆశ్చర్యకరంగా రావణుడి తలలు తిరిగి మొలవటం ప్రారంభించాయి. చివరికి రాముడు రామబాణమైన బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించి రావణాసురుణ్ణి నేలకూల్చాడు.

ఆ విధంగా రాముడి చేతిలో రావణుడు అతడి సమస్త పరివారం వధించబడటంతో ఆ అసురుల భార్యలందరూ యుద్ధరంగానికొచ్చి దారుణంగా

విలపించసాగారు. రాముడి ఆదేశంతో విభీషణుడు వెళ్ళి వారందర్నీ ఓదార్చాడు. తరువాత రాముడు హనుమంతుణ్ణి పంపి అశోకవనంలో ఉన్న సీతాదేవిని తన దగ్గరకి రప్పించాడు. ఆమెని అందరి సమక్షంలో అగ్ని ప్రవేశం చేయించి, పరిశుద్ధురాలైన సీతని ఆనందంగా స్వీకరించాడు. అదే సమయంలో ఇంద్రాది దేవతలందరూ అక్కడికి వచ్చి "ఓ శ్రీరామా! నీవెవరివో కాదు అసుర సంహారంకోసం అవతరించిన శ్రీమహావిష్ణువువే" అని భక్తిగా స్తుతించారు. అప్పుడు రాముడు కోరగా ఇంద్రుడు అమృతాన్ని కురిపించి యుద్ధంలో మరణించిన వానరసైన్యంతో తిరిగి జీవింపచేసాడు. దేవతలంతా రాముడి దగ్గర వీడ్కోలు తీసుకుని స్వర్గానికి వెళ్ళగా రాముడు విభీషణుడుకి లంకా రాజ్యాన్ని అప్పగించి అయోధ్యకి బయలుదేరాడు.

సీతా సమేతుడైన రాముడు పుష్పకవిమానాన్నెక్కి ఎంతో ఆనందంగా దారిలో వున్న వనాల్ని, సరోవరాల్ని సీతకి చూపిస్తూ అయోధ్యని చేరుకున్నాడు. అయోధ్యావాసులంతా ఎంతో ఘనంగా రాముడికి స్వాగతం పలికారు. రాముడు అందరికీ నమస్కరించి సీతా సమేతుడై నగరంలోకి ప్రవేశించాడు.

కొన్నాళ్ళు గడిచాక క్షత్రియ ధర్మాన్ని అనుసరించి రాముడు మహావైభవంగా అశ్వమేధయాగం చేసి వాసుదేవుడైన తనని తానే పూజించుకున్నాడు. ఆ సందర్భంగా ఎన్నో దానధర్మాలు చేసాడు. ప్రజల్ని కన్నబిడ్డల్లా పాలించి వారందరి యోగక్షేమాల్ని నిరతంరం విచారిస్తూ ఎంతో ధర్మబద్ధంగా రాజ్యాన్ని పాలించాడు. ఆ విధంగా శ్రీరాముడు రాజ్యం చేస్తున్న కాలంలో ప్రజలంతా ధర్మాచరణ పరాయణులుగానే ఉన్నారు. అప్పుడు అకాలమరణం చెందిన వాడెవ్వడూ లేడు.

## ఉత్తర కాండ

ధర్మబద్ధంగా రాజ్యపాలన చేస్తున్న రాముడి దగ్గరకి ఒకనాడు పూజనీయులైన అగస్త్యాది మహర్షులు వచ్చారు. రాముడితో "రామచంద్రా! నీవు పూర్వం మహామాయావి అయిన ఇంద్రజిత్తుని అవలీలగా సంహరించావు. చాలా సంతోషం. అది నీకే సాధ్యం.

బ్రహ్మదేవుడికి పులస్త్యుడనే కుమారుడు జన్మించగా అతడికి విశ్రవసుడనే పుత్రుడు ఉదయించాడు. విశ్రవసుడి భార్య కైకసి. అతడి పెద్దభార్య పుష్పోధవ. విశ్రవసుడికి పుష్పోద్భవ ద్వారా కుబేరుడు జన్మించగా, చిన్న భార్య కైకసి ద్వారా దశముఖుడైన రావణుడు ఉదయించాడు. ఆ రావణుడు కఠోరమైన తపస్సుచేసి బ్రహ్మని మెప్పించి ఎన్నో వరాల్ని పొందాడు. ఆ వరాల బలంతో సకల దేవతల్నీ తన పాదాక్రాంతులుగా చేసుకున్నాడు. తరువాత విశ్రవసుడికి నిద్రావశుడైన కుంభకర్ణుడు, పరమధార్మికుడైన విభీషణుడు జన్మించారు. వారితోపాటు వారికి సోదరిగా శూర్పణఖ కూడా పుట్టింది.

రావణాసురుడికి కాలక్రమంలో మేఘనాథుడనే పుత్రుడు జన్మించాడు. మహా బలవంతుడు, మహామాయావి అయిన మేఘనాథుడు స్వర్గంపైకి దండెత్తి ఇంద్రుణ్ణి అవలీలగా ఓడించాడు. ఆ నాటినుంచీ అతడు ఇంద్రజిత్తుగా ప్రసిద్ధిచెందాడు. ముల్లోకవాసులందరి క్షేమం కోసం నీవా ఇంద్రజిత్తుని లక్ష్మణుడి చేత చంపించావు. తరువాత దశకంఠుడైన రావణుణ్ణి వధించి అందరిచేతా పూజించబడ్డావు". ఈ విధంగా వారంతా జరిగిన విషయాలన్నిటినీ రాముడికి గుర్తుచేసి ఆయన ద్వారా సత్కారాలందుకుని వెళ్ళిపోయారు.

కొంతకాలం తరువాత దేవతలంతా రాముడి దగ్గరకొచ్చి 'లవణాసురుడు' తమని పెట్టే కష్టాల గురించి చెప్పి రక్షించమని కోరాడు. అప్పుడు రాముడు లక్ష్మణుణ్ణి పంపి లవణాసురుణ్ణి చంపించాడు.

పూర్వం మధుర అనే పట్టణం ఉండేది. అక్కడ లోకకంటకులైన శైలూషులనేవారున్నారు. రాముడి ఆజ్ఞతో భరతుడు అక్కడికి వెళ్ళి తన బాణాలతో మూడు కోట్లమంది శైలూష పుత్రుల్ని సంహరించాడు. అట్నుంచి సరాసరి సింధూతీరానికి వెళ్ళి అక్కడున్న శైలూషుడనే గంధర్వుణ్ణి కూడా వధించాడు. అలా వారందర్నీ వధించిన భరతుడు ఆయా రాజ్యాల్లో తక్షుడు, పుష్కరుడు అనే వారిని పాలకులుగా నియమించి శత్రుఘ్నుడితో సహా వచ్చి రాముణ్ణి సేవించాడు.

ఈ విధంగా మానవరూపం ధరించిన శ్రీరాముడు దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేసి ప్రజల్ని పాలించాడు. తరువాత లోకాపవాదానికి తలవంచి సీతను అడవికి పంపించాడు. అక్కడ వాల్మీకి ఆశ్రమంలో సీతకు జన్మించిన కుశలవుల్ని వారు చెప్పిన రామాయణ గాథని వినటం ద్వారా వారు తన కుమారులేనని తెలుసుకున్నాడు. వారిద్దర్నీ పిలిపించి అయోధ్యకి రాజులుగా అభిషేకించారు.

శ్రీరాముడు ఆ విధంగా ధర్మపరాయణుడై పదివేల సంవత్సరాలు భూమిని పాలించి కాలం అనే ధనస్సుతో లోకాల్ని రక్షించాడు. ఎన్నో యుగాలు ధార్మిక కార్యాలు చేసి, చివరికి పౌరులు, సోదరులు వెంట రాగా, అందరితో కలిసి స్వర్గాన్ని చేరుకున్నాడు. ఇక్కడ అయోధ్యని రాముడి పెద్ద కుమారుడైన కుశుడు పాలించసాగాడు.

అగ్నిదేవుడు వశిష్టుడికి చెప్పిన ఈ పవిత్ర రామాయణగాథ విన్నవారు స్వర్గాన్ని చేరుకుంటారు.

## శ్రీహరి వంశం

పూర్వం శ్రీమహావిష్ణువు నాభికమలం నుంచి బ్రహ్మదేవుడు ఆవిర్భవించాడు. ఆ బ్రహ్మకి అత్రిమహర్షి, అతడికి సోముడు, సోముడికి పురూరవుడు, అతడికి ఆయువు, ఆయువుకి నహుషుడు, నహుషుడికి యయాతి జన్మించారు.

యయాతికి దేవయాని ద్వారా యదువు, తుర్వసుడు అనే కుమారులు, రెండోభార్య శర్మిష్ఠ ద్వారా ద్రుహ్యు, పూరు అనే పుత్రులు జన్మించారు. వీరిలో యదువుకి జన్మించిన వారంతా యాదవులుగా ప్రసిద్ధి చెందారు.

పూర్వజన్మలో హిరణ్యకశిపుడి ఆరుగురు పుత్రులు దేవకీ వసుదేవులకీ విష్ణు ప్రేరితమైన యోగమాయ ప్రభావంతో తిరిగి పుత్రులుగా జన్మించారు. ఆ దేవకీదేవికి బలరాముడు ఏడో గర్భంలో జన్మించాడు. అతడు రోహిణీ దేవిద్వారా పెంచబడటంతో రోహిణీయుడుగా పిలువబడ్డాడు. తరువాత శ్రావణ కృష్ణపక్ష అష్టమినాడు చతుర్భుజుడైన శ్రీహరి దేవకీ గర్భాన శ్రీకృష్ణుడుగా ఆవిర్భవించాడు.

వసుదేవుడికి జన్మించిన పుత్రులందరినీ కంసుడు సంహరించాడు. కృష్ణుడు పుట్టగానే ఆ అర్ధరాత్రి ఎవరికీ తెలియకుండా ఆ శిశువుని యశోదాదేవి పక్కలో ఉంచి ఆమెకి జన్మించిన యోగమాయని తన దగ్గరకి తెచ్చుకున్నాడు వసుదేవుడు. మర్నాడు కంసుడు దేవకిదేవి దగ్గరున్న యోగమాయని తెచ్చి నేలకేసి కొట్టాడు. అప్పటిదాకా శిశువు రూపంలో ఉన్న యోగమాయ నిజరూపాన్ని ధరించి పైకెగిరి ఓరీ దుష్టకంసా! నిన్ను చంపేవాడు పుట్టాడు. ఎక్కడో పెరుగుతున్నాడు. అతడి చేతిలో నీచావు తప్పదు" అని హెచ్చరించి అదృశ్యమయ్యింది.

కంసుడు బాలుడి రూపంలో వారందర్నీ చంపటంకోసం పూతన అనే రాక్షసిని పంపాడు. ఆ పూతన మారువేషంలో గోకులంలో ఉన్న కృష్ణుడి దగ్గరకొచ్చి తనస్తన్యం ఇవ్వబోగా కృష్ణుడు పాలతోపాటు పూతన ప్రాణాల్ని కూడా పీల్చేశాడు. తరువాత కృష్ణుడు ఎంతో మంది అసురుల్ని తనలీలల్లో భాగంగా సంహరించి భూభారాన్ని తగ్గించాడు.

తరువాత బలరాముడితో కలిసి మధురకి వెళ్ళి కంసుణ్ణి చంపి అతడి తండ్రిని రాజుగా చేసాడు. కంసుడి మామగారైన జరాసంధుడు కృష్ణుడి మీదకి దండెత్తగా యాదవులంతా అతన్ని ఎదుర్కొన్నారు. కొంతకాలం గడిచాక కృష్ణుడు ద్వారకానగరాన్ని నిర్మించి యాదవులందరితో కలిసి నివసించాడు. భూదేవి పుత్రుడైన నరకాసురుణ్ణి సత్యభామ సాయంతో వధించాడు. తనకున్న అష్టభార్యలతో పాటు నరకుడి చెరలోవున్న పదహారువేల మందినీ వివాహం చేసుకున్నాడు.

సత్యభామతో కలిసి స్వర్గానికి వెళ్ళి ఇంద్రుణ్ణి జయించి అక్కడున్న పారిజాత వృక్షాన్ని తెచ్చి సత్యభామ పెరట్లో నాటాడు. సాందీపని ముని దగ్గర శస్త్రాస్త్ర విద్యలు నేర్చుకుని మరణించిన అతని కుమారుణ్ణి తిరిగి బ్రతికించి తీసుకువచ్చాడు. పంచజనుడనే అసురుణ్ణి సంహరించి యముడిచేత, కాలయవనుణ్ణి సంహరించి ముచికుందుడి చేత పూజించబడ్డాడు.

బలరాముడికి రేవతి ద్వారా నిశరుడు, ఉల్ముఖుడు అనే పుత్రులు జన్మించగా, శ్రీకృష్ణుడికి జాంబవతి ద్వారా సాంబుడనే వాడు జన్మించాడు.

అదేవిధంగా కృష్ణుడికి రుక్మిణి ద్వారా ప్రద్యుమ్నుడు జన్మించాడు. ఆ ప్రద్యుమ్నుడికి అనిరుద్ధుడు ఉదయించాడు.

**ఉషాపరిణయం :** పూర్వం పరమశివభక్తుడైన బాణుడు అనే వాడుండేవాడు. అతడికి ఉష అనే అందమైన కూతురుంది. ఆ బాణుడు శోణితపురానికి అధిపతి. బాణుడు కఠోర దీక్షతో తపస్సుచేసి శివుణ్ణి మెప్పించి శివపుత్రుడి స్థాయిని పొందాడు. బాణుడితో పాటు అతడికుమార్తె కూడా కైలాసానికి వెళ్ళింది. అక్కడ పార్వతీ పరమేశ్వరులు ఆనందంగా ఉండటాన్ని చూసింది. వారిని చూసిన ఉషకి తనకి కూడా ఒక మంచి భర్త వస్తే బాగుంటుందని అనుకుంది. అది గమనించిన పార్వతీదేవి ఉషని పిలిచి వైశాఖమాసం ద్వాదశీతిథినాడు నీకు కలలో ఒక పురుషుడు కనిపిస్తాడు. అతడే నీకు తగిన భర్త అని చెప్పి పంపింది.

ఉషాదేవి తిరిగి తన నగరానికొచ్చింది. ద్వాదశినాటి రాత్రి పార్వతీదేవి చెప్పినట్టే ఆమెకి అందమైన కల వచ్చింది. ఆ కలలో ఒక అందమైన పురుషుడు తనతో సంగమించినట్టు కనిపించింది. మర్నాడు ఉదయం తన ప్రియసఖి ద్వారా రాత్రి తాను కలలో చూసిన రాకుమారుడి చిత్రాన్ని లిఖింపచేసింది. ఆ చిత్రం సాయంతో ఆ పురుషుడు శ్రీకృష్ణుడి మనుమడైన అనిరుద్ధుడని తెలుసుకని, తన చెలికత్తెద్వారా అనిరుద్ధుణ్ణి తన మందిరానికి పిలిపించుకుంది ఉషాదేవి. ఉషను చేరిన అనిరుద్ధుడు ఆమెతో ఆనందంగా సరససల్లాపాలు కొనసాగించాడు. వారిద్దరూ నిత్యం సంతోషంతో రమించసాగారు.

ఈ విషయం బాణుడికి తెలిసింది. అనిరుద్ధుణ్ణి పట్టుకున్నాడు. బాణుడికి అనిరుద్ధుడికి యుద్ధం జరిగింది. నారదుడి ద్వారా విషయాన్ని తెలుసుకున్న కృష్ణుడు ప్రద్యుమ్నబలరామసమేతుడిగా వచ్చి బాణుడితో యుద్ధం చేయసాగాడు. తన ప్రియభక్తుడైన బాణుణ్ణి రక్షించటానికి శంకరుడు సరాసరి కైలాసం నుంచి యుద్ధరంగానికి వచ్చాడు. బాణుణ్ణి చంపబోతున్న కృష్ణుడి ముందుకొచ్చాడు శంకరుడు.

శ్రీకృష్ణ శంకరుల మధ్య యుద్ధం ప్రారంభమైంది. పరస్పరం అస్త్రాలు ప్రయోగించుకున్నారు. చివరగా కృష్ణుడు ప్రయోగించిన జృంభణాస్త్ర ప్రభావంతో శంకరుడు పెద్దగా ఆవులిస్తూ నిద్రపోయాడు. అదే అదునుగా భావించిన కృష్ణుడు బాణుడి వెయ్యి చేతుల్నీ ఖండించాడు. అంతలో నిద్రనుంచి మేల్కొన్న శంకరుడు కృష్ణుడితో "ఇతడు నాకు ప్రియభక్తుడు కనుక ఈ బాణుడికి అభయాన్ని ప్రసాదించు" అని కృష్ణుణ్ణి కోరాడు.

శంకరుడి ప్రార్థన మన్నించిన కృష్ణుడు బాణుడికి రెండు చేతుల్ని మాత్రమే ఉంచి అభయాన్ని ప్రసాదించాడు. బాణుడు కృష్ణుడికి నమస్కరించి తన కుమార్తె ఉషని అనిరుద్ధుడికిచ్చాడు. అప్పుడు శంకరుడు కృష్ణుడితో "శ్రీహరీ! నీకూ నాకూ ఎలాంటి భేదంలేదు. అలా భేదాన్ని ఎవరైనా చూపితే అలాంటి పాపాత్ములు నరకంలో పడతారు" అని అన్నాడు. అందరూ ఆనందించారు. ఉషా అనిరుద్ధుల్ని తీసుకుని కృష్ణుడు ద్వారకా నగరానికి వెళ్ళిపోయాడు.

## కురుక్షేత్ర సంగ్రామం

కౌరవ పాండవసైన్యాలు రెండూ ధర్మక్షేత్రమైన కురుక్షేత్రానికి చేరుకున్నాయి. పాండవసేనలో ఉన్న అర్జునుడు ఎదురుగా గురువులు, పెద్దలు శత్రుపక్షంలో కనిపించటంతో యుద్ధం చేయనని అస్త్రాలు వదిలేశాడు. అప్పుడు శ్రీకృష్ణుడు తన విశ్వరూపాన్ని చూపించి భగవద్గీత పలికి కర్తవ్య బోధ చేయటంతో తిరిగి అస్త్రాల్ని ధరించాడు. కురుపాండవుల మధ్య సమరం ప్రారంభమైంది.

కౌరవసేనకి మొదటి సైన్యాధ్యక్షుడు భీష్ముడు. పాండవులకి సేనాధిపతి శిఖండి. ఇద్దరికీ యుద్ధం జరిగింది. భీష్ముడి నాయకత్వంలో కౌరవులందరూ పాండవులమీదకి దాడిచేసారు. అదేవిధంగా శిఖండి ఆధ్వర్యంలో పాండవులంతా కలిసి కౌరవుల్ని ఎదుర్కొన్నారు. వీరిద్దరి మధ్యా జరుగుతున్న యుద్ధాన్ని పైనుంచి చూస్తున్న దేవతలు అది దేవాసుర సంగ్రామంలా ఉందని భావించారు.

భీష్ముడు పదిరోజుల్లో ఎంతోమంది పాండవసైన్యాన్ని హతమార్చాడు. పదకొండో రోజు అర్జునుడు భీష్ముడిమీద బాణవర్షాన్ని కురిపించాడు. అదే సమయంలో ద్రుపదుడు ప్రేరేపించగా శిఖండి కూడా పక్కనుంచి భీష్ముడి మీద బాణాల్ని ప్రయోగించాడు. వారిద్దరి మధ్యా జరిగిన యుద్ధంలో ఎన్నో గుర్రాలు, ఏనుగులు, రథాలు ధ్వంసమయ్యాయి. చివరికి శిఖండిని ఎదురుగా చూసి భీష్ముడు అస్త్ర సన్యాసం చేయగా అర్జునుడు ఆయన్ని బాణాలతో కొట్టి అంపశయ్యమీద పడేలా చేసాడు.

ఆ విధంగా అంపశయ్య మీద ప్రాణావశాన స్థితిలో ఉన్న భీష్మ పితామహుడు శ్రీహరిని ధ్యానిస్తూ ఉత్తరాయణ పుణ్యకాలం కోసం ఎదురుచూస్తున్నాడు. ఉత్తరాయణం వచ్చింది. భీష్ముడు ప్రాణాలు విడిచాడు. పితామహుడి మరణానికి దుఃఖిస్తూ ద్రోణుడిని సైన్యాధిపతిగా అభిషేకించాడు దుర్యోధనుడు. ఇటు పాండవులు ధృష్టద్యుమ్నుణ్ణి సైన్యాధిపతిని చేసారు.

మహావీరుడైన ద్రోణుడి ధాటికి పాండవసేన గజగజలాడింది. అలాగే దృష్టద్యుమ్నుడి ధాటికి తట్టుకోలేని కౌరవసైన్యం కూడా విలవిల లాడింది. ద్రోణుడు తన బాణవిద్యానైపుణ్యాన్ని ప్రదర్శిస్తూ పాండవసేనని చీల్చి చెండాడుతున్నాడు. ద్రోణుడి చేతిలో బాణం ఉన్నంత వరకూ ఆయన్ని ఎదిరించటం అసాధ్యం అని గ్రహించారు పాండవులు. వెంటనే ధర్మరాజు ద్వారా 'అశ్వద్ధామ కుంజరః హతః' అని అనిపించారు. ఆ మాట వినగానే ద్రోణుడు ఒక్కసారిగా దుఃఖంతో అస్త్రసన్యాసం చేసాడు. వెంటనే దుష్టద్యుమ్నుడు ఆయన రథం పైకెక్కి ద్రోణుడి తల నరికాడు. ఆ విధంగా అయిదు రోజులు యుద్ధంచేసిన ద్రోణుడు ధృష్టద్యుమ్నుడి చేతిలో దారుణంగా మరణించాడు.

గురుదేవుడి మరణం దుర్యోధనుణ్ణి ఎంతో కలచివేసింది. దుఃఖాన్ని తట్టుకుని మహావీరుడైన కర్ణుణ్ణి సర్వసైన్యాధిపతిగా నియమించాడు. ఇటు పాండవ సైన్యానికి అర్జునుడు సైన్యాధిపతిగా ఉన్నాడు. తిరిగి యుద్ధం ప్రారంభమయ్యింది. కర్ణార్జునులిద్దరూ సమానవీరులే. ఒకర్నిమించి మరొకరు ధీటుగా శస్త్రాస్త్రాల్ని

ప్రయోగించుకుంటున్నారు. చివరికి శాపగ్రస్తుడైన కర్ణుడు తన కవచ కుండలాల్ని కూడా దానంచేసి అర్జునుడి చేతిలో వీరమరణం పొందాడు.

కర్ణుడి తరువాత శల్యుడు కౌరవ సేనాధిపతిగా యుద్ధరంగానికి వచ్చాడు. అర్ధదినం యుద్ధంచేసాడు. అంతలోనే ధర్మరాజు శల్యుణ్ణి హతమార్చాడు.

ఆ విధంగా కౌరవసైన్యమంతా నశించగా, దుర్యోధనుడు భీమసేనుడితో గదాయుద్ధం చేసాడు. అలా వారిద్దరి మధ్యా ఎంతో భీకరంగా గదాయుద్ధం కొనసాగింది. చివరికి తాను పూర్వం చేసిన ప్రతిజ్ఞని గుర్తుకుతెచ్చుకున్న భీముడు సరిగ్గా యుద్ధం మొదలైన పద్దెనిమిదోరోజు దుర్యోధనుణ్ణి వధించాడు.

తన తండ్రి మరణానికి కారకులైన పాండవుల మీద పగపెంచుకున్నాడు ద్రోణుడి పుత్రుడైన అశ్వద్ధామ. ఒకరోజు రాత్రి నిద్రలో ఉన్న పాండవసేనని, తన తండ్రిని చంపిన ధృష్టద్యుమ్నుణ్ణి, ఉపపాండవుల్ని సంహరించాడు. మర్నాడు ఉదయం ఈ దారుణాన్ని అందరూ గమనించారు. ఉపపాండవులందరూ మరణించటంతో ద్రౌపతి ఎంతో విలపించింది. అర్జునుడు ఆమెని ఓదార్చి ఐషీకాస్త్ర ప్రయోగం చేసి అశ్వద్ధామ శిరోమణిని గ్రహించాడు.

తరువాత అశ్వద్ధామ కోపంతో రగిలిపోతూ అపాండవమగుగాక అని బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించగా, అది ఉత్తర గర్భంలోకి ప్రవేశించి లోపలున్న శిశువుని దహించబోయింది. అంతలో శ్రీకృష్ణుడు తన దివ్యశక్తితో ఆమె గర్భాన్ని సంరక్షించాడు. ఆ గర్భం నుంచి జన్మించిన శిశువే పరీక్షిత్తు.

మహాభారత యుద్ధంలో కౌరవ పక్షం నుంచి చావకుండా బైటపడ్డవారు అశ్వద్ధామ, కృపాచార్య, కృతవర్మలు మాత్రమే. అలాగే పాండవ పక్షంలో పంచపాండవులు, శ్రీకృష్ణుడు, సాత్యకి ఈ ఏడుగురు మాత్రమే మిగిలారు. అందరూ ప్రాణులు కోల్పోయారు.

కురుక్షేత్రం సంగ్రామంలో భర్తల్ని పోగొట్టుకున్న స్త్రీలందర్నీ ధర్మరాజు ఓదార్చాడు. భీమసేనుడి ద్వారా వారందరికీ ప్రేత సంస్కారాలు చేసి వారిపేరుతో ఎన్నో దాన ధర్మాలు ఆచరించాడు. తరువాత పూర్వం తాను భీష్మాచార్యుడి

ద్వారా విన్న రాజధర్మాల్ని సక్రమంగా పాటిస్తూ ధర్మబద్ధంగా రాజ్యాన్ని పాలించాడు ధర్మరాజు. క్షత్రియధర్మాన్ని అనుసరించి అశ్వమేధ యాగం చేసి విప్రులకి దానాలు చేసాడు.

యాదవకుల విధ్వంసకమైన ముసలం పుట్టిందని దానివల్ల యాదవులందరూ నశించారన్న విషయాన్ని అర్జునుడి ద్వారా తెలుసుకున్నాడు ధర్మరాజు. ఇక తాము వచ్చిన పని అయిపోయిందని గ్రహించి తమ వారసుడైన పరీక్షిత్తుకి రాజ్యాభిషేకం చేసి సోదరులతో కలిసి స్వర్గానికి చేరుకున్నాడు.

## బుద్ధ-కల్కి అవతారాలు

పూర్వం ఒకప్పుడు దేవాసుర సంగ్రామం జరిగింది. ఆ యుద్ధంలో పరాజయం పొందిన దేవతలంతా శివుడి దగ్గరకి వెళ్ళి పరమేశా! రక్షించు, కాపాడు అని ఆయన్ని శరణు వేడుకున్నారు. అప్పుడు మాయామోహ స్వరూపుడైన ఈశ్వరుడు భూలోకంలో శుద్ధోదన మహారాజుకి పుత్రుడిగా జన్మించి దైత్యులందరికీ మోహాన్ని కలిగించి వారంతా వేద ధర్మాన్ని విడిచిపెట్టేలా చేసాడు. అలా వేదధర్మ రహితులైన వారంతా బౌద్ధులుగా మారారు. ఆ పరమేశ్వరుడే అర్హతుడిగా మారి, మిగిలిన వేద వర్జితులందర్నీ అర్హతులుగా చేసాడు. ఈ విధంగా దైత్యులు వేదధర్మ వర్జితులై పాషండులుగా మారారు.

ఆ పాషండులందరూ నరకాన్ని చేరుకునే కర్మల్నే చేసారు. వీరంతా అధముడి దగ్గర్నుంచి కూడా ప్రతిగ్రహం (యాచన) చేస్తారు. కలియుగానంతం వరకూ అందరూ సంకరులౌతారు. తరువాత కాలంలో పదిహేను శాఖలతో ఉన్న వాజసనేయ సంహిత ప్రమాణంగా ఉంటుంది. మ్లేచ్ఛులు రాజులై అధర్మకార్యాలు ఆచరిస్తూ మనుషుల్ని పీడిస్తూంటారు.

కలియుగం పరిసమాప్తమయ్యే కాలానికి ముందు విష్ణుశయనుడు అనే యజ్ఞవల్క్య పురోహితుడికి కల్కిగా శ్రీహరి అవతరిస్తాడు. మహాయోధుడైన ఆ కల్కి ఖడ్గాన్ని ధరించి మ్లేచ్ఛులందర్నీ సంహరిస్తాడు.నాలుగు వర్ణాలవారినీ సరిదిద్దుతాడు.

ఆవిధంగా లోకంలో తిరిగి ధర్మాన్ని స్థాపించిన కల్కి తన కర్తవ్యం పూర్తికాగానే అవతారాన్ని పరిసమాప్తిచేసి స్వర్గానికి వెళతాడు. ఆ తరువాత కలియుగాంతం అయిపోయి మళ్ళీ కృతయుగం ప్రారంభమవుతుంది.

ఈ విధంగా శ్రీమహావిష్ణువు అన్ని కల్పాలలో అన్ని మన్వంతరాలలో ఎన్నో అవతారాల్ని ధరిస్తుంటాడు. విష్ణువు ధరించిన అవతారాలు ఉపాఖ్యానాన్ని పఠించినవాడు, విన్నవాడు పాపాలన్నీ నశించి సకల కామ్యాలను పొంది తన వంశం వారితో సహా స్వర్గానికి వెళతాడు.

విష్ణోర్దశావతారాఖ్యాన్యః పఠేచ్ఛృణుయాన్నరః ।
సోఽవాప్తకామోవిమలః సకులః స్వర్గమాప్నుయాత్ ॥

## శ్రీహరి చతుర్వింశతి స్తోత్రం

ఓం రూపః కేశవః పద్మశఙ్ఖ చక్రగదాధరః ।
నారాయణః శఙ్ఖ పద్మ గదాచక్రీ ప్రదక్షిణమ్ ॥ 1

నతోగదీమాధవో ఽరిశఙ్ఖపద్మీ సమామితమ్ ।
చక్రకౌమోదకీ పద్మ శఙ్ఖీ గోవిన్ద ఊర్జితః ॥ 2

మోక్షదః శ్రీ గదీపద్మీ శఙ్ఖీ విష్ణుశ్చ చక్రధృక్ ।
శఙ్ఖచక్రాబ్జగదినం మధుసూదన మానమే ॥ 3

భక్త్యాత్రివిక్రమః పద్మగదీ చక్రీచ శఙ్ఖ్యపి ।
శఙ్ఖ చక్రగదా పద్మీ వామనః పాతుమాంసదా ॥ 4

గతిదః శ్రీధరః పద్మీచక్రీ శార్ఙ్గి చ శఙ్ఖ్యపి ।
హృషీకేశో గదీ చక్రీ శఙ్ఖీచ పాతునః ॥ 5

వరదః పద్మనాభస్తు శఙ్ఖాబ్జారి గదాధరః ।
దామోదరః పద్మ శఙ్ఖ గదా చక్రీ నమామితమ్॥ 6

తేనేగదీ శఙ్ఖచక్రీ వాసుదేవో ఽబ్జభృజ్జగత్ ।
సఙ్కర్షణో గదీ శఙ్ఖీ పద్మీ చక్రీచ పాతువః ॥ 7

వాదీ చక్రీ శఙ్ఖ గదీ ప్రద్యుమ్నః పద్మభృత్ ప్రభుః ।
అనిరుద్ధశ్చక్రగదీ శఙ్ఖీ పద్మీచ పాతునః ॥ 8

సురేశో ఽ ర్యబ్జ శఙ్ఖాఢ్య శ్రీగదీ పురుషోత్తమః ।
అధోక్షజః పద్మగదీ శఙ్ఖీ చక్రీచ పాతువః ॥ 9

దేవోనృసింహశ్చక్రాబ్జ గదీశఙ్ఖీ నమామితమ్ ।
అచ్యుతః శ్రీగదీపద్మీ చక్రీ శఙ్ఖీ చ పాతువః ॥ 10

వాలరూపీ శఙ్ఖగదీ ఉపేన్ద్ర శ్చక్ర పద్మ్యపి ।
జనార్ధనః పద్మచక్రీ శఙ్ఖధారీ గదాధరః ॥ 11

యజ్ఞః శఙ్ఖీ పద్మ చక్రీ హరిః కౌమోదకీధరః ।
కృష్ణః శఙ్ఖీ గదీ పద్మీ చక్రీ మే భుక్తి ముక్తిదః ॥ 12

*(శ్లో॥1-12,అధ్యా-48)*

వాసుదేవుడైన శ్రీహరే ఆదిదేవుడు, పరబ్రహ్మ. ఆ వాసుదేవుడి నుంచి సంకర్షణుడు ఆవిర్భవించాడు. సంకర్షణుడి నుంచి ప్రద్యుమ్నుడు, ప్రద్యుమ్నుడి నుంచి అనిరుద్ధుడు ఆవిర్భవించారు. వీరిలో ఒక్కొక్కరు తిరిగి కేశవాది మూర్తులు 3 రకాలుగా ఆవిర్భవించారు.

1.వాసుదేవుడి నుంచి కేశవ, నారాయణ మాధవ మూర్తులు 2.సంకర్షణుడి నుంచి గోవింద, విష్ణు మధుసూదనులు 3.ప్రద్యుమ్నుడి నుంచి త్రివిక్రమ, వామన శ్రీధరులు 4.అనిరుద్ధుడి నుంచి హృషీకేశ, పద్మనాభ దామోదర మూర్తులు ఆవిర్భవించారు.

వాసుదేవుడి 24 మూర్తుల్ని వర్ణించే ఈ దివ్యస్తోత్రం ఎంతో ప్రభావవంతమైనది. ఇది వాసుదేవ ద్వాదశాక్షర (ఓం నమో భగవతే వాసుదేవాయ) మంత్ర శ్లోకం. ఈ పన్నెండు అక్షరాలకీ 12 శ్లోకాలు చెప్పబడ్డాయి. విశేషం ఏమిటంటే పన్నెండు శ్లోకాల మొదటి అక్షరాలు కలిపితే ద్వాదశాక్షర మంత్రం ఏర్పడుతుంది. ఈ దివ్యస్తోత్రాన్ని చదివినవారికి, విన్న వారికీ సకల మనోరథాలు నెరవేరుతాయి.

# వర్ణాశ్రమ ధర్మాలు

పూర్వం మను చక్రవర్తి తదితర ధర్మపురుషులు భగవంతుడికి ప్రీతి కలిగించే ఎన్నో రకాల ధర్మాల్ని జాతికి బోధించారు. వాటిలో వర్ణాశ్రమధర్మాలు ప్రతిఒక్కరూ విధిగా పాటించాలని వారు నిర్దేశించారు.

అహింస, సత్యం, భూతదయ, అనుగ్రహబుద్ధి, తీర్థయాత్ర, దానం, బ్రహ్మచర్యం, మాత్సర్యం లేకపోవటం, దేవబ్రాహ్మణ పూజ, గురుశుశ్రూష, స్వధర్మ శ్రవణం, పితృపూజనం, రాజభక్తి, ఎప్పుడూ ఉత్తమ శాస్త్రాల్ని పఠించి మంచి విషయాల్ని తెలుసుకోవటం, క్రౌర్యం లేకపోవటం, ఓర్పు, ఆస్తిక్యబుద్ధి – ఇవన్నీ అన్ని వర్ణాల వారూ ఆచరించాల్సిన ప్రధాన ధర్మాలు.

యజనం, యాజనం, అధ్యయనం, అధ్యాపనం, దానం, ప్రతిగ్రహణం అనేవి బ్రాహ్మణులు ఆచరించాల్సిన ధర్మాలు. దానం, అధ్యయనం, యజనం అనేవి క్షత్రియ వైశ్య ధర్మాలు. పాలించటం, దుష్టుల్ని శిక్షించటం – ఇవి క్షత్రియుడు పాటించాల్సిన విశేషధర్మాలు. అలాగే వైశ్యులు వ్యవసాయం, గోసంరక్షణ,వాణిజ్యం అనేవి ఆచరించాల్సిన విశేష ధర్మాలు. ఇక బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు చేసే అన్ని రకాల పనుల్లో సహాయ సహకారాలు అందించటం శూద్రులు పాటించాల్సిన ధర్మం.

**గృహస్థవృత్తి :** బ్రాహ్మణులు తన ధర్మాన్ని ఆచరిస్తూనే జీవించాలి. ఒకవేళ అలా జీవించే పరిస్థితులు లేనప్పుడు విప్రుడు క్షత్రియ, వైశ్య ధర్మాల్ని ఆశ్రయించవచ్చు. అయితే సంకరజాతులు వారి ధర్మాన్ని మాత్రం ఆచరించకూడదు. ఆపత్కాలంలో విప్రుడు గోసంరక్షణ, కృషి, వడ్డీవ్యాపారం లాంటివి చేయవచ్చు. కానీ, ఆవుపాలు, బెల్లం, ఉప్పు, మాంసం వంటివి అమ్మే వృత్తిని చేపట్టకూడదు.

కర్షకులు(రైతులు)భూమిని దున్నటం, చెట్టుకొట్టటం, పిపీలకాలని చంపటం(పురుగులమందులు చల్లటం ద్వారా)లాంటివి చేయటం ద్వారా లభించిన పాపాల్ని, యజ్ఞయాగాలు చేయించటం, దేవతాపూజలు ఆచరించటం ద్వారా పోగొట్టుకోవచ్చు.

ఎనిమిది హద్దుల హలం ధర్మ సమ్మతమైనది. జీవనంకోసం ఆరుఎద్దుల హలం, క్రూరమైన వారికి నాలుగు ఎద్దులహలం, ధర్మహింస చేసేవారికి రెండెద్దుల హలం చెప్పబడ్డాయి. విప్రులు ఋతంచేత అనగా కళ్ళెంలో మిగిలిన ధాన్యం గింజల్ని ఏరుకుని వాటిని వండి తినటంద్వారా, లేదా అమృతం అనగా అయాచితంగా లభించిన ఆహారాన్ని స్వీకరించటం, మృతం అనగా భిక్షావృత్తి చేసి తినటం, ప్రమృతం అనగా (వ్యవసాయంచేత), సత్యానృతం (వ్యాపారం చేసి) గానీ జీవనాన్ని గడపాలి. అంతేగాని ఎప్పుడూ కూడా సేవావృత్తి చేసి జీవించకూడదు.

**సంస్కారాలు :** స్త్రీల ఋతుకాలం 16 రాత్రులు. వీటిలో మొదటి మూడు రాత్రులు సంభోగానికి నిషేధం. పురుష సంతానం కావాలనుకునేవారు మిగిలిన రాత్రులలో సరిసంఖ్యలో ఉన్న రాత్రుల్లో సంభోగించాలి. అది గర్భాదాన సంస్కారం. ఆమె గర్భాన్ని ధరించింది అని తెలియగానే గర్భంలోని శిశువు కదలకముందే పుంసవన సంస్కారం చేయాలి. ఆ సంస్కారం చేసేరోజు పుంలింగ నక్షత్రం ఉంటే చాలా మంచిది. శిశువు జన్మించిన తరువాత బొడ్డుకోయటానికి పూర్వమే జాత కర్మ సంస్కారాన్ని జరిపించాలి. సూతకం తొలగిపోయాక నామకరణం చేయాలి.

బ్రాహ్మణుల పేర్లకి చివర శర్మ అని క్షత్రియుల పేర్లకి చివర వర్మ అని, వైశ్యుల పేర్లకి చివర గుప్త అని, శూద్రుల పేర్లకి చివర దాస అని ఉంచాలి. నామకరణ సంస్కారం చేస్తున్నప్పుడు భార్య పిల్లవాణ్ణి భర్త ఒడిలో ఉంచుతూ "ఇదిగో ఇతడు నీ బిడ్డ"అని చెప్పాలి. ఆ తరువాత కులాచారం ప్రకారం చూడాకర్మ చేయాలి. బ్రాహ్మణులకి ఉపనయన సంస్కారం ఎనిమిదో సంవత్సరం చేయాలి. క్షత్రియుడికి 11వ సంవత్సరం, వైశ్యుడికి 12వ సంవత్సరం చేయాలి. విప్రకుమారులకి పదహారు సంవత్సరాలు దాటాక ఉపనయనం చేస్తే ఎలాంటి ప్రయోజనం ఉండదు.

బ్రహ్మచారి ఉదయం, సాయంత్రం అగ్నికార్యం చేయాలి. అపవిత్రమైన వస్తువులతో హోమం చేయకూడదు. హోమం చేసేడప్పుడు చేతివేళ్ళని దూరంగా

ఉంచుకోవాలి. మధుమాంసాల్ని, నృత్య సంగీతాల్ని, హింసని పరనిందని, అశ్లీల సంభాషణని విడిచిపెట్టాలి. దండాన్ని ధరించాలి. వేదాధ్యయనం పూర్తయిన తరువాత గురువుకి దక్షిణ సమర్పించి స్నాతక వ్రతాన్ని ఆచరించాలి. ఆ తరువాత వివాహం చేసుకోవచ్చు లేదా నైష్ఠిక బ్రహ్మచర్యాన్ని అవలంబించవచ్చు.

## ద్రవ్యశుద్ధి

మట్టిపాత్రలు కాల్చటం వల్ల శుద్ధమవుతాయి. మలమూత్రాల స్పర్శ తగిలిన పాత్రని కాల్చినప్పటికీ అదిశుద్ధం కాదు. బంగారు పాత్రకి అపవిత్ర వస్తువుల స్పర్శతగిలితే దాన్ని కడగటం ద్వారా అది పవిత్రమవుతుంది. తామ్ర పాత్రని పుల్లటి వస్తువులతో కడిగితే శుద్ధమవుతుంది. కాంస్య లోహపాత్రలు పరాగంతో తోమితే శుద్ధమవుతాయి. శంఖాలతో, రాతితో, చేసిన పాత్రలు, కూరలు, త్రాడు, పళ్ళు, పూలు, వెదురులాంటి వాటితో చేసిన వస్తువులు నీళ్ళతో కడిగితే శుద్ధమవుతాయి.

యజ్ఞం చేసేడప్పుడు ఆ యజ్ఞపాత్రలు కుడిచేతిలోని దర్భలతో మార్జనం చేస్తే శుద్ధమవుతాయి. నెయ్యి, నూనెతో జిడ్డు పట్టిన పాత్రలు వేడి నీళ్ళతో కడిగితే శుద్ధమవుతాయి. చీపురుతో తుడిచి అలకటం వల్ల ఇల్లు శుద్ధమవుతుంది. ఉతకటం వల్ల వస్త్రాలు, చెక్కటం వల్ల చెక్కతో చేసిన వస్తువులు శుద్ధమవుతాయి.

మంచం, వాహనం, చేట బండి, ఇవన్నీ నీళ్ళు చల్లటం ద్వారా శుద్ధమవుతాయి. దంతంతో తయారుచేసిన వస్తువులు పచ్చని ఆవాలతో శుద్ధమవుతాయి. కొబ్బరికాయ ఆనపకాయ వంటి వాటితో చేసిన పాత్రలు ఆవుతోకలోని వెంట్రుకలు రాయటం ద్వారా పరిశుద్ధమవుతాయి. జిగురు బెల్లం, ఉప్పు, కుసుంభపుష్పం, ఉన్ని, పత్తి, ఎండలో ఉంచటం వల్ల శుద్ధమవుతాయి. నదీజలాలు ఎప్పుడూ పవిత్రమైనవే.కేవలం ముఖం తప్ప ఆవులో వున్న సర్వఅవయవాలూ శుద్ధమే. గుర్రం మేక వీటి ముఖాలు మాత్రమే శుద్ధమైనవి. స్త్రీల ముఖం ఎప్పుడూ శుద్ధమైనదే.

పాలు పితికేడప్పుడు లేగదూడముఖం, చెట్లపై పళ్ళని తినే పక్షుల ముఖం, వేటాడే సమయంలో కుక్కల ముఖం పవిత్రమైనవి. భోజనం, ఉమ్మి వేయటం, నిద్రపోవటం, నీళ్ళుత్రాగటం, స్నానంచేయటం, ప్రయాణంచేయటం, వస్త్రాలు ధరించటం. ఈ పనులన్నీ చేసిన తరువాత ఆచమనం చేయాలి. పిల్లి అటూ ఇటూ తిరగటం శుభం. రజస్వల నాలుగో రోజు శుద్ధవుతుంది. ఋతుస్నాత అయిన స్త్రీ ఐదోరోజు వరకూ దేవకార్యాలలో పాల్గొనరాదు.

## పతితుడై మరణించిన వాడికి చేయాల్సిన సంస్కారం

విధివశాత్తు అనాధగా మరణించిన వాడికి ఎలాంటి సంస్కారం జరగక పోయినా ఎవరైనా అతడి ప్రక్కన నుంచుని శ్రీహరి నామ స్మరణ చేస్తే వాడికి స్వర్గం, మోక్షం రెండూ లభిస్తాయి. మృతిచెందినవాడి అస్థికల్ని ఎవరైనా గంగలో పడవేస్తే మరణించిన వాడికి ఉత్తమ గతులు గలుగుతాయి. ఆ అస్థులు (ఎముకలు) ఎంతకాలం గంగలో ఉంటాయో అంతకాలం ఆ జీవుడు స్వర్గంలో ఉంటాడు. ఏకారణం చేతైనా ఆత్మహత్య చేసుకున్న వాడికి పిండప్రదానం చేయకపోతే కనీసం వాడి అస్థికల్ని గంగలో కలిపినా పుణ్యప్రదమే. పతితుడై మరణించిన వాడిని ఉద్దేశించి ఎవరైనా నారాయణ బలి సమర్పిస్తే, అతడికి శ్రీమన్నారాయణుడి అనుగ్రహం లభిస్తుంది.

**మృత్యుధర్మం :** కమలలోచనుడైన నారాయణుడు వినాశం లేనివాడు. అందుకే అతడికి సమర్పించింది వినాశరహితమై ఉంటుంది. పతితులైన వారికి భోగమోక్షాల నిచ్చేది ఆ శ్రీహరే. సృష్టిలో ఉన్న ప్రతిఒక్కరూ ఏదో ఒకరోజు మరణించాల్సిన వారే. ఆ విషయాన్ని గుర్తుంచుకుని ప్రతి ఒక్కడూ తనకు విహితమైన ధర్మాన్ని ఆచరించాలి. యమలోకమార్గం అనేది ప్రతిఒక్కరికీ వేరువేరుగా ఉంటుంది. జీవుడు ఏలోకానికి వెళ్ళినా అతడి వెంట వెళ్ళేది ధర్మం ఒక్కటే. కనుక రేపు చేయాల్సిన పనిని ఈరోజే చేయాలి. మధ్యాహ్నం చేయాల్సిన పనిని ఉదయమే పూర్తిచేయాలి. ఎందుకంటే జీవుడు చేయాల్సిన పనిని అతడు చేసాడా లేదా అనేది మృత్యువు విచారించదు. దానిపని అది చేసుకుపోతుంది.

మనిషి పొలాలు, ఆవరణలు, గృహాలు, వంటి వాటిమీద ఆసక్తితో ఉన్నప్పుడు గొర్రెని ఆడతోడేలు వచ్చి తన్నుకుపోయినట్టు మృత్యువు మనిషిని తోలుకుపోతుంది. బలవత్తరమైన కాలానికి ఇష్టుడు, అయిష్టుడు అని ఎవరూ ఉండరు. ప్రారబ్ధకర్మ పూర్తయిన వెంటనే మృత్యువు హఠాత్తుగా వచ్చి కబళిస్తుంది. కాలం రానివాడిని వంద బాణాలతో కొట్టినా వాడు మరణించడు. కాలం నిండిన వాడిని కేవలం దర్భతో తాకినా చాలు మరణిస్తాడు.

మృత్యుగ్రస్తుడైన వాడిని ఔషధాలుగానీ మంత్రాలుగానీ, తంత్రాలు గానీ రక్షించలేవు. లేగదూడ సరిగ్గా తన తల్లి దగ్గరకి వెళ్ళినట్టు పూర్వజన్మలో చేసిన కర్మ ప్రారబ్ధం సరిగ్గా ఆ జీవుణ్ణి చేరుకుంటుంది. ఈ ప్రపంచం 'ఆది' ఏదైతేవుందో అది అవ్యక్తం. అలాగే దాని 'అంతం' కూడా అవ్యక్తమే. కేవలం మధ్యలో కనిపించేదే వ్యక్తం. మానవ శరీరంలో కౌమరం, యౌవనావస్థలు వచ్చినట్టుగానే ఒక శరీరం వదిలి మరో శరీరం వచ్చి చేరుతుంది. పాతవస్త్రం వదిలి నూతనవస్త్రాన్ని ధరించినట్టుగా జీవుడు తన పాతశరీరాన్ని వదిలి కొత్త శరీరాన్ని ధరిస్తాడు. జీవుడు ఎప్పటికీ మరణించడు. ఎవరిచేతా చంపబడడు. కేవలం రూపం మార్చుకుంటాడు. కనుక ఎవరూ మృత్యువు గురించి ఎలాంటి శోకాన్ని పొందకూడదు.

## వేదాధ్యయన విధి

మనువు, విష్ణువు, యాజ్ఞవల్క్యుడు, హారీతుడు, అత్రి మహాముని, యముడు, అంగిరసుడు, వశిష్ఠుడు, దక్షుడు, సంవర్తుడు, శాతాతపుడు, పరాశరుడు, ఆపస్తంభుడు, ఉశవస్సు, వ్యాసుడు, కాత్యాయనుడు, బృహస్పతి, గౌతముడు, శంఖలిఖితుడు అనేవారు భక్తి ముక్తి ప్రదమైన ఎన్నో రకాల ధర్మాల గురించి బోధించారు.

వేదాభ్యాసం, తపస్సు, జ్ఞానం, ఇంద్రియసంయమనం, అహింస, పెద్దలసేవ ఇవి శ్రేయస్సుని కలిగించే ధర్మాలు. వీటిలో అన్నిటికన్నా ఆత్మజ్ఞానం అనేది ఎంతో శ్రేష్ఠమైనది. అది అన్ని విద్యలకన్నా ఉత్తమమైనది. దానివల్ల మోక్షం లభిస్తుంది.

తనని సర్వ భూతాలలో సర్వభూతాలని తనలో చూసేవాడు నిజమైన ఆత్మజ్ఞాని. అలాంటి వాడు స్వారాజ్యాన్ని పొందుతాడు. కనుక మానవుడు ఆత్మజ్ఞానాన్ని సమానంగా ఉండేలా చూసుకుని వేదాభ్యాసం చేసే ప్రయత్నం చేయాలి. ఇది కేవలం ద్విజులకి మాత్రమే నిర్దేశించబడ్డ ధర్మం. విశేషంగా బ్రాహ్మణులకి సామర్థ్యాన్ని పెంపొందిస్తుంది.

వేదశాస్త్రాన్ని, దాని అర్థాన్ని, తత్త్వాన్ని సమగ్రంగా తెలుసుకున్నవాడు ఏ ఆశ్రమంలో ఉన్నప్పటికీ ఈ లోకంలోనే బ్రహ్మత్వాన్ని పొందగలుగుతాడు. శ్రావణ పూర్ణిమనాడు గానీ, శ్రవణా నక్షత్రం ఉన్న రోజున గానీ, హస్తానక్షత్ర యుక్త శ్రావణ శుక్ల పంచమినాడు గానీ, తన శాఖకి సంబంధించిన గృహ్యాసూత్రం ప్రకారం, నియమపూర్వకంగా వేదాధ్యయనాన్ని ప్రారంభించాలి. అలాగే పుష్యమాసంలో రోహిణీ నక్షత్రం ఉన్న రోజునగానీ అష్టక తిథులలోగానీ, నగరం లేక గ్రామం బైట నీటి (చెరువు) సమీపంలో వేదాధ్యయనోత్సర్గం చేయాలి.

**అనధ్యయన నిధి :** శిష్యుడు, ఋత్విక్కు, గురువు లేదా బంధువులు మరణించినప్పుడు మూడురోజుల పాటు వేదాధ్యయనం మానివేయాలి. ఉపాకర్మ-ఉత్సర్జన రోజు మొదలుకొని మూడురోజులు అధ్యయనం చేయకూడదు. తన వేదశాఖకు సంబంధించిన వేదాధ్యేత మరణించినప్పుడు అలాగే సంధ్యాకాలంలో ఉరుములు ఉరుముతున్నప్పుడు ఉత్పాతక సూచితమైన భయంకర ధ్వనులు వినిపిస్తున్నప్పుడు, భూకంపాలు వచ్చినప్పుడు, ఉల్కలు పడేడప్పుడు, వేదాధ్యయనం పరిసమాప్తి అయిన తరువాత, అరణ్యకం చదివిన తరువాత, ఒకరాత్రి అధ్యయనం చేయకూడదు.

పూర్ణిమ, చతుర్దశి, అష్టమి, రాహుగ్రస్త గ్రహణం, ఋతు సంధులు, శ్రాద్ధభోజనం చేసిన తరువాత, శ్రాద్ధ దానం పట్టినప్పుడు, ఒకరోజు అనధ్యయనాన్ని పాటించాలి. స్వాధ్యాయం చేసే వారిమధ్యలోంచి చెవులపిల్లి, కప్ప, ముంగిస, కుక్క, పాము, పిల్లి, పంది వెళితే ఒకరోజు అనధ్యయనం పాటించాలి. అపవిత్రవస్తువులు, శవం, శూద్రుడు, అంత్యజుడు, శ్మశానం, పతితుడు లాంటివారి సమీపంలో, అశుభ నక్షత్రాలున్న రోజుల్లో, మాటి మాటికీ మెరుపులు మెరుస్తున్నప్పుడు, తాత్కాలికంగా అనధ్యయనాన్ని పాటించాలి.

భోజనం చేసిన తరువాత తడిచేతులతో అధ్యయనం చేయకూడదు. నీటిలోపల, అర్ధరాత్రి సమయంలో, దుమ్ము ఎగురుతున్నప్పుడు, పెనుగాలులు వీస్తున్నప్పుడు, సంధ్యాసమయాలలో, మంచుపడుతున్నప్పుడు, భయం గొలిపే సందర్భాలలో అధ్యయనం చేయకూడదు. అదేవిధంగా నడుస్తూ, పరుగెడుతూ అధ్యయనం చేయకూడదు. ఏదైనా ఒక ప్రాణి బాధపడుతున్నప్పుడు, శిష్యులు ఇంటికి వచ్చినప్పుడు అధ్యయనం చేయకూడదు. గాడిద, ఒంటె, రథం లాంటి వాహనాలు ఎక్కినప్పుడు, ఏనుగు, గుర్రం, నావ, వృక్షం లాంటివి ఎక్కినప్పుడు శ్మశాన భూమి దగ్గర అధ్యయనం ఎప్పుడూ చేయకూడదు. ఇక్కడ చెప్పినవన్నీ తాత్కాలిక అనధ్యయన కాలాలు.

## నవగ్రహ పూజా హోమం

ఐశ్వర్యాన్ని కోరుకునేవారు, శాంతిని వాంఛించేవారు, తుష్టి, పుష్టి ఆయుర్ధాయాల్ని కోరుకునేవారు లేదా అభిచార క్రియల్ని ప్రారంభించాలను కునేవారు ముందుగా నవగ్రహాల్ని పూజించాలి. సూర్యుడు, చంద్రుడు, కుజుడు, బుధుడు, శుక్రుడు, గురువు, శని, రాహువు, కేతువు అని గ్రహాలు తొమ్మిది. రాగి, స్ఫటికం, రక్త చందనం, బంగారం (బుధ–గురువులకి) రజతం, ఇనుము, సీసం (రాహు – కేతువులు) అనే లోహాలతో నవగ్రహాల మూర్తులని నిర్మించాలి. లేదా ఆయాగ్రహాల రంగులతో రాసిన మండలాన్ని పూజించాలి. నవగ్రహవర్ణాలకి అనుగుణమైన రంగుల వస్త్రాల్ని, పుష్పాల్ని, గంధాల్ని సమర్పించాలి. గుగ్గిలంతో నవగ్రహాలకి ధూపం వేయాలి. ప్రతిగ్రహానికీ మంత్రపూర్వకంగా చరువుని సమర్పించాలి.

నవగ్రహాలకు వరుసగా 1.రవికి–ఆకృష్ణేన.. 2.చంద్రుడికి–ఇమందేవా.. 3.కుజుడికి–అగ్నిర్మూర్ధా.. 4.బుధుడికి–ఉద్బుధ్యస్వ.. 5.బృహస్పతికి – బృహస్పతే అతియదర్య.. 6.శుక్రుడికి–శుక్రంతే అన్య.. 7.శనికి – శమగ్ని రగ్ని.. 8.రాహువుకి – శన్నోదేవీ.. 9.కేతువుకి కేతుంకృణ్వన్.. అనే మంత్రాలు వినియోగించాలి.

నవగ్రహాలకి వరుసగా సూర్యుడికి - జిల్లేడు, చంద్రుడికి - పలాశ, కుజుడికి–ఖదిర, బుధుడికి–అపామార్గ, గురువుకి–పిప్పల, శుక్రుడికి–ఉదుంబర, శనికి–జమ్మి, రాహువుకి–దుర్వా, కేతువుకి–దర్భలు అనే వాటిని సమిధలుగా హోమంలో వినియోగించాలి. ఒక్కో గ్రహానికి హోమం చేసేడప్పుడు కనీసం 108 సమిధల్ని ఉపయోగించాలి. ఈ సమిధల్ని ఉపయోగిస్తూ నెయ్యి లేక పెరుగులతో హోమం చేయాలి.

నవగ్రహహోమాన్ని ఆచరించినవారు బ్రాహ్మణులకి భోజనం పెట్టేముందు వరుసగా బెల్లం పరమాన్నం, పాయసం, హవిష్యాన్నం, క్షీరయష్టికం, దధ్యోదనం, హవిస్సు, ఆవుపాలు, చిత్రాన్నం (పులిహోర) సమర్పించాలి. తరువాత హోమం చేసిన విప్రుల్ని భోక్తలుగా వచ్చిన విప్రుల్ని యథాశక్తి సత్కరించాలి. నవగ్రహాలనుద్దేశించి దక్షిణగా ధేనువు, శంఖం, ఎద్దు, సువర్ణం, వస్త్రం, అశ్వం, కపిలధేనువు, మేక–వీటిని దానం చేయాలి. రాజుల ఉన్నత పతనాలు కూడా గ్రహాధీనంగానే వుంటాయి. మానవుల సమస్త శుభాశుభ విషయాలన్నిటికీ నవగ్రహాలే కారణం. కనుక అందరూ నవగ్రహాల్ని పూజించాలి.

## స్తోత్ర ప్రాయశ్చిత్తం

మానవులు ప్రారబ్ధవశాన తెలిసికానీ, తెలియకకానీ ఎన్నో రకాల పాపపు పనులు చేస్తుంటారు. వాటిలో కొన్ని రకాల పాపాలకి ప్రాయశ్చిత్తాలు ధర్మశాస్త్రాలలో చెప్పబడ్డాయి. అందులో చెప్పిన విధంగా ప్రాయశ్చిత్త విధిని ఆచరిస్తే పాపాలు తొలగిపోతాయి. అయితే ఈ ప్రాయశ్చిత్తాల్ని కూడా ఆచరించలేని అశక్తులుంటారు. వారికోసమే సకల పాపహరుడైన శ్రీమహావిష్ణువు స్తోత్రం చెప్పబడింది. దీన్ని పఠిస్తే చాలు పాపాలన్నీ తొలగిపోతాయి.

## సకల పాపహర శ్రీ మహావిష్ణు స్తుతి

విష్ణవే విష్ణవే నిత్యం విష్ణవే విష్ణవే నమః ।
నమామి విష్ణుం చిత్తస్థమహాఙ్కా రగతిం హరిమ్ ॥ 1

చిత్తస్థమీశమవ్యక్త మనన్త మపరాజితమ్ ।
విష్ణుమీద్యమ శేషేణ హ్యనాదినిధనం విభుమ్ ॥ 2

విష్ణుశ్చిత్తగతో యన్మే విష్ణుర్బుద్ధి గతశ్చ యత్ ।
యచ్చాహఙ్కారగో విష్ణుర్యద్విష్ణుర్మయి సంస్థితః ॥ 3

కరోతి కర్మ భూతోఽసౌ స్థావరస్య చరస్య చ ।
తత్పాపం నాశమాయాతు తస్మిన్నేవ హి చిన్తితే ॥ 4

ద్యాతో హరతి యత్పాపం స్వప్నే దృష్టస్తు భావనాత్ ।
తముపేన్ద్రమహం విష్ణుం ప్రణతార్తిహరం హరిమ్ ॥ 5

జగత్యస్మిన్నిరాధారే మజ్జమానే తమస్యదః ।
హస్తావలమ్బనం విష్ణుం ప్రణమామి పరాత్పరమ్ ॥ 6

సర్వేశ్వరేశ్వర విభో పరమాత్మన్నధోక్షజ ।
హృషీకేశ హృషీకేశ హృషీకేశ నమోస్తు తే ॥ 7

నృసింహానన్త గోవిన్ద భూతభావన కేశవ ।
దురితం దుష్కృతం ధ్యాతం శమయాఘం నమోఽస్తుతే ॥ 8

యన్మయా చిన్తితం దుష్టం స్వచిత్తవశవర్తినా ।
అకార్యం మహదత్యుగ్రం తచ్ఛమం నయ కేశవ ॥ 9

బ్రహ్మణ్య దేవ గోవిన్ద పరమార్థ పరాయణ ।
జగన్నాథ జగద్ధాతః పాపం ప్రశమయాచ్యుత ॥ 10

యథాపరాహ్ణే సాయాహ్నే మధ్యాహ్నే చ తథా నిశి ।
కాయేన మనసా వాచా కృతం పాపమజానతా ॥ 11

జానతా చ హృషీకేశ పుణ్డరీకాక్ష మాధవ ।
నామత్రయోచ్చారణతః స్వప్నే యాతు మమ క్షయమ్ ॥ 12

శారీరం మే హృషీకేశ పుణ్డరీకాక్ష మాధవ ।
పాపం ప్రశమయాద్య త్వం వాక్కృతం మమ మాధవ ॥ 13

యద్భుఞ్జన్యత్స్వపం స్తిష్ఠన్గచ్ఛజ్జాగ్రద్యదా స్థితః ।
కృతవాన్ పాపమద్యాహం కాయేన వచసా గిరా ॥ 14

యత్స్వల్పమపి యత్స్థూలం కుయోనినరకావహమ్ ।
తద్యాతు ప్రశమం సర్వం వాసుదేవానుకీర్తనాత్ ॥ 15

వరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం చ యత్ ।
తస్మిన్ ప్రకీర్తితే విష్ణౌ యత్పాపం తత్ ప్రణశ్యతు ॥ 16

యత్ప్రాప్య న నివర్తన్తే గన్ధస్పర్శాదివర్జితమ్ ।
సూరయ స్తత్పదం విష్ణోస్తత్సర్వం శమయత్వఘమ్ ॥ 17

పాపప్రణాశనం స్తోత్రం యః పఠేచ్ఛృణుయాదపి ।
శారీరైర్మానసైర్వాగ్జైః కృతైః పాపైః ప్రముచ్యతే ॥ 18

సర్వపాపగ్రహాదిభ్యో యాతి విష్ణోః పరం పదమ్ ।
తస్మాత్పాపే కృతే జప్యం స్తోత్రం సర్వాఘమర్దనమ్ ॥ 19

ప్రాయశ్చిత్తమఘౌఘానాం స్తోత్రం వ్రతకృత వరమ్ ।
ప్రాయశ్చిత్తైః స్తోత్ర జపైర్వ్రతైర్నశ్యతి పాతకమ్ ।
తతః కార్యాణి సంసిద్ధ్యైతాని వై భుక్తి ముక్తయే ॥ 20

*(శ్లో॥2-20,అధ్యా-171)*

పరమపవిత్రమైన ఈ పాపనాశన స్తోత్రాన్ని చదివినవారు, విన్నవారు మనో వాక్కాయాల ద్వారా చేసిన అన్ని రకాల పాపాలనుంచీ విముక్తిని పొందుతారు. కనుక ఎవరైనా తెలిసీ తెలియక పాపాలుచేసి వాటి ప్రాయశ్చిత్తాల్ని చేసుకోలేకపోతే త్రికరణ శుద్ధిగా ఈదివ్యస్తోత్రాన్ని పఠిస్తే ప్రాయశ్చిత్తం జరుగుతుంది.

## ఏకవార వ్రతాలు

ఏకవార వ్రతాలు ఎంతో విశేషమైన శుభఫలితాలనిచ్చే వ్రతాలు. వీటిని ఆచరించటం ద్వారా ఆయురారోగ్యాలు పొందవచ్చు. ఆదివారం నాడు హస్తా

లేక పునర్వసు నక్షత్రం ఉన్న రోజు పవిత్రంగా ఓషధులతో కూడిన నీళ్ళతో స్నానంచేసి శ్రాద్ధం ఆచరించాలి. అలాచేసిన వాడు ఏడు జన్మల పాటు రోగాలతో పీడించబడడు. సంక్రాంతి రోజున ఆదివారం వస్తే అది పవిత్రమైన పర్వదిన మవుతుంది. ఆ రోజుని ఆదిత్యహృదయం అని వ్యవహరిస్తారు. ఆ పవిత్రమైన రోజున ప్రారంభించి ఒక సంవత్సరం పాటు నక్త వ్రతాన్ని (ఉదయం ఉపవాస ముండి రాత్రి భోజనం చేయటం) ఆచరిస్తే అతడికి సకల కార్యసిద్ధి కలుగుతుంది.

చిత్రా నక్షత్ర యుక్త సోమవారం చంద్రుడికి ప్రీతికరమైన రోజు. ఆనాడు వ్రతాన్ని ఆచరించిన వాడికి సుఖాలు కలుగుతాయి. స్వాతీ నక్షత్రంతో ఉన్న మంగళవారం నాడు ప్రారంభించి ఏడు మంగళవారాలు నక్తవ్రతం చేసిన వాడికి కుజుడి అనుగ్రహం లభిస్తుంది. అన్ని కష్టాలనుంచీ అతడికి విముక్తి లభిస్తుంది. అన్ని కష్టాలనుంచీ అతడికి విముక్తి లభిస్తుంది. విశాఖా నక్షత్రయుక్త బుధవారం నాడు మొదలుపెట్టి ఏడుబుధవారాలు నక్తదీక్షని ఆచరిస్తే నష్టాలు తొలగిపోయి వ్యాపారాభివృద్ధి జరుగుతుంది.

అనురాధా నక్షత్రంతో ఉన్న గురువారం బృహస్పతికి ప్రీతికరమైన రోజు. ఆనాడు ప్రారంభించి వరుసగా ఏడు గురువారాలు నక్త వ్రతాన్ని చేసినవాడు గురుగ్రహ దోషాలనుంచి విముక్తి పొందుతాడు.

జ్యేష్ఠా నక్షత్రయుక్త శుక్రవారం నాడు మొదలుపెట్టి వరుసగా ఏడు శుక్రవారాలు నక్తదీక్షని ఆచరిస్తే శుక్రగ్రహ దోషాలన్నీ తొలగిపోయి వ్రతం చేసినవాడికి యశస్సు, కీర్తి, ఆకర్షణ పెంపొందుతాయి. శని గ్రహానికి అత్యంత ప్రీతికరమైనది మూలానక్షత్రం ఆ రోజు మొదలుపెట్టి వరుసగా ఏడు శనివారాలు నక్తవ్రతాన్ని ఆచరిస్తే శనిగ్రహదోషాలు తొలగిపోతాయి. ఆయుర్ధాయం పెరుగుతుంది.

ఈ నక్త వ్రతాల్ని ఆచరించేవారు ఆయా గ్రహాలకి సంబంధించిన రోజుల్లో ఆయా గ్రహాల్ని పూజించి అష్టోత్తరాది స్తోత్రాల్ని కూడా పఠిస్తే ఫలితం మరింత త్వరగా లభిస్తుంది. వ్రతం పూర్తయిన తరువాత ఆయా గ్రహాలకి చెప్పిన దానాల్ని ఇస్తే మరింత శ్రేయస్కరం.

## నక్షత్ర వ్రతాలు

నక్షత్రాలు మొత్తం 27. ఈ నక్షత్రాలలో పరబ్రహ్మ స్వరూపుడైన శ్రీమహావిష్ణువుని పూజించినవారికి సకల శుభమంగళాలు కలుగుతాయి. వారికున్న సమస్త గ్రహబాధలూ తొలగిపోతాయి.

నక్షత్రపురుషుడైన శ్రీమహావిష్ణువుని చైత్రమాసంలో పూజించాలి. ఈ మాసంలో వచ్చే మూలా నక్షత్రంనాడు–శ్రీమహావిష్ణువు పాదాలని, రోహిణీ నక్షత్రం నాడు–మోకాళ్ళని, పూర్వాషాఢ ఉత్తరాషాఢ నక్షత్రాలున్న రోజు ఊరు(తొడలు) ద్వయాన్ని, పూర్వ ఫల్గుణీ ఉత్తర ఫల్గుణీ నక్షత్రాలున్నరోజు మేఢ్రాన్ని, కృత్తిక నాడు–కటి ప్రదేశాన్ని, పూర్వాభాద్ర ఉత్తరాభాద్రల్లో – ఇరుపార్శ్వాలనీ

రేవతీ నక్షత్రం నాడు కుక్షిని, అనురాధా నక్షత్రంనాడు స్తనద్వయాన్ని, ధనిష్ఠ నక్షత్రం ఉన్నరోజు – పృష్ఠ భాగాన్ని, విశాఖనాడు – భుజద్వయాన్ని, పునర్వసునక్షత్రం నాడు వ్రేళ్ళని, ఆశ్లేషా నక్షత్రంలో – గోళ్ళని, జ్యేష్ఠా నక్షత్రం నాడు కంఠాన్ని, శ్రవణానక్షత్రం నాడు చెవుల్ని, పుష్యమినాడు ముఖాన్ని, స్వాతీ నక్షత్రంలో దంతాగ్రాలని, శతభిషానక్షత్రం నాడు లలాటాన్ని మఘనాడు నాసికని, మృగశిరా నక్షత్రంలో కళ్ళని, చిత్తా నక్షత్రంలో శిరస్సుని, ఆర్ద్రా నక్షత్రంలో కేశాలని పూజించాలి.

ఈవిధంగా పూజించిన తరువాత ఒక సంవత్సరం గడిచాక బెల్లంతో నింపిన ఒక కలశం మీద శ్రీమహావిష్ణువు స్వర్ణ లేదా యథాశక్తి ఏదో ఒక లోహంతో చేసిన ప్రతిమని ఉంచి, ఆ మూర్తిని షోడశోపచారాలతో పూజించి దక్షిణ సహితంగా విప్రులకి దానం చేయాలి. దానితో పాటు యథాశక్తి గో, భూ, శయ్యా దానాలు కూడా చేస్తే మంచిది.

## శాంభవీయ వ్రతం

సకల నక్షత్ర పూజ్యుడైన శ్రీహరికి శంకరుడికీ భేదం లేదు. అందుకే శాంభవీ వ్రతాన్ని ఆచరించేవాడు పౌర్ణమి రోజున ఆ నక్షత్రాలు ఉండడం వల్ల

కదా నెలలకు ఆ పేర్లు వచ్చాయి? కృత్తికనక్షత్రంతో ప్రారంభమయ్యే కార్తీక మాసంలో, అలాగే మృగశిరా నక్షత్రంతో ప్రారంభమయ్యే మార్గశిర మాసంలో, కేశవాది నామాలతో శ్రీమహావిష్ణువుని పూజించాలి.

కార్తీక పౌర్ణిమనాడు నేను కృత్తికా నక్షత్ర స్వరూపుడైన శ్రీహరిని పూజిస్తాను. భక్తిముక్తి ప్రదమైన శాంభవీయ వ్రతాన్ని ఆచరిస్తాను అని సంకల్పం చెప్పుకోవాలి. తరువాత కేశవాది మూర్తులతో ఉన్నవాడు, ఆయురారోగ్యాభివృద్ధి కలిగించేవాడు అయిన అచ్యుతుణ్ణి ఆవాహన చేస్తున్నాను అని చెప్పి శ్రీహరిని ఆవాహన చేయాలి. ఆ విధంగా శ్రీహరిని ఆవాహన చేసి యథాశక్తి పూజించాలి. కార్తీకం నుంచి మాఘమాసం వరకూ వరుసగా నాలుగు నెలలు యథాశక్తి అన్నదానం చేయాలి.

ఫాల్గుణ మాసం నుంచి ఆషాఢమాసం వరకూ ముద్గాన్నాన్ని, ఆషాఢం నుంచి ఆశ్వయుజం వరకు పాయసాన్నాన్ని స్వామికి నివేదన చేయాలి. రాత్రిపూట శ్రీహరి నైవేద్యాన్ని సమర్పించి యథాశక్తి అన్నదానం చేయాలి. ఆ విధంగా ఒక సంవత్సరం పాటు ఈ శాంభవీయవ్రతాన్ని ఆచరించి వ్రత సమాప్తి అయ్యాక పంచగవ్యాల్ని కలిపిన నీళ్ళతో స్నానం చేసి పంచగవ్యాల్ని త్రాగటం ద్వారా పవిత్రుడవుతాడు. ఉద్వాసన చెప్పటానికి ముందు శ్రీహరికి సమర్పించిన నైవేద్యాన్ని అందరికీ పంచిపెట్టాలి. చివరగా శ్రీమహావిష్ణువుని భక్తి పూర్వకంగా ఇలా ప్రార్థించాలి.

## శ్రీ మహావిష్ణువు ప్రార్థన

నమోనమస్తేఽచ్యుత మే క్షయోఽస్తు పాపస్య వృద్ధిం సముపైతుపుణ్యం ।
ఐశ్వర్యవిత్తాది సదాక్షయం మే క్షయం చ మానన్తతిర భ్యుపైతు ॥
యథాచ్యుతస్త్వం పరతః పరస్తాత్స బ్రహ్మ భూతః పరతః పరాత్మన్ ।
తథాచ్యుతత్వం కురుఛివాంచితం మే మయాకృతం పాపహారాప్రమేయా ॥
అచ్యుతానంత గోవింద ప్రసీదయదభీప్సితం ।
అక్షయం మామమేయాత్మన్ కురుష్వ పురుషోత్తమ ॥

*(శ్లో॥15-17,అధ్యా-196)*

**భావం :** ఓ అచ్యుతా! నీకు నమస్కారం. నా పాపలన్నీ నశించి పుణ్యాలు వృద్ధిచెందుగాక! నాకున్న ఐశ్వర్యం ఎప్పుడూ అక్షయంగా వుండుగాక! నా సంతాన పరంపర విచ్ఛిన్నం కాకుండా వృద్ధిచెందుగాక. ఓ పరాత్పరా! పరమేశ్వరా! నీవు ఏవిధంగా పరాత్పరుడిగా, బ్రహ్మగా నీ స్థానం నుంచి ఏవిధంగా చ్యుతుడవి కావో అదేవిధంగా నా మనోవాంఛితాలన్నీ సఫలం చేయి. ఓ పాపవినాశకుడా! నేను చేసిన పాపాలన్నిటినీ తొలగించు. అచ్యుతా! గోవిందా! అప్రమేయా! అనంతా! పురుషోత్తమా! నన్ను అనుగ్రహించి నాకు ఇష్టమైన కార్యాలు సఫలమయ్యేలా చేయిప్రభూ!

ఈ విధంగా శ్రీహరిని ప్రార్థించినట్లైతే సకల పాపాలూ హరిస్తాయి. ఈ స్తోత్రాన్ని ఎవరైనా ఎప్పుడైనా పఠించవచ్చు. ఈ ప్రకారంగా వరుసగా ఏడు సంవత్సరాలు శాంభవీయ వ్రతాన్ని ఆచరించినవాడు భోగమోక్షాల్ని పొందుతాడు.

## అనంత వ్రతం

మార్గశీర్ష మాసంలో మృగశీర్షా నక్షత్రం ఉన్నరోజు, గోమూత్రాన్ని కొద్దిగా త్రాగి పవిత్రుడై శ్రీహరిని పూజించాలి. అనంతుడైన శ్రీహరి తనని పూజించిన వాడికి అనంతమైన ఫలాల్ని ప్రసాదిస్తాడు. ఈ వ్రతం చేసిన వారికి రాబోయే జన్మలో కూడా అనంతమైన పుణ్యం లభిస్తుంది. ఇది కోరిన కోరికల్ని తీరుస్తుంది. సంపదల్ని అక్షయంగా ప్రసాదిస్తుంది.

అనంత వ్రతాన్ని ఆచరించేవాడు ఉదయంపూట విధియుక్తంగా శ్రీహరిని పూజించి ఆ రాత్రి నూనెలేని పదార్థాలతో భోజనం చేయాలి. అనంతుడైన శ్రీహరిని ఉద్దేశించి మార్గశీర్ష మాసం నుంచి ఫాల్గుణ మాసం వరకూ నెయ్యిని, చైత్రమాసం నుంచి ఆషాఢమాసం వరకు బియ్యాన్ని, శ్రావణ మాసం నుంచి కార్తీకం వరకు పాలని ఉపయోగించి అనంతుడి ప్రీత్యర్థం హోమం చేయాలి. ఎంతో గొప్పదైన ఈ అనంతవ్రతాన్ని ఆచరించటం వల్లనే యవనాశ్వమహారాజుకి 'మాంధాత' అనే పుత్రుడు జన్మించాడు.

## దీపదాన వ్రతం

వ్రతాలన్నిటిలోకీ విశేషమైనది, భక్తిముక్తి ప్రదమైనది దీపదాన వ్రతం. దేవాలయంలోకానీ, బ్రాహ్మణుల ఇళ్ళలో గానీ ఒక సంవత్సరం పాటు ప్రతి రోజూ లేక ప్రతివారం లేక ప్రతిమాసం దీపదానం చేసినవాడు సకల కామ్యాలనీ పొందుతాడు. చాతుర్మాస్యం సందర్భంగా దీపదానం చేసినవాడు విష్ణులోకానికి, కార్తీక మాసంలో దీపదానం చేసినవాడు స్వర్గ లోకానికీ వెళతారు. దీపదానాన్ని మించిన సులభతరమైన వ్రతం మరొకటి లేదు. ఇకపై ఉండబోదు

దీపే నాయుష్య చక్షుష్మాన్ద్వీ పాలక్ష్మీసుతాదికమ్ ।
సౌభాగ్యం దీపదః ప్రాప్య స్వర్గలోకే మహీయతే ॥

*(శ్లో॥3,అధ్యా-200)*

దీపదానం చేయటం వల్ల ఆయుర్దాయం పెరుగుతుంది. కంటిచూపు అభివృద్ధి చెందుతుంది. నేత్రవ్యాధులు రావు. ధనప్రాప్తి సంతాన ప్రాప్తి కలుగుతుంది. దీపదానం చేసినవాడు సకల సౌభాగ్యాలనీ పొంది స్వర్గలోకంలో దేవతలచేత  పూజించబడతాడు.

పూర్వం విదర్భ రాజకుమారి అయిన లలితారాణి దీపదానం చేసిన పుణ్యం వల్ల 'చారుధర్మ' మహారాజుకి భార్య అయ్యింది. అంతేకాదు అతడికున్న వందమంది భార్యల్లో గొప్పదానిగా ప్రసిద్ధి పొందింది. పరమపతివ్రతలు అయిన ఆ లలితారాణి ఒకసారి శ్రీహరి ఆలయంలో వెయ్యి దీపాల్ని దానం చేసింది. అది చూసి ఆమె సవతులందరూ దీపదాన మాహాత్మ్యం గురించి చెప్పమని కోరగా ఆమె ఈ విధంగా చెప్పటం ప్రారంభించింది.

**దీపదాన మాహాత్మ్యం :** పూర్వం సౌవీరుడనే మహారాజు దగ్గర మైత్రేయుడనే పురోహితుడుండేవాడు. అతడు తన రాజుకి చెప్పి దేవికా నదీ తీరంలో ఒక విష్ణు ఆలయాన్ని నిర్మింపచేసాడు. కార్తీక మాసంలో ఆ విప్రుడు విష్ణుఆలయంలో దీపదానం చేసాడు. ఆలయమంతా దీపాలతో ఆనాడు అలంకరించారు. పూజలన్నీ ముగించి అందరూ వెళ్ళిపోయారు.

ఆ రాత్రి ఆలయంలో వెలుగుతున్న దీపాలలో ఒకదీపం వత్తి దిగిపోయి ఆరిపోవటానికి సిద్ధంగా వుంది. ఆ సమయంలో ఒక పిల్లి తరుముతుంటే దాన్ని తప్పించుకుని పరుగెడుతున్న ఒక ఎలుక పిల్ల హఠాత్తుగా ఆ దీపం వత్తిని పైకి లేపింది. దానితో ఆరిపోయే దీపం కాస్తా పైకి లేచి వెలిగింది.

కాలక్రమంలో ఆ ఎలుక మరణించింది. అది పూర్వజన్మలో శ్రీహరి ఆలయంలో దీపాన్ని వెలిగించిన కారణంగా ఒక అందమైన రాకుమారిగా మారి చారుధర్ముడనే మహారాజుకి ఇష్టమైన భార్యగా ఎంతో కీర్తి ప్రతిష్ఠలు పొందింది. సఖులారా! ఆ రాకుమారిని నేనే. ఆనాడు నాకు తెలియకుండానే దీపం వెలగటానికి కారణమయ్యాను. ఆ పుణ్య ఫలితంగా నాకు పూర్వజన్మ జ్ఞానం కూడా లభించింది. అంత గొప్ప ఫలితాన్ని పొందాను కనుకనే నేను ఈ జన్మలో దీపదానాన్ని క్రమం తప్పకుండా చేస్తున్నాను. పవిత్రమైన ఏకాదశి నాడు దీపదానాన్ని చేస్తే స్వర్గలోకంలో సుఖభోగాలు లభిస్తాయి.

దీపాన్ని ఆర్పినవాడు మూగవాడు, బుద్ధిహీనుడు అవుతాడు. చీకటితో నిండిన నరకంలో పడతాడు. ఆ విధంగా దీపాన్ని హరించి నరకానికి వెళ్ళిన వారితో యమధర్మరాజు ఇలా అంటాడు. ఏమిరా! పాపాత్ములారా! మీరు ఎన్నో పాపాలు చేసారు. పరభార్యల్ని, పరద్రవ్యాన్ని అపహరించారు. అదీ చాలక ఆలయంలో వెలిగించిన దీపాన్ని కూడా హరించారు. అన్ని పాపాలు చేసిన మీరు నరకంలో మేము విధించే శిక్షలకి ఎందుకు అయ్యో! అమ్మో! అని అరుస్తున్నారు. ఏ శ్రీమహావిష్ణువు నామం పలకటానికి మీ నాలుకకి ఏమైనా బరువా! నూనె, వత్తి, నిప్పు లభించే వస్తువులే కదా! వాటితో దీపాన్ని వెలిగించి ఎంతో పవిత్రమైన దీపదానాన్ని చేయకుండా, ఎవరో వెలిగించిన దీపాల్ని హరించారు. అదే మీకు నరక యాతన కలిగిస్తోంది. ఇప్పుడు ఏడ్చి ఏం లాభం? మీరు శిక్షలు అనుభవించక తప్పదు" అని అన్నాడు.

సఖులారా! ఇదీ దీపదాన మహాత్మ్యం అని లలితారాణి చెప్పగానే, వారంతా ఎంతో భక్తి ప్రపత్తులతో ఆనాటి నుంచి దీపదానం చేయటాన్ని ఒక వ్రతంగా ఆచరించారు.

## పత్ర - పుష్పార్చన కథనం

జగన్నాథుడు, సర్వాలంకార సంశోభితుడు అయిన శ్రీమహావిష్ణువుకి ధూప, దీప, నైవేద్యాలు సమర్పిస్తే చాలు ప్రసన్నుడవుతాడు. శ్రీహరిని పూలతో అర్చించటం మంచి పద్ధతి. అయితే ఆయన్ని అర్చించటానికి యోగ్యమైన పూలు, అయోగ్యమైన పూలు వుంటాయి. వాటిని గురించి తెలుసుకుని సరైన పూలతో మాత్రమే ఆయన్ని పూజించాలి.

**యోగ్యమైన పుష్పాలు-పత్రాలు :** శ్రీహరి పూజకి మాలతీపుష్పం చాలా యోగ్యమైనది. తమాల పుష్పంతో ఆయన్ని పూజిస్తే భోగమోక్షాలు రెండూ లభిస్తాయి. మల్లికాపుష్పం సకల పాపాల్నీ హరిస్తుంది. యూధికపుష్పం విష్ణులోకాన్ని అందిస్తుంది. అలాగే అతిముక్త లోధ్ర పుష్పాలు కూడా విష్ణులోక ప్రాప్తి కలిగిస్తాయి. కరవీర పుష్పాలతో పూజించేవాడు విష్ణులోకాన్ని చేరుకుంటాడు. జపాపుష్పాలతో చేసే పూజ మోక్షప్రదం పావంతీ, కుబ్జక, తగర పుష్పాలు విష్ణులోకాన్నిస్తాయి.

కర్ణికార పుష్పాలతో శ్రీహరిని అర్చిస్తే వైకుంఠానికి చేరుకుంటారు. కురంట పుష్పపూజ పాపాల్ని నశింపచేస్తుంది. కమల, కుంద, కేతుకీ పుష్పాలు పరమపదప్రాప్తి కలిగిస్తాయి. బాణపుష్ప, కృష్ణతులసీ పత్రాలతో పూజ చేసేవాడు విష్ణులోకాన్ని చేరుకుంటాడు. అశోక, తిలక, అటపుష్పాలతో పూజచేసే వాడు మోక్షాధికారి అవుతాడు. బిల్వ, శమీపత్రాలతో, తమాలదళాలతో, భృంగరాజాలతో హరిపూజ చేసేవాడు విష్ణులోకంలో శాశ్వత నివాసాన్ని పొందుతాడు. కృష్ణతులసి, శుక్లతులసి, కల్హార, ఉత్పల, పద్మ కోకనదపుష్పాలు పుణ్యప్రదాలు.

వంద కమలాలతో ఒక మాలచేసిదాన్ని విష్ణువుకి సమర్పిస్తే ఎంతో సంతోషిస్తాడు. నీవ, అర్జున, కదంబ, కింశుక, అగస్త్య, గోకర్ణ, నాగకర్ణ, సంధ్యాపుష్పీ, బిల్వాతక, రంజనీ, కేతకీ, కూష్మాండ, గ్రామకర్కటీ,కుశ, కాశ, ద్యూత, విభీతక, మరువకాది పత్రాలతో ఇంకా ఇతరమైన సుగంధ పత్రాలతో పూజచేస్తే శ్రీహరి ప్రసన్నుడవుతాడు.

స్వర్ణాలక్షాధికం పుష్పం మాలాకోటి గుణాధికా ।
భుక్తిర్ముక్తిః పాపహానిర్భక్త్యా సర్వైస్తుతుష్యతి ॥ *(శ్లో॥11,అధ్యా-202)*

ఈ విధంగా వివిధరకాల పుష్పాలతో, పత్రాలతో శ్రీహరిని అర్చించిన వాడు భుక్తిని ముక్తిని పొందుతాడు. లక్ష బంగారు నాణాలకన్నా కోటిరెట్లు పుష్పాలు ఉత్తమమైనవి.

**అయోగ్యమైన పుష్పాలు-పత్రాలు :** రాలనిపూలు, నలిగిపోయిన పూలు శ్రీహరి పూజకి పనికిరావు. అలాంటి వాటితో పూజిస్తే పుణ్యానికి బదులు పాపం కలుగుతుంది. కాంచనార, ఉమ్మెత్త, గిరికర్ణికా, (కొండగన్నేరు) కుటజ, శాల్మలి, శిరీష పుష్పాలతో శ్రీహరిని పూజించకూడదు. వీటితో పూజించినవాడు నరకానికి వెళతాడు. అలాగే సువాసన లేని గుమ్మడిపూలు, వేపపూలు పూజకి నిషిద్ధాలుగా చెప్పబడ్డాయి.

సుగంధైర్బ్రహ్మ పద్మైశ్చ పుష్పైర్నీలోత్పలై ర్హరిః ।
అర్కమందార ధూర్తూర కుసుమైరర్చ్యతే హరః ॥
కుటజైః కర్కటీ పుష్పైః కేతకీం నశివేదదేత్ ॥
*(శ్లో॥14-15,అధ్యా-202)*

సుగంధభరితమైన బ్రహ్మ కమలాలతో, రక్తకమలాలతో, నీలకమలాలతో శ్రీహరిని పూజించాలి. అలాగే జిల్లేడు, మందారం, ధుత్తూర పుష్పాలతో శంకరుణ్ణి పూజించాలి. అయితే కుటజపుష్పాలు, కర్కటీ, మొగలిపూలు శివపూజకి పనికిరావు.

అహింస, ఇంద్రియనిగ్రహం, ఓర్పు, జ్ఞానం, దయ, స్వాధ్యాయం లాంటి భావపుష్పాలతో దేవతల్ని పూజించే మానవుడు భుక్తి ముక్తులకి పాత్రుడవుతాడు. వీటిలో 1.అహింస మొదటిపుష్పం 2.ఇంద్రియ నిగ్రహం రెండోపుష్పం 3.సకల ప్రాణుల మీద దయ కలిగి ఉండటం మూడో పుష్పం 4.ఓర్పు అనేది నాలుగో పుష్పం 5.శమం 6.తపస్సు 7.ధ్యానం 8.సత్యం - ఈ విధంగా ఎనిమిది ఉత్తమ గుణాలనే పుష్పాలతో భగవంతుణ్ణి పూజించాలి.

ఇతరమైన పుష్పాలన్నీ శ్రీహరి బాహ్య పూజకి మాత్రమే ఉపకరిస్తాయి. కానీ ఉత్తమ గుణాలనే భావపుష్పాలతో చేసే పూజతోనే శ్రీహరి ఎంతో సంతోషిస్తాడు.

నీరు అనేది వారుణపుష్పం, నెయ్యి, పాలు, పెరుగు అనేవి సౌమ్యపుష్పాలు, అన్నాది నైవేద్యాలు ప్రాజాపత్యపుష్పాలు, ధూపదీపాలు ఆగ్నేయపుష్పాలు, ఫలపుష్పాదులు వానస్పత్యపుష్పాలు, శ్రద్ధాది భావాలు వైష్ణవ పుష్పాలు - ఈ విధంగా అష్టవిధ కుసుమాలతో శ్రీహరికి చేసే పూజ సకల కామ్యాలనీ తీరుస్తుంది.

## నరక స్వరూపం

ప్రతి ఒక్క జీవీ ఆయుర్ధాయం తీరగానే మరణిస్తాడు. అలా మరణించిన వారిలో పుణ్యకర్మల్ని ఆచరించినవాళ్ళు స్వర్గానికి, పాపకర్మల్ని ఆచరించిన వాళ్ళు నరకానికీ వెళతారు. జీవి మరణించిన తరువాత యమదూతలు వచ్చి పాపాత్మల్ని దుర్గమమైన మార్గం ద్వారా యమపురిలోకి తీసుకువెళ్ళి యమధర్మరాజు ముందు నిలబెడతారు. ఆ యమదూతలు కాలస్వరూపులు, మహాభయంకరులు. యముడి ఆజ్ఞప్రకారం పాపులు నరకంలో వదిలేయబడతారు.

గోహత్య చేసినవాణ్ణి 'మహావీచీ' అనే నరకంలో పడేసి ఒక లక్ష సంవత్సరాలు బాధలు పెడతారు. బ్రహ్మ హత్య చేసిన వారిని చాలా భయంకరమైన 'తామ్రకుంభ' నరకంలోకి ప్రవేశపెడతారు. భూమిని అపహరించిన వాణ్ణి రౌరవాది నరకాల్లో పడేసి మహాప్రళయం వరకూ చిత్రహింసల పాలు చేస్తారు.

స్త్రీలు, బాలురు, వృద్ధుల్ని చంపిన పాపాత్ములు పద్నాలుగుమంది ఇంద్రుల రాజ్యం పూర్తయ్యేంత వరకూ మహారౌరవనరకంలో కఠినమైన బాధలనుభవిస్తుంటారు. ఇతరుల ఇళ్ళని, పొలాల్ని తగులబెట్టిన దుర్మార్గుణ్ణి ఒక కల్పం ముగిసేవరకూ మహారౌరవ నరకంలో పడేసి కాలుస్తారు. దొంగతనం చేసిన వారిని తామిస్రనరకంలో పడేసి చిత్రహింసలు పెడతారు. మాతృహత్య చేసిన పాపాల్ని అసిపత్రం అనే నరకంలో పడేస్తారు.

అక్కడున్న యముడి అనుచరులు వాడి శరీరాన్ని తమ కత్తులతో తునాతునకలు చేస్తారు. లోకంలో ఇతరుల్ని కాల్చిచంపే వారిని నరకంలో 'కరంభావలుక' అనే ప్రాంతానికి తీసుకువెళ్ళి వేడి ఇసుకలో వేయిస్తారు.

ఇతరులకి పెట్టకుండా, దానం చేయకుండా కేవలం తనొక్కడే మృష్టాన్నభోజనం చేసేవాడిని 'కాకోలం' అనే నరకంలో పురుగు రెట్టల్ని తినిపిస్తారు. పంచమహాయజ్ఞాలని, నిత్య కర్మల్ని త్యజించేవారు 'కుట్టలం' అనే నరకంలో మలమూత్రాలు త్రాగుతూ గడపాలి. అభక్ష్యమైన (తినకూడని) వస్తువుల్ని తినేవారు మహాదుర్గంధమనే నరకానికి చేరుకుని అక్కడ రక్తాన్నే ఆహారంగా స్వీకరిస్తారు. ఇతరుల్ని బాధలకి గురిచేసి వారిని తైలపాకం అనే నరకానికి తీసుకెళ్ళి నువ్వులు నల గొట్టినట్టు నలగ్గొడతారు. శరణన్నవాడిని ఎవరైనా రక్షించకుండా చంపితే అలాంటి వాణ్ణి కూడా తైలపాక నరకానికి తీసుకెళ్ళి నూనెలలో వేయిస్తారు. యజ్ఞంకోసం ద్రవ్యం లేదా ఏదో ఒక సాయం చేస్తానని మాటిచ్చి దాన్ని నెరవేర్చనివాడు 'నిరుచ్ఛ్వాసం' అనే నరకానికి వెళ్ళి చిత్రహింసల పాలవుతాడు. అలాగే అబద్ధాలాడే వాడు, మహాపాతక నరకానికి, రస విక్రయం చేసే వాడు 'వజ్రకటాహ' నరకానికి వెళతారు.

మహాపాపాలు చేసేవారు 'మహాజ్వాల' అనే నరకానికి, వర్ణ సంకరం చేసి పిల్లల్ని కన్నవాడు గుడపాక (బెల్లంపాక) నరకానికి, ఇతరుల మర్మస్థానాల్ని బాధపెట్టినవాడు, 'ప్రతుద' మనే నరకానికి ప్రాణహింస చేసేవాడు 'క్షారహదాని' నరకానిక, భూమిని అపహరించినవాడు 'క్షురధారా' నరకానికి, 'వజ్రశస్త్ర' మనే నరకానికి, మధువు దొంగతనం చేసినవాడు పరీతాపనరకానికి, ఇతరుల ద్రవ్యాన్ని గానీ, వస్తువుల్ని గానీ అపహరించిన వాడు 'కాలసూత్ర' మనే నరకానికి, అధికంగా మాంసాన్ని భుజించేవాడు 'కశ్మల' మనే నరకానికి, పితరులకి పిండప్రదానం చేయనివాడు 'ఉగ్రగ్రంథం' అనే నరకానికీ వెళతారు.

లంచాలు తీసుకునేవాడు 'దుర్ధర' నరకానికి, నిరపరాధుల్ని బంధించి హింసించేవాడు లోహమయమైన 'మంజూష' అనే నరకానికి, వేదాల్ని నిందించినవాడు 'అప్రతిష్ఠ' మనే నరకానికి, అసత్యపు సాక్ష్యాన్నిచ్చేవాడు

'పూతివక్త్రం' అనే నరకానికి, ధనాన్ని అపహరించిన వాడు 'పరిలుంఠం' అనే నరకానికి, బాల, స్త్రీ, వృద్ధుల్ని చంపినవాడు 'కరాల' మనే నరకానికి, మద్యపానం చేసే బ్రాహ్మణుడు 'విలేప' మనే నరకానికి, మిత్రుల్లో పరస్పరం భేదభావాలు కల్పించేవాడు 'మహాప్రేతం' అనే నరకానికి చేరుకుంటాడు. అక్కడ చిత్రవిచిత్రమైన హింసలకి గురౌతాడు.

పరస్త్రీలని మోహించి వారిని బలాత్కారం చేసిన పురుషుడు, అనేక మంది పురుషులతో సంబంధం పెట్టుకున్న స్త్రీ వీరిద్దరూ 'శాల్మలం' అనే నరకానికి వెళతారు. అక్కడ వీరికి కాలుతున్న లోహ ప్రతిమని కౌగిలించుకునే శిక్షని విధిస్తారు. పరస్త్రీలని నీచదృష్టితో చూసేవారి కళ్ళు పీకేస్తారు. తల్లితో, కూతురితో సంబంధం పెట్టుకున్న వారిని కణకణలాడే నిప్పుల కొలిమిలో పడేస్తారు. మాంసభక్షణ చేసే వారికి నరకంలో వారి మాంసాన్ని కోసి తినిపిస్తారు.

ఈ విధంగా వివిధ రకాల పాపాలు చేసిన వాళ్ళు వివిధ రకాల నరకాలకి వెళ్ళక తప్పదు. అయితే శ్రీమన్నారాయణుడికి ప్రీతికరమైన ఏకాదశీ వ్రతాన్నిగానీ, భీష్మ పంచక వ్రతాన్ని గానీ చేసేవారు నరకానికి వెళ్ళరు.

## భీష్మ పంచక వ్రతం

సకల మనోరథాలనీ తీర్చేది సకల పాపాలనీ తొలగించేది శ్రీమన్నారాయణుడికి అత్యంత ప్రీతిపాత్రమైనది భీష్మపంచక వ్రతం. ఈ వ్రతాన్ని కార్తీక శుద్ధ ఏకాదశినాడు ప్రారంభించి, వరుసగా ఐదురోజుల పాటు, మూడుకాలాల్లో స్నానంచేసి, నువ్వులతో, యవలతో దేవతలకి, పితృదేవతలకి అయిదు తర్పణాలు ఇవ్వాలి. ఈ అయిదు రోజాలు తర్పణాలిచ్చిన తరువాత శ్రద్ధగా శ్రీమహావిష్ణువుని పూజించాలి.

పంచామృతాలతో, పంచగవ్యాలతో శ్రీహరి ప్రతిమకి స్నానం చేయించి, చందనాది సుగంధ ద్రవ్యాలు, గుగ్గిలం వేసి ధూపాన్ని, ఆవునేతితో దీపాన్ని సమర్పించాలి. ఆ తరువాత మధురమైన భోజన పదార్థాలని, పిండివంటల్ని యథాశక్తి స్వామికి నివేదించాలి. తరువాత ఓం నమో భగవతే వాసుదేవాయ"

అనే ద్వాదశాక్షర మంత్రాన్ని 108 సార్లు జపించాలి. జపానంతరం "ఓం నమోభగవతే వాసుదేవాయ స్వాహా" అనే మంత్రం చెబుతూ నెయ్యితో తడిపిన నువ్వుల్ని ఉపయోగించి హోమం చేయాలి.

మొదటిరోజు నారాయణుడి పాదాల్ని కమలాలతో, రెండో రోజు స్వామి మోకాళ్ళని, తొడల్ని బిల్వ పత్రాలతో, మూడోరోజు స్వామి నాభి (బొడ్డు) ప్రదేశాన్ని భృంగరాజు (గుంటగలగర) పత్రాలతో, నాలుగోరోజు హృదయాన్ని ముఖాన్ని బాణ పుష్పాలు బిల్వపత్రాలు, జపాకుసుమాలతో, అయిదో రోజు స్వామి సర్వాంగాలనీ మాలతీ పుష్పాలతో పూజించాలి. ఈ పూజ చేసేడప్పుడు శ్రీమహావిష్ణు అష్టోత్తర శతనామ స్తోత్రాన్ని గానీ, సహస్రనామ స్తోత్రాన్ని గానీ పఠించాలి.

మహాపవిత్రమైన ఈ భీష్మ పంచక వ్రతాన్ని ఆచరించేవారు, వ్రతంచేసే అయిదు రోజులూ నేలమీదే పడుకోవాలి. ఏకాదశి నాడు గోమాయన్ని (ఆవుపేడని), ద్వాదశిరోజు గోమూత్రాన్ని, త్రయోదశినాడు ఆవుపెరుగుని, చతుర్ధశిరోజు ఆవుపాలని, వ్రతం చివరిరోజు పంచగవ్యాలని కొద్దిగా స్వీకరించాలి. చివరిరోజైన పౌర్ణామాసినాడు నక్తం అనగా ఉదయం ఉపవాసముండి రాత్రి భోజనం చేయాలి.

ఈ విధంగా భీష్మపంచక వ్రతాన్ని శ్రద్ధా భక్తులతో ఆచరించిన వారు భుక్తిముక్తి పొందుతారు. పూర్వం కురువృద్ధుడైన భీష్మపితామహుడు ఈ వ్రతాన్ని ఆచరించటం వల్లే శ్రీహరిని చేరుకున్నాడు. అందుకే ఈ వ్రతానికి భీష్మ పంచక వ్రతమని పేరు వచ్చింది. బ్రహ్మదేవుడు కూడా ఈ దివ్యవ్రతాన్ని ఆచరించి శ్రీహరిని పూజించాడు. కనుక సకల శుభాలని కలిగించే ఈ వ్రతం అందరూ ఆచరించి తమ తమ పాపాల్ని పోగొట్టుకోవచ్చు.

## వ్రతదానాలు

మానవులు ఐహికాముష్మిక కార్యాలు సిద్ధించటం కోసం వ్రతాలు, దానాలు చేస్తుంటారు. ఇవి ఎంతో విశేషమైన ఫలితాలనిస్తాయి. వ్రతాల్లో

చేసే దానాలకి సంబంధించిన వస్తువులు, దానం చేసేకాలం ఇవన్నీ మహావిష్ణువు విభూతులే. అందుకే శ్రీహరిని ఉద్దేశించి చేసిన వ్రతాలు, దానాలు, పూజలు మానవుల సకల మనోరధాల్ని నెరవేరుస్తాయి.

నారాయణా! జగత్పతీ! నీకు నమస్కారం. నా ఆహ్వానాన్ని స్వీకరించి రా స్వామీ! నేను సమర్పించే ఆసన, అర్ఘ్య, పాద్య, మధుపర్క, ఆచమన, స్నాన, వస్త్ర, గంధ, ధూప, దీప, నైవేద్యాలని స్వీకరించు అని భక్తి పూర్వకంగా ప్రార్థించాలి. ఈ విధంగా శ్రీహరిని షోడశోపచారాలతో పూజించాక దాన సంకల్పాన్ని ఇలా చెప్పుకోవాలి.

**సామాన్యదాన సంకల్పం :**

అద్యాముక సగోత్రాయ విప్రాయాముక శర్మణే ।
గోత్రసంతతి వృద్ధ్యర్ధం విజయాయ ధనాయచ ॥ 1

ధర్మాయైశ్వర్య కామాయ తత్పాపశమనాయ చ ।
సంసార ముక్తయే దానం తుభ్యమహం సంప్రదదేహ్యాహమ్ ॥ 2

ఏతద్దాన ప్రతిష్ఠార్థం తుభ్యమేతద్దదామ్యహమ్ ।
ఏతేన ప్రీయతాం నిత్యం సర్వలోక పతిః ప్రభుః ॥ 3

యజ్ఞదాన వ్రతపతే విద్యాకీర్త్యాది దేహిమే ।
ధర్మకామార్ధ మోక్షాంశ్చ దేహిమే మనసేప్సితమ్ ॥ 4

యఃపఠేచ్ఛృణుయాన్నిత్యం వ్రతదాన సముచ్ఛయమ్ ।
సంప్రాప్తకామో విమలోభుక్తిం ముక్తి మవాప్నుయాత్ ॥ 5

తిథివార వర్ష సంక్రాంతి యోగ మన్వాదికం వ్రతమ్ ।
నైకథా వాసుదేవా దేర్నియమా త్పూజనాద్భవేత్ ॥ 6

*(శ్లో॥6-12,అధ్యా-208)*

**భావం :** "ఈరోజున ఈ గోత్రం కలిగిన 'ఈ శర్మ' అనే బ్రాహ్మణుడికి నేను సమస్త పాపాలు శాంతి కలగటానికి, ఆయురారోగ్య సౌభాగ్యాలు వృద్ధి చెందటానికి, సంతానప్రాప్తి కోసం, విజయం ప్రాప్తించటానికి,

ధర్మార్ధ కామ మోక్షాలు కలగటానికి పాపనాశపూర్వకంగా సంసారం నుంచి విముక్తి పొందటానికి, శ్రీమహావిష్ణువు ప్రీత్యర్థం, శ్రీమహావిష్ణువుకి సంబంధించిన, శ్రీమహావిష్ణు స్వరూపాలైన ఈ ద్రవ్యాలని నీకు దానం చేస్తున్నాను.

ఈ దానం సఫలమవటం కోసం నీకు సువర్ణాది ద్రవ్యాల్ని కూడా సమర్పిస్తున్నాను. నేను చేసిన ఈ దానం వల్ల శ్రీహరి సదా ప్రసన్నుడౌగాక! ఓ యజ్ఞదాన వ్రతాధీశా! నాకు విద్యాయశస్సుల్ని అనుగ్రహించు. ధర్మార్థకామ మోక్ష రూపాలైన నాలుగువిధాల పురుషార్థాలని నా మనోభిలాషితాలైన వస్తువుల్ని అనుగ్రహించు" అని సంకల్పం చెప్పాలి.

దీనినే వ్రతదాన సముచ్చయం అంటారు. దీన్ని ప్రతిరోజూ పఠించేవాడు అభీష్టసిద్ధిని పొందుతాడు. సకల పాపాలనుంచి విముక్తుడై భుక్తి ముక్తులు రెండింటినీ పొందుతాడు. వాసుదేవుడికి సంబంధించిన ఇలాంటి పూజానియమాల్ని శ్రద్ధగా పాటిస్తూ తిథి, వార, నక్షత్ర సంక్రాంతి, యోగ, మన్వాదులకి సంబంధించిన వ్రతాల్ని ఆచరించినట్లైతే కోరిన కోరికలు తీరుతాయి.

## దానం ఎప్పుడు చేయాలి?

ఇష్టం-పూర్తం అని దానం రెండు విధాలుగా ఉంటుంది. దానధర్మాల్ని ఆచరించేవాడు అనుకున్నవన్నీ పొందగలడు. దిగుడు బావులు, బావులు, చెరువులు, దేవాలయాలు, అన్నదాన సత్రాలు, ఉద్యానవనాలు వీటిని నిర్మించటం, స్థాపించటం అనే క్రియలకి పూర్తం అని పేరు. ఇవి ముక్తిని ప్రసాదించే దానాలు.

అగ్ని హోత్రం, సత్యభాషణం, స్వాధ్యాయం అతిధి సత్కారం. బలి వైశ్వదేవం వీటికి 'ఇష్ట' అని పేరు. ఇవి ఆచరిస్తే స్వర్గ ప్రాప్తి కలుగుతుంది.

గ్రహణ సమయంలో, సూర్యసంక్రమణ రోజుల్లో, ద్వాదశాది తిథుల్లో చేసే దానాన్ని పూర్తం" అది స్వర్గ ఫలప్రదం. ఇతర సమయాల్లో చేసిన దానాలకన్నా కోటిరెట్లు అధికఫలాన్నిస్తుంది. సూర్యుడి ఉత్తరాయణ, దక్షిణాయన ప్రదేశ కాలాలలో, పుణ్యకాలాలైన విషువకాలాలలో, వ్యతీపాత తిథిక్షయ,

యుగారంభ, సంక్రాంతి, చతుర్దశీ, అష్టమీ, పూర్ణిమా, ద్వాదశీ, అష్టకాశ్రాద్ధ, యజ్ఞ, ఉత్సవ, వివాహ, మన్వంతరారంభ, వైధృతియోగ, దుఃస్వప్నదర్శన, ధనప్రాప్తి, సద్బ్రాహ్మణ ప్రాప్తి సమయాలలో దానాలు చేయాలి.

ఏరోజైతే శ్రద్ధ కలుగుతుందో ఆ రోజు లేదా ఏ సమయంలోనైనా దానం చేయవచ్చు. రెండు ఆయనాలు, రెండు విషువలు అనే నాలుగు సంక్రాంతి పర్వదినాలలో, షడశీతిముఖాలని ప్రసిద్ధమైన నాలుగు సంక్రాంతులలో, విష్ణుపదం అని ప్రసిద్ధి చెందిన నాలుగు సంక్రాంతులలో మొత్తం ఈ పన్నెండు రకాల సంక్రాంతి పర్వదినాలు దానం చేయటానికి ఉత్తమోత్తమమైన కాలాలు.

కన్యామిధున రాశులలో వచ్చే సూర్య సంక్రమణానికి షడశీతిముఖం అనిపేరు. అనగా ఈ కాలంలో ఏరకమైన దానంచేసినా అది ఎనభైనాలుగు (84)రెట్లు అధికంగా ఫలితాన్నిస్తుంది. ఉత్తరాయణ, దక్షిణాయన సంక్రాంతులలో అతీత–అనాగత ఘడియలు వస్తాయి. అవి చాలా పవిత్రమైనవి. అలాగే కర్కాటక సంక్రాంతికి ఇరవైఘడియల కాలం దాన ధర్మాలకి ఎంతో ఉత్తమమైనవి.

తులా మేష సంక్రాంతులలో ముందూవెనకా వచ్చే పదిపది ఘడియలు పుణ్యకాలంగా చెప్పబడతాయి. షడశీతిముఖ సంక్రాంతి వచ్చిన తరువాత అరవై ఘడియల కాలం ఎంతో పుణ్యప్రదమైనది. అలాగే విష్ణుపదా సంకాంతులలో ముందూ వెనకా వచ్చే పదహారు ఘడియల కాలం కూడా ప్రశస్తమైనది. ఇవన్నీ దాన ధర్మాలకి యోగ్యమైన సమయాలు. వీటితో పాటు శ్రవణా, అశ్వినీ, ధనిష్ఠా నక్షత్రాలలో, ఆశ్లేషా మొదటి పాదంలో ఆదివారం వచ్చినట్లైతే దాన్ని వ్యతీపాత యోగమంటారు. ఇదికూడా దానం చేయటానికి తగిన పుణ్యకాలమే.

దానం చేయటానికి యుగాల ప్రారంభ దినాలు కూడా చాలా ప్రశస్తమైనవిగా చెప్పబడ్డాయి. కార్తీక శుక్ల పక్ష నవమినాడు కృతయుగం ప్రారంభమయ్యింది. వైశాఖ శుక్లతదియ రోజు త్రేతాయుగం, అలాగే మాఘపూర్ణిమనాడు ద్వాపరయుగం, భాద్రపద కృష్ణ త్రయోదశి రోజు కలియుగం

ప్రారంభమవుతాయి. ఈ యుగ ప్రారంభాలుగా చెప్పబడ్డ ఈ తిథుల్లో చేసిన దానం అక్షయమైన ఫలితాలనిస్తుంది.

మన్వంతరాల ప్రారంభకాలాలు కూడా దానం చేయటానికి విశేషమైన రోజులుగా చెప్పబడ్డాయి. అవి ఏవంటే 1.ఆశ్వయుజ శుక్లపక్ష నవమి 2.కార్తీక ద్వాదశి, 3-4 మాఘ భాద్రపదమాసాల్లో వచ్చే తదియలు 5.ఫాల్గుణ మాసంలో వచ్చే అమావాస్య 6.పుష్యమాస ఏకాదశి 7.ఆషాఢమాస దశమి 8.మాఘ మాసంలో వచ్చే సప్తమి 9.శ్రావణమాస కృష్ణపక్ష అష్టమి 10.ఆషాఢ పూర్ణిమ 11-12-13 కార్తీక, ఫాల్గుణ, జ్యేష్ఠ పూర్ణిమలు. ఇవన్నీ మన్వంతరాలు ప్రారంభతిధులు. ఈ తిథుల్లో దానం చేయటం ఎంతో ప్రశస్తం.

మార్గశిర పౌర్ణమి తరువాత వచ్చే మూడు అష్టమి తిథులకి 'అష్టకా' అనిపేరు. ఈ అష్టకా తిథుల్లో దానం చేసిన వారికి అక్షయమైన ఫలం లభిస్తుంది. అదేవిధంగా గంగా, యమునా, ప్రయాగ లాంటి పుణ్యతీర్థాలలో దేవాలయాలలో అడగకుండా ఎవరైనా దానం చేస్తే అది ఉత్తమదానంగా చెప్పబడుతుంది. అయితే కన్యాదానవిషయంలో ఈ మాట వర్తించదు.

**దానం ఎలా ఇవ్వాలి :** దానం ఇచ్చే దాత తూర్పుముఖంగా నిలబడి దానం ఇవ్వాలి. దానాన్ని గ్రహించేవాడు ఉత్తరం వైపు ముఖం ఉంచి దానం స్వీకరించాలి. ఇలా దానం చేసేవాడి ఆయుర్దాయం వృద్ధి చెందుతుంది. దానం చేసేవాడు తన పేరుని, తీసుకునేవాడి పేరుని చెప్పి దానం ఇవ్వాలి.

1.బంగారం 2.గుర్రాలు 3.నువ్వులు 4.ఏనుగులు 5.దాసీజనం 6.రథాలు 7.భూమి 8.గృహాలు 9.కన్య 10.కపిల గోవులు వీటిని దశ దానాలంటారు. విద్య, పరాక్రమం, తపస్సు, కన్య, యజమాని, శిష్యులు వల్ల లభించింది దానం కాదు. దాన్ని శుల్కం అంటారు.

**దానం రకాలు :** వడ్డీలు, వ్యవసాయం, వ్యాపారం ఇతరులకి ఉపకారం చేయటం వీటివల్ల లభించిన ధనం సాత్త్వికం. జూదం, దొంగతనం, వేషాలు వేయటం, సాహసమైన పనులు చేయటం వీటివల్ల పొందిన ధనం రాజసం.

అలాగే ఇతరుల్ని మోసగించి సంపాదించిన ధనం తామసం. ఈ మూడు రకాల దానాల వల్ల వచ్చే ఫలితాలు కూడా అలాగే ఉంటాయి. ఒకసారి మాట ఇచ్చిన తరువాత దానం చేయకపోతే వాడికి సంబంధించిన వందకులాలు నాశనమౌతాయి.

దేవానాంచ గురూణాంచ మాతాపిత్రో స్తథైవచ ।
పుణ్యం దేయం ప్రయత్నేన యత్పుణ్యం చార్జితం క్వచిత్ ॥
ప్రతిలాభేచ్ఛయా దత్తం యద్ధనం తదపార్ధకమ్ ।
శ్రద్ధయా సాధ్యతే ధర్మో దత్తంవార్యపిచాక్షయమ్ ॥

*(శ్లో॥29-30,అధ్యా-209)*

ఎక్కణ్ణుంచి సంపాదించిన ధనాన్నైనా పుణ్యదేవతలకి, ఆచార్యుడికి, తల్లితండ్రులకి ప్రయత్నపూర్వకంగా సమర్పించాలి. ఏదో లాభాన్ని ఆశించి దానం చేస్తే దానివల్ల ఎలాంటి ప్రయోజనం ఉండదు. ధర్మం, దానం అనేవి శ్రద్ధతో చేస్తేనే సిద్ధిస్తాయి. శ్రద్ధగా కేవలం నీళ్ళు ఇచ్చినా అది అక్షయ ఫలితాలనిస్తుంది. కనుక దానం చేయటానికి ముఖ్యంగా కావలసింది శ్రద్ధ అని గ్రహించాలి.

**షోడశ మహాదానాలు :**

సర్వదానాని వక్ష్యామి మహాదానాని షోడశ ।
తులాపురుష ఆద్యంతు హిరణ్యగర్భదానకమ్ ॥ 1

బ్రహ్మాండం కల్పవృక్షశ్చ గోసహస్రం చ పంచమమ్ ।
హిరణ్యకామధేనుశ్చ హిరణ్యాశ్వశ్చ సప్తమమ్ ॥ 2

హిరణ్యాశ్వరథస్తద్వద్ధేమ హస్తిరథస్తథా ।
పంచలాంగలకం తద్వర్ధరాదానం తథైవ చ ॥ 3

విశ్వచక్రం కల్పలతా సప్తసాగరకం పరమ్ ।
రత్నధేనుర్మహాభూత ఘటః శుభదినేఽర్పయేత్ ॥ 4

*(శ్లో॥1-4,అధ్యా-210)*

1.తులాపురుషదానం 2.హిరణ్యగర్భదానం 3.బ్రహ్మాండదానం 4.కల్పవృక్షదానం 5.సహస్రగోదానం 6.స్వర్ణకామధేనుదానం 7. స్వర్ణనిర్మిత అశ్వదానం 8.బంగారంతో చేసిన గుర్రాలతో కూడిన రథదానం 9.బంగారంతో చేసిన ఏనుగుదానం 10.హలపంచక (ఐదునాగళ్ళ) దానం 11.భూదానం 12.విశ్వచక్రదానం 13.కల్పలతాదానం 14.సప్తసముద్ర దానం 15.రత్నాలతో నిర్మించిన ధేనుదానం 16.నీటితో నింపిన పూర్ణ కుంభదానం అనే వాటిని షోడశ మహా(16)దానాలంటారు. ఒక శుభముహూర్తంలో ఒక మండలాకారంలో ఒక మండపాన్ని ఏర్పర్చి అందులో ఇష్టదేవతా పూజచేసి ఈ పదహారు రకాల దానాలని యోగ్యుడైన విప్రుడికి ఇవ్వాలి. ఈ దానం అన్నిదానాల కన్నా ఎంతో ప్రశస్తమైనది.

**గోదానమహిమ :** పది ఆవులున్నవాడు ఒక ఆవుని, వంద ఆవులున్నవాడు పది ఆవుల్ని, వెయ్యి ఆవులున్నవాడు వంద ఆవుల్ని దానం చేస్తే వచ్చే ఫలితం అందరికీ సమానంగానే ఉంటుంది. సహస్ర (వెయ్యి) గోవుల్ని దానం చేసినవాడు కుబేరుడి రాజధాని అలకాపురికి వెళ్ళి అక్కడ అప్సరసలతో బంగారు భవనాలలో సుఖభోగాలనుభవిస్తాడు. వంద గోవుల్ని దానం చేసిన వాడు నరకం నుంచి విముక్తి పొందుతాడు.

దూడతో సహా గోవుని దానం చేసినవాడు స్వర్గంలో దేవతల చేత పూజించబడతాడు. గోదానం చేయటం వల్ల దీర్ఘాయువు, ఆరోగ్యం ఐశ్వర్యం లభిస్తుంది. స్వర్గం ప్రాప్తిస్తుంది.

**మహిషీ(గేదె)దానం :** గోదానంలాగానే మహిషీదానం కూడా ఎంతో పవిత్రమనది. మహిషీదానం చేయటం వల్ల సకల సౌభాగ్యాలు లభిస్తాయి. ఈ క్రింది మంత్రాన్ని చదువుతూ మహిషీ దానాన్ని చేయాలి.

ఇంద్రాదిలోక పాలానాం యారాజమహిషీ శుభా ।
మహిషీదాన మాహాత్మ్యా దస్తుమే సర్వకామదా ॥

ధర్మరాజస్య సాహాయ్యే యస్యాః పుత్రః ప్రతిష్ఠితః ।
మహిషాసురస్య జననీ యాసాస్తు వరదా మమ ॥
మహిషీ దానాశ్చ సౌభాగ్యం వృషదానాద్దివం వ్రజేత్ ॥

*(శ్లో॥4-6,అధ్యా-211)*

ఇంద్రాది లోకపాలకులందరికీ మంగళమయమైనది ఈ రాజమహిషీ దేవి. ఈ మహిషీ దానం చేయటం వల్ల నాకు పుణ్యం లభించి, తద్వారా నా మనోభీష్టాలన్నీ నెరవేరుగాక! ఏ మహిషి పుత్రుడు యమధర్మరాజుకి సహాయకుడుగా నియమించబడ్డాడో, ఏ మహిషి, మహిషాసురుడికి తల్లిగా ఉన్నదో! ఆ దేవి నాకు వరాల్ని ప్రసాదించుగాక! అని చెప్పి మహిషీ దానం చేసినవాడు స్వర్గాన్ని పొందుతాడు.

## సంధ్యావిధి - గాయత్రీ మంత్రం

ఓఙ్కారం యో విజానాతి సయోగీ సహరిః పుమాన్ ।
ఓఙ్కార మభ్యసే త్తస్మాన్మంత్రసారం తు సర్వదమ్ ॥ 1
సర్వమంత్ర ప్రయోగేషు ప్రణవః ప్రథమః స్మృతః ।
తేన సమ్పరిపూర్ణం యత్తత్పూర్ణం కర్మనేతరత్ ॥ 2
ఓఙ్కారపూర్వికాస్తిస్రో మహావ్యాహృతయోఽవ్యయాః ।
త్రిపదా చైవ సావిత్రీ విజ్ఞేయం బ్రహ్మణోముఖమ్ ॥ 3

*(శ్లో॥1-3,అధ్యా-214)*

ఓంకారతత్త్వాన్ని తెలుసుకున్నవాడే యోగి. అతడే విష్ణువు. అందుకే అందరూ సకల భూత సారమైన ఓంకారాన్ని అభ్యసించాలి. సమస్త మంత్ర ప్రయోగాల ప్రారంభంలో కూడా ఓంకారం ఉచ్చరించబడుతుంది. ఓం కారంతో చేసిన కర్మనే ఉత్తమ కర్మ అంటారు. ఓంకారం లేని ఏ కర్మ పరిపూర్ణం కాదు.

మొదట ఓం కారంతో, మూడు శాశ్వత వ్యాహృతులతో కూడిన, మూడు పదాల గాయత్రీ మంత్రం వేదాలకి ముఖంలాంటిది.

**గాయత్రీమంత్ర జపమహాత్మ్యం :**

పాపేకృతే తిలైర్హోమో గాయత్రీ జప ఈరితః ।
జప్త్వాసహస్రం గాయత్ర్యా ఉపవాసీ సపాపహా ॥ 1

గోఘ్నః పితృఘ్నో మాతృఘ్నో బ్రహ్మా హాగురు తల్పగః ।
బ్రహ్మఘ్నః స్వర్ణహారీచ సురాపోలక్షజప్యతః ॥ 2

శుద్యతే వా౨థ వాస్నాత్వా శతమంతర్జలే జపేత్ ।
జపః శతేన పీత్వాతు గాయత్ర్యాః పాపహాభవేత్ ॥ 3

శతం జప్తాతు గాయత్రీ పాపోపశమనీ స్మృతా ।
సహస్రజపాత సాదేవీ హ్యుపపాతకనాశినీ ॥ 4

అభీష్టదా కోటిజప్తా దేవత్వం రాజతామియాత్ ।
ఓజ్కారం పూర్వ ముచ్చార్య భూర్భువః సస్త్రథైవచ ॥ 5

*(శ్లో॥14,అధ్యా-214)*

మూడు సంవత్సరాలు నిత్యం గాయత్రీ జపాన్ని చేసేవారు వాయువై, ఆకాశ స్వరూపుడై పరబ్రహ్మని చేరుకుంటాడు. ఏకాక్షరమైన ఓంకారమే పరబ్రహ్మం. ప్రాణాయామమే గొప్ప తపస్సు. గాయత్రీ మంత్రాన్ని మించింది ఏదీ లేదు. మౌనంగా ఉండటం కన్నా సత్యాన్ని పలకటం శ్రేష్ఠం. ఏడుసార్లు గాయత్రీ మంత్రాన్ని ఆవృత్తి చేస్తే సకల పాపాలూ నశిస్తాయి. పదిసార్లు ఆవృత్తి చేస్తే స్వర్గఫలం లభిస్తుంది. ఇరవైసార్లు ఆవృత్తి చేస్తే గాయత్రీదేవి స్వయంగా ఆ సాధకుణ్ణి తనలోకానికి తీసుకుపోతుంది. ఇక నూటఎనిమిది సార్లు నిత్యం గాయత్రీ మంత్ర జపం చేసిన వాడు సంసార సాగరం నుంచి తరించబడతాడు.

రుద్రమంత్ర జపంకన్నా, కూష్మాండమంత్ర జపం కన్నా, గాయత్రీ మంత్ర జపం ఎంతో గొప్పది. గాయత్రీ మంత్రం కన్నా జపించతగ్గ గొప్పమంత్రం మరేదీ లేదు. గాయత్రీ వ్యాహృతులతో చేసే హోమం కన్నా గొప్ప హోమం లేదు. గాయత్రీ మంత్రంలోని ఒకపాదం గానీ, కనీసం సగం పాదంగానీ జపించినా చాలు గాయత్రీదేవి అనుగ్రహం లభిస్తుంది.

గాయత్రీ మంత్రం బ్రహ్మహత్య, సురాపానం, బంగారం దొంగలించటం, గురుపత్నీగమనం లాంటి మహాపాతకాల్ని కూడా నశింపచేస్తుంది. ఎలాంటి పాపానికైనా నువ్వులతో చేసే హోమం, గాయత్రీ మంత్రజపం తగిన ప్రాయశ్చిత్తం. ఉపవాస దీక్షతో నిత్యం సహస్రగాయత్రీ మంత్ర జపాన్ని చేసేవాడు తన పాపాలన్నీ నశింపచేసుకుంటాడు. గోవధ, పితృవధ, మాతృవధ, బ్రహ్మహత్య, బ్రాహ్మణ ద్రవ్య అపహరణ, బంగారం దొంగతనం చేయటం, సురాపానాన్ని చేయటం లాంటి పాపాలు ఆచరించినవారు 1 లక్ష సార్లు గాయత్రీ మంత్ర జపాన్ని చేస్తే పరిశుద్ధుడవుతాడు.

నదీస్నానం చేసిన తరువాత నీళ్ళలోనిలబడి వందసార్లు గాయత్రీ జపం చేయాలి. తరువాత గాయత్రీ మంత్రంతో అభిమంత్రించి వందసార్లు నీళ్ళతో ఆచమనం చేయాలి. అలాచేసిన వాడు పాపరహితుడవుతాడు. వందసార్లు గాయత్రీ జపం సమస్త పాపాలనీ నశింపచేస్తుంది. వెయ్యిసార్లు జపిస్తే ఉపపాతకాలు కూడా నశిస్తాయి. కోటి గాయత్రీ జపం చేసిన వాడికి గాయత్రీ దేవి అభీష్టవరాల్ని ప్రసాదిస్తుంది. గాయత్రీ జపాన్ని నిత్యం చేసేవాడు దేవత్వాన్నేకాక దేవరాజత్వాన్ని కూడా పొందుతాడు.

“ఓం భుర్భువః స్వః – తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్ ఓం” – ఈవిధంగా గాయత్రీ మంత్రాన్ని జపించాలి. గాయత్రీ మంత్రానికి విశ్వామిత్రుడు ఋషి, గాయత్రి ఛందస్సు, సవిత దేవత, ఉపనయన కర్మలలో జప హోమాలలో ఈ మంత్రాన్ని వినియోగించాలి.

**గాయత్రీ మంత్ర అధిదేవతలు :** గాయత్రీమంత్రం మొత్తం ఇరవైనాలుగు అక్షరాలు. ఈ ఇరవైనాలుగు అక్షరాలకీ ఇరవైనాలుగు మంది అధిష్ఠాన దేవతలున్నారు.

1. త=అగ్ని 2. త్స=వాయువు 3. వి=సూర్యుడు 4. తు=విద్యుత్ 5. ర్వ = యముడు 6. రే=జలపతి 7. ణ్యం=బృహస్పతి 8. భ=పర్జన్యుడు 9. ర్గో=ఇంద్రుడు 10. దే=గంధర్వుడు 11. వ=పూషన్ 12. స్య=మిత్రుడు

13.ధీ=వరుణుడు 14.మ=త్వష్ట 15.హి=వసుగణాలు 16.ధి=మరుద్గణాలు 17.యో=చంద్రుడు 18.యో=అంగిరసుడు 19.నః = విశ్వేదేవులు 20.ప్ర=అశ్వినీకుమారులు 21.చో=ప్రజాపతి సహిత సమస్తదేవగణాలు 22.ద=రుద్రుడు 23.యా=బ్రహ్మ 24.త్=విష్ణువు. గాయత్రీ మంత్ర జపం చేసేడప్పుడు ఒక్కసారి పై తెలిపిన అక్షరదేవతల పేర్లని ఉచ్చరిస్తే ఆ దేవతలందరూ ఉపాసకుడి పాపాల్ని తొలగిస్తారు.

**గాయత్రీ మంత్రన్యాసాలు :** గాయత్రీ మంత్రంలోని 24 అక్షరాలతో శరీరం మీద ఉండే 24 అవయవాల మీద న్యాసం చేయాలి.

1.త = రెండు పాదాల బొటనవేళ్ళు 2. త్స = రెండు మడమలు 3.వి = రెండు పిక్కలు 4.తు = రెండు మోకాళ్ళు 5.ర్వ = రెండు తొడలు 6.రే=ఉపస్థ (లింగం) 7.ణ్యం=వృషణాలు 8.భ=కటిభాగం 9.ర్గో = బొడ్డు 10.దే=ఉదరం 11.వ = స్తనభాగం 12.స్య=హృదయం 13.ధీ=కంఠం 14.మ = క్రింది పెదవి 15.హి = తాలువు 16.ధి = నాసిక (ముక్కు) 17.యో = నేత్రాలు 18.యో = కనుబొమల మధ్య 19.నః = లలాటం 20.ప్ర = పైపెదవి 21.చో = దక్షిణభాగం 22.ద = ఉత్తరపార్శ్వం 23.యా= తల 24.త్ = పూర్తిముఖ మండలం

**గాయత్రీ మంత్రాక్షర వర్ణాలు :** గాయత్రీ మంత్రానికి చెప్పిన ఇరవైనాలుగు అక్షరాలకీ వరుసగా ఇరవైనాలుగు వర్ణాలు చెప్పబడ్డాయి. 1.పీత 2.శ్యామ 3.కపిల 4.మరకతమణి 5.అగ్నితుల్య 6.స్వర్ణతుల్య 7.విద్యుత్ప్రభ 8.ధూమ్ర సదృశ 9.కృష్ణ 10.రక్త 11.గౌర 12.ఇంద్రనీల 13.మణిసదృశ 14.స్ఫటిక మణితుల్య 15. రజతతుల్య 16.పాండు 17. పుష్యరాగతుల్య 18.అఖిలద్యుతి 19.హేమాభధూమ్ర 20.రక్తనీల 21.రక్తకృష్ణ 22.సువర్ణాభ 23.శుక్లకృష్ణ 24.పలాశ అనేవి.

**గాయత్రీ హోమం-ఫలితం :** గాయత్రీదేవి మూలమంత్రంతో హోమాన్ని చేస్తే ఫలితాలు త్వరగా లభిస్తాయి. గాయత్రీ హోమం చేసేవారు

ముందుగా గాయత్రీ దేవిని ధ్యానించి యథాశక్తి ఆ దేవి మంత్రాన్ని శ్రద్ధగా జపించాలి.

నువ్వులతో గాయత్రీ హోమాన్ని చేస్తే సకల పాపాలూ నశిస్తాయి. శాంతిని కావాలనుకునేవారు యవలతో, దీర్ఘాయువు కావాలనుకునేవారు నెయ్యితో హోమం చేయాలి. కర్మ సిద్ధికోరుకునేవారు ఆవాలతో అధికంగా ధ్యానసంపద కావాలనుకునేవారు శాలబియ్యంతో హోమం చేయాలి. గ్రహపీడలు వదిలిపోవటానికి ఖదిర వృక్షం సమిధలతో, ధనం కావాలంటే బిల్వ పత్రాలతో, లక్ష్మీ సౌభాగ్యం కోసం ఎర్ర కలువలతో, ఆరోగ్యం కోసం ఉత్పాతాల శాంతికోసం దుర్వా (గరిక)తో, సౌభాగ్యం కోసం గుగ్గిలతో, విద్యకోసం పాయసంతో హోమం చేయాలి.

పదివేల సార్లు గాయత్రీ మంత్రంతో హోమం చేస్తే పై తెలిపిన ఫలితాలన్నీ లభిస్తాయి. ఒక లక్షసార్లు గాయత్రీ హోమం చేస్తే సకల కార్యాలూ సిద్ధిస్తాయి. ఒకకోటి సార్లు హోమం చేసినవాడు బ్రహ్మహత్యాది పాపాలనుంచి విముక్తుడై తన వంశాన్ని ఉద్ధరిస్తాడు. నవగ్రహశాంతి కోసం చేసే హోమాలతో పాటు పదివేల సార్లు గాయత్రీ హవనం చేస్తే మనోభీష్ట సిద్ధి కలుగుతుంది.

## వశిష్ఠుడు చేసిన శివస్తుతి

పూర్వం వశిష్ఠ మహర్షి మంత్రరాజమైన గాయత్రీ మంత్రాన్ని జపించి అందులో భాగంగా నిత్యం పరమేశ్వరుణ్ణి ఈ విధంగా స్తుతించేవాడు. తద్వారా శివుడి అనుగ్రహంతో ఆయన పరబ్రహ్మ తత్త్వాన్ని తెలుసుకుని చివరికి ఆ పరబ్రహ్మను చేరుకున్నాడు.

నమః కనక లిఙ్గాయ వేదలిఙ్గాయ వై నమః ।
నమః పరమలిఙ్గాయ వ్యోమలింగాయ వై నమః ॥ 1

నమః సహస్రలిఙ్గాయ వహ్నిలిఙ్గాయ వై నమః ।
నమః పురాణలిఙ్గాయ శ్రుతిలిఙ్గాయ వై నమః ॥ 2

నమః పాతాళలిఙ్గాయ బ్రహ్మ లిఙ్గాయ వై నమః ।
నమో రహస్య లిఙ్గాయ సప్తద్వీపోర్ధ్వలిఙ్గినే ॥ 3

నమః సర్వాత్మలిఙ్గాయ సర్వలోకాఙ్గలిఙ్గినే ।
నమస్త్వవ్యక్త లిఙ్గాయ బుద్ధిలిఙ్గాయ వైనమః ॥ 4

నమోఽహఙ్కారలిఙ్గాయ భూతలిఙ్గాయ వై నమః ।
నమః ఇంద్రియ లిఙ్గాయ నమస్తన్మాత్రలింగినే ॥ 5

నమః పురుషలిఙ్గాయ భావ లిఙ్గాయ వై నమః ।
నమో రజోర్ధ్వలిఙ్గాయ సత్త్వలిఙ్గాయ వైనమః ॥ 6

నమస్తే భవ లిఙ్గాయ నమస్త్రైగుణ్యలింగినే ।
నమోఽనాగత లిఙ్గాయ తేజోలిఙ్గాయ వై నమః ॥ 7

నమో వాయూర్ధ్వలిఙ్గాయ శ్రుతి లిఙ్గాయ వై నమః ।
నమసే ఽథర్వ లిఙ్గాయ సామలిఙ్గాయ వై నమః ॥ 8

నమోయజ్ఞాఙ్గలిఙ్గాయ యజ్ఞలిఙ్గాయ వై నమః ।
నమస్తే తత్త్వ లిఙ్గాయ దైవానుగతలిఙ్గినే ॥ 9

దిశనః పరమం యోగమపత్యం మత్సమం తథా ।
బ్రహ్మచైవాక్షయం దేవ శమంచైవ పరం విభో ॥
అక్షయం త్వం చ వంశస్య ధర్మే చ మతిమక్షయామ్ ॥ 10

*(శ్లో॥2-11,అధ్యా-217)*

ఎంతో ప్రభావవంతమైన ఈ దివ్యస్తుతిని వశిష్ఠ మహర్షి శ్రీశైల శిఖరం మీద నుంచుని చేయగా, శివుడు కరుణించి ఆయన కోరిన వరాలనిచ్చి అంతర్ధానమయ్యాడు.

## అశుభ శకునాలు

యాత్రకు బయలుదేరేవారికి, లేదా ఏదైనా పనిమీద పొరుగూరికి ప్రయాణమయ్యే వారికి-తెల్లటి వస్త్రాలు, మంచినీళ్ళు, ఫలాలతో నిండిన వృక్షం,

నిర్మలమైన ఆకాశం, పొలంలో పెరిగిన సస్యం, నల్లధాన్యం కనబడటం అశుభ సూచకాలు. అలాగే దూది, పిడకలు, సుత్తిబొగ్గులు, బెల్లం, గుండుకొట్టించుకున్న వాడు, ఇనుము, బురద, చర్మం, వెంట్రుకలు, పిచ్చివాడు, నపుంసకుడు, చండాలుడు, కారాగారాధికారి, గర్భిణీ స్త్రీ, విధవ, తెలకపిండి, మృత్యువు, ఊక, బూడిద, నిప్పులు, ఎముకలు, పగిలిన పాత్రలు–ఇవి కనబడితే అశుభం.

ఎక్కడికి వెళుతున్నావు? ఆగు? వెళ్ళకు? అక్కడికి వెళితే నీకేం లాభం? ఇలాంటి మాటలు ఎవరైనా అంటే అది అశుభసూచకంగా గ్రహించాలి. ఇలాంటి అపశకునాలు కనిపించినప్పుడు సకల శుభకారకుడైన శ్రీహరిని ప్రార్థించాలి. తరువాత తిరిగి బయలుదేరేడప్పుడు రెండో సారికూడా అశుభశకునాలు కనిపిస్తే ఇక ఆ ప్రయాణం ఏమాత్రం శ్రేయస్కరం కాదని గ్రహించి మానుకోవాలి.

## శుభ శకునాలు

ప్రయాణం చేసేడప్పుడు తెల్లటి పూలు కనిపిస్తే శుభప్రదం. అది శుభశకునం. నీటితో నిండిన కుండ కనిపిస్తే లేదా ఎదురొస్తే చాలా మంచిది.

మాంసం, చేపలు, దూరంగా కోలాహలం, ఒంటరి వృద్ధుడు, మేకలు, ఆవులు, గుర్రాలు, ఏనుగులు, దేవతా ప్రతిమలు, మండుతున్న అగ్ని, గరిక, ఆవుపేడ, వేశ్య, బంగారం, వెండి, రత్నాలు, వస, ఆవాలు, పెసలు శుభశకునాలు.

ఆయుధాలతో ఖడ్గం, ఛత్రం, బల్లెరాజ చిహ్నాలు, ఏడ్చేవారు లేని శవం, ఫలాలు, నెయ్యి పెరుగు పాలు, అక్షతలు, అద్దం, తేనె, శంఖం, చెరకు, మంచిమాటలు, భక్తుల గానాలు, వాద్యాలు, మేఘాల గర్జనం, మెరుపులు మెరవటం, మనసు చాలా సంతోషంగా ఉండటం–ఇలాంటివన్నీ అన్ని పనులకీ శుభశకునాలు.

## శ్రీ స్తోత్రం

పూర్వం రాజులందరూ తమ సామ్రాజ్య లక్ష్మిని స్థిరంగా ఉంచుకోవటం కోసం, ఆయురారోగ్య ఐశ్వర్యాలు పెంపొందటం కోసం పూర్వం ఏవిధంగా

ఇంద్రుడు లక్ష్మీదేవిని స్తుతించాడో అదే స్తోత్రాన్ని స్తుతించి లక్ష్మీదేవి అనుగ్రహాన్ని పొందేవారు. వారు చేసిన లక్ష్మీ స్తుతిని ఎవరు చేసినా ఆ దేవి కరుణించి ఐశ్వర్యాల్ని ప్రసాదిస్తుంది.

నమస్తే సర్వలోకానాం జననీ మబ్ధి సంభవామ్ ।
శ్రియమున్నిద్ర పద్మాక్షీం విష్ణువక్షఃస్థలస్థితామ్ ॥ 1

త్వం సిద్ధిస్త్వం స్వధాస్వాహా సుధాత్వం లోకపావని ।
సంధ్యారాత్రిః ప్రభాభూతిర్మేధశ్రద్ధా సరస్వతీ ॥ 2

యజ్ఞవిద్యామహావిద్యా గుహ్య విద్యా చ శోభనే ।
ఆత్మ విద్యా చ దేవి త్వం విముక్తి ఫలదాయినీ ॥ 3

అన్వీక్షికీత్రయీ వార్తా దండనీతిస్త్వమేవచ ।
సౌమ్యాసౌమ్యైర్జరద్రూపైస్త్వయైతద్దేవి పూరితమ్ ॥ 4

కాత్వన్యా త్వామృతేదేవి సర్వయజ్ఞమయంవపుః ।
అధ్యాస్తేదేవదేవస్య యోగిచింత్యం గదాభృతః ॥ 5

త్వయాదేవి పరిత్యక్తం సకలం భువనత్రయమ్ ।
వినష్టప్రాయమభవత్త్వయేదానీం సమేధితమ్ ॥ 6

దారాః పుత్రాస్తథాగారం సుహృద్ధాన్య ధనాదికమ్ ।
భవన్త్యేతన్మహాభాగే నిత్యంత్వద్వీక్షణాన్నృణామ్ ॥ 7

శరీరారోగ్యమైశ్వర్య మరిపక్షక్షయః సుఖమ్ ।
దేవి త్వద్దృష్టి దృష్టానాం పురుషాణాం నదుర్లభమ్ ॥ 8

త్వమంబా సర్వభూతానాం దేవదేవోహరిః పితా ।
త్వయైతద్విష్ణునా చామ్బ జగద్వ్యాప్తం చరాచరమ్ ॥ 9

మానః క్రోశం తథాగోష్టం మాగృహం మాపరిచ్ఛదమ్ ।
మా శరీరం కలత్రంచ త్యజేథాః సర్వపావని ॥ 10

మాపుత్రాన్మా సుహృద్వర్గాన్మా పశూన్మా విభూషణమ్ ।
త్యజేథా మమదేవస్య విష్ణోర్వక్షస్థలాలయే ॥ 11

సత్త్వేన సత్యశౌచాభ్యాం తథాశీలాదిభిర్గుణైః ।
త్యజన్తే తే నరాః సద్యః సన్త్యక్తాయే త్వయామలే ॥ 12

త్వయావలోకితాః సద్యః శీలాద్యైరఖిలైర్గుణైః ।
కులైశ్వర్యైశ్చ యుజ్యన్తే పురుషానిర్గుణా అపి ॥ 13

నశ్లాఘ్యః సగుణీ ధన్యః సకులీనః సబుద్ధిమాన్ ।
సశూరః స చ విక్రాన్తో యస్త్వయాదేవి వీక్షితః ॥ 14

సద్యోవై గుణ్యమాయాంతి శీలాద్యాః సకలాగుణాః ।
పరాఙ్ముఖీ జగద్ధాత్రీ యస్యత్వం విష్ణువల్లభే ॥ 15

నతేవర్ణయితుంశక్తా గుణాఞ్జిహ్వాపి వేదసః ।
ప్రసీదదేవి పద్మాక్షిమాస్మాంస్త్యాక్షీః కదాచన ॥ 16

**పుష్కర ఉవాచ :**

ఏవం స్తుతా దదౌ శ్రీశ్చ వరమింద్రాయ చేప్సితమ్ ।
సుస్థిరత్వేచ రాజ్యస్య సంగ్రామ విజయాదికమ్ ॥ 17

*(శ్లో॥2-18,అధ్యా-237)*

ఐశ్వర్య ప్రదమైన ఈ దివ్యస్తోత్రాన్ని పఠించినవారికి, విన్నవారికి భుక్తిముక్తులు రెండూ లభిస్తాయి. కనుక అందరూ సర్వదా ఈ శ్రీస్తోత్రాన్ని శ్రద్ధగా పఠించాలి.

## శ్రీరాముడు బోధించిన రాజనీతి

ఒకనొక సందర్భంలో శ్రీరాముడు తన సోదరుడైన లక్ష్మణుడికి ఈ విధంగా రాజనీతిని బోధించాడు.

న్యాయంగా ధనాన్ని సంపాదించటం, సంపాదించిన దాన్ని వ్యాపారాలు చేయటం ద్వారా పెంచుకోవటం, అలా సంపాదించిన ధనాన్ని తన వారినుంచి,

పొరుగు వారినుంచి రక్షించుకోవటం, సత్పాత్రులకి, మంచి పనులకి ఆ ధనాన్ని వెచ్చించటం అనేవి రాజులు చేయాల్సిన పనులు.

'నయం' అనే దానికి మూలం 'వినయం'. వినయం అనేది శాస్త్రజ్ఞానం వల్ల మాత్రమే కలుగుతుంది. అసలు వినయం అంటే ఇంద్రియ జయం. అలా ఇంద్రియజయం కలిగినవాడే శాస్త్ర జ్ఞానాన్ని పొందగలడు. బుద్ధి, ధృతి, దక్షత, ప్రగల్భత్వం, ధారణాశక్తి, ఉత్సాహం, ప్రవచన శక్తి, దృఢత్వం, ప్రభుశక్తి, శుచిత్వం, మైత్రి, త్యాగం, సత్యం, కృతజ్ఞత, కులీనత్వం, శీలం, దమం అనే గుణాలన్నీ రాజు సంపదకి కారణాలు.

రాజన్నవాడు కామ, క్రోధ, లోభ, మోహ, హర్ష, మద, మాత్సర్యాలని పూర్తిగా పరిత్యజిస్తేనే సుఖవంతుడౌతాడు. రాజు వినయ గుణ సంపన్నుడై అన్వీక్షకి, వేదత్రయం, వార్త (కృషి, వాణిజ్యం, పశుపాలనం), దండనీతి అనే నాలుగు విద్యల్ని గురించి విద్వాంసుల దగ్గర కూర్చుని చింతన చేయాలి.

అన్వీక్షకి వల్ల ఆత్మజ్ఞానం, వస్తువు యథార్థ స్వరూపం, తెలుస్తుంది. వేదత్రయం తెలుసుకోవటం వల్ల ధర్మాధర్మవిచక్షణ కలుగుతుంది. ఏది అర్థవంతమైనది, ఏది అనర్థమైనది అనే జ్ఞానం వార్త ద్వారా కలుగుతుంది. దండనీతి విచారం వల్ల ఏది న్యాయం ఏది అన్యాయం అనేది తెలుస్తుంది.

రాజు తాను సుఖపడుతూ దీనుల్ని పీడించకూడదు. అలా చేస్తే పీడించబడ్డ జనులందరూ తమ దుఃఖం వల్ల కలిగిన కోపంతో క్రూరుడైన రాజుని చంపేస్తారు. శుభాల్ని కోరుకునే రాజు పూజ్యుల విషయంలో ఎలాంటి ఆదరణ చూపిస్తాడో దీనుల మీద కూడా అలాంటి ఆదరణే చూపించాలి. మంచి స్నేహితుల విషయంలోనే కాదు దుష్టులైన వారి విషయంలో కూడా ప్రియమైన మాటలే పలకాలి. ప్రియంగా పలికే వాడిని 'దేవత' అని పరుషంగా మాట్లాడేవాడిని 'పశువు' అని అంటారు.

రాజు త్రికరణ శుద్ధిగా సకల దేవతల్నీ పూజించాలి. తన కులగురువుల్ని కూడా దేవతలలాగా పూజించాలి. మిత్రుల్ని తనతో సమానులుగా భావిస్తూ

వారిని సత్కరించాలి. సద్భావంతో మిత్రుల్ని, ఆదరంతో బంధువుల్ని, ప్రేమతో స్త్రీలని, దానంతో భృత్యుల్ని అనుకూలం చేసుకోవాలి.

ఇతరుల పనుల్ని నిందించకూడదు. తన వర్ణాశ్రమ ధర్మాల్ని నిరంతరం పాటించాలి. దీనులమీద దయ చూపాలి. అందరితో మధురంగా మాట్లాడాలి. ఇంటికి వచ్చిన మిత్రుల్ని ఆదరించాలి. యథాశక్తి వారికి ధనసాయం చేయాలి. ఇతరులు చెప్పే కఠోరమైన వాక్యాలని సహించాలి. తనకి అధికంగా సంపదలు కలిగినప్పుడు ఎక్కువ పొంగిపోకుండా సంయమనంతో ఉండాలి. అలాగే ఇతరులకి అభ్యుదయం కలిగినప్పుడు ఈర్ష్య పడకూడదు. ఎప్పుడూ ఇతరులకి బాధ కలిగించే మాటలు పలుకకూడదు. లక్ష్మణా! ఈ ధర్మాల్ని ఆచరించిన వాడే ఉత్తమ ప్రభువుగా కీర్తించబడతాడు.

## రత్న పరీక్ష

ప్రపంచంలో ఎన్నో రకాల రత్నాలున్నాయి. అయితే మహారాజులు ధరించే రత్నాలు కొన్ని ప్రత్యేకంగా ఉంటాయి. అవి – వజ్రం, మరకతం, పద్మరాగం, ముత్యం, మహానీలం, ఇంద్రనీలం, వైఢూర్యం, గంధసస్యం, చంద్రకాంత, సూర్యకాంత, స్ఫటికం, పులక, కర్కేతన, పుష్పరాగం, జ్యోతీరసం, రాజపట్ట, రాజమయ, శుభసౌగంధిక, గంజ, శంఖ, బ్రహ్మమయ, గోవేద రుధిరాక్ష, భల్లాతక, ధూలీ, మరకత, తుష్యక, సీస, పీలు, ప్రవాళ, గిరివజ్ర, భుజంగమణి, వజ్రమణి, టిట్టిభ, భ్రామర, ఉత్పల అనేవి.

ఈ రత్నాలని సాధారణ ప్రజలు కూడా జ్యోతిషుల సలహాలననుసరించి ధరించవచ్చు. అయితే మధ్యకాంతి కలిగినవి, నిర్మలమైనవి,మంచి ఆకారంతో ఉన్నవి అయిన ముత్యాల్ని మాత్రమే ధరించాలి. కాంతిలేనివి, మలినంగా కనపడేవి, ముక్కలైనవి, బీటలు వారినవి అయిన రత్నాల్ని ఎప్పుడూ ధరించకూడదు.

రత్నాలన్నిటిలోకి ఎంతో గొప్పది వజ్రం. దాన్ని ధరించటం ఉత్తమం. నీళ్ళలో తేలేది, పగల కొట్టలేనిది, ఆరు కోణాలతో, ఇంద్రధనస్సు లాగా

నిర్మలంగా ప్రకాశించేది, తేలికగా ఉండేది, సూర్యుడికాంతితో ప్రకాశించేది లేదా చిలుక రెక్కల్లాంటి రంగుతో ఉండేది అయిన వజ్రం శ్రేయస్కరం. ఇక మరకతం (పచ్చ) అయితే బంగారు రజనుతో సమానమైన సూక్ష్మ బిందువులతో ఉన్న దాన్ని ధరించాలి. స్ఫటికం కూడా బాగా స్వచ్ఛంగా వున్న దాన్నే ధరించాలి.

మణుల్లో పద్మరాగం విలువైనది. అది అరుణ వర్ణంతో ఉంటే చాలా మంచిది. ముత్యాలు సముద్రంలో ఉండే ముత్యపుచిప్పల్లో పుడతాయి. అయితే వాటికన్నా శంఖంనుంచి పుట్టిన ముత్యాలు శ్రేష్ఠమైనవి. వీటిలో పాటూ ఏనుగుదంతాల నుంచి, ఏనుగు కుంభస్థలం నుంచి, పంది, చేప, వెదురుల నుంచి, మేఘాల నుంచి పుట్టిన ముత్యాలు ఎంతో శుభప్రదమైనవి. ముత్యాలలో వృత్తత్త్వం (గుండ్రంగా ఉండటం) తెల్లదనం, స్వచ్ఛంగా ఉండటం, మహత్వం అనే గుణాలుంటాయి. రత్నాలలో ఇంద్రనీలమణి చాలా ప్రత్యేకమైనది. అసలైన ఇంద్రనీలాన్ని పాలలో ఉంచితే ఆ పాలన్నీ ఇంద్రనీల కాంతితో ప్రకాశిస్తాయి. ఎర్రని కాంతితో మెరిసే వైఢూర్యం మాత్రమే ధరించేవాడికి పనికివస్తుంది. దీన్ని హారంలో కూర్చి ధరిస్తే ఉత్తమం. అసలు ఏ రత్నమైనా తన కాంతితో అంతా ప్రకాశవంతం చేస్తేనే అది ఉత్తమజాతి రత్నం అని గ్రహించాలి.

## శ్రీహరి పూజా పుష్పాలు

మాలతి, మల్లికా, గిరిమల్లిక, గులాబి, కనేరం, పాపంతి, అతిముక్తం, కర్ణికారం, కురంటకం, తగరం, నీపం, బాణం, యూధికం, అశోకం, తిలకం, కుందం, తమాలం, కేతకీపత్ర పుష్పం, పద్మాలు, ఎర్రకలువలు, శ్రీహరి పూజకు శ్రేష్ఠమైన పుష్పాలు.

ఈ పుష్పాలతో పాటు బిల్వపత్రం, శమీ(జమ్మి) పత్రం, భృంగరాజ (గుంటగలగర)పత్రం, తులసి, కృష్ణ తులసి, వాసకపత్రం అనేవి కూడా శ్రీహరి పూజకు వినియోగించవచ్చు.

ఇక జిల్లేడు, ధుత్తూరం, గురివెంత, పర్వత, కుటజం, శాల్మలి, కటోర అనే పుష్పాలు హరిపూజకి పనికిరావు. ఈ పూలతో పూజించి శ్రీహరి ప్రతిమకి

ఒక ప్రస్థం (నాలుగుశౌర్లు)నెయ్యితో అభిషేకం చేస్తే కోటి గోవుల్ని దానం చేసిన ఫలం లభిస్తుంది. ఒక అఢకం నెయ్యితో అభిషేకం చేసినవాడు రాజపదవి పొందుతాడు. అలాగే నెయ్యి పాలు కలిపి శ్రీహరిని అభిషేకిస్తే స్వర్గ ప్రాప్తి కలుగుతుంది.

## వేద పారాయణ పద్ధతి

**గాయత్రీ మంత్ర జపం :** వేదమాత గాయత్రీదేవి. కనుక వేదాన్ని అభ్యసించినవారు విధిగా గాయత్రీ మంత్రాన్ని ఉపాసించాలి. నీళ్ళలో నిలబడికానీ, హోమం జరుగుతున్నప్పుడు కానీ గాయత్రీ జపం చేసేవాడికి సకల మనోవాంఛితాలు నెరవేరుతాయి. అదే గాయత్రీ మంత్రాన్ని ప్రాణాయామ పూర్వకంగా చేస్తే మరింత విశేష ఫలితం లభిస్తుంది. కేవలం రాత్రిపూట మాత్రమే ఆహారం స్వీకరిస్తూ, స్నానంచేసి పదివేల సార్లు గాయత్రీ మంత్రజపం చేసినవాడి పాపాలన్నీ నశిస్తాయి. అదేవిధంగా హవిస్సుని మాత్రమే భుజిస్తూ 1 లక్షసార్లు గాయత్రీ జపం చేసిన వాడికి ముక్తి లభిస్తుంది.

**ఓంకార జపం :** ప్రణవం అనగా ఓంకారం. ఓంకారం అనేది పరబ్రహ్మ స్వరూపం. బొడ్డులోతు నీళ్ళలో నిలబడి ఓంకారాన్ని వందసార్లు జపించి అభిమంత్రించిన నీళ్ళని తాగినవాడు మోక్షాన్ని పొందుతాడు.

ప్రణవోహిపరం బ్రహ్మ తజ్జపః సర్వపాపహా ।
ఓంకారం శతజప్త్వంతు నాభిమాత్రోదక స్థితః ॥
జలంపిబేత్స సర్వైస్తు పాపై ర్వైవి ప్రముచ్యతే ।
మాత్రాత్రయం త్రయోవేదాస్త్రయోదేవాస్త్రయోఽగ్నయః ॥
మహావ్యాహృతయః సప్తలోకా హోమోఽఖిలావహా ।
గాయత్రీ పరమాజప్యా మహావ్యాహృతయస్తథా ॥

*(శ్లో॥5-7,అధ్యా-259)*

ఓంకారంలో ఉన్న 'అ' 'ఉ' 'మ్' అనే మూడు మాత్రలు మూడు వేదాలు. ముగ్గురు దేవతలు, మూడు అగ్నులు. ఆ మంత్రంలో ఉన్న భూః అనే

మహావ్యాహృతులే ఏడులోకాలు. వీటన్నిటితో కలిసిన గాయత్రీ మహామంత్రాన్ని ఉచ్చరిస్తూ హోమం చేస్తే అది సకల శుభఫలితాలనిస్తుంది.

## ఋగ్వేద పారాయణ ఫలం

నీళ్ళలో మునిగి అఘమర్షణ మంత్రాన్ని జపిస్తే సకల పాపాలు హరిస్తాయి. వేదాల్లో మొదటిదైన ఋగ్వేద ఋక్కుల్ని పారాయణ చేస్తే అనంతమైన ఫలాలు లభిస్తాయి.

1. **అగ్నిమీళే పురోహితం (ఋ-1-1-1) :** అనే సూక్తాన్ని జపిస్తూ హోమం త్రికాల స్నానం ఆచరించాలి. ఆ విధంగా చేస్తూ కేవలం భిక్షాన్నాన్ని మాత్రమే స్వీకరించాలి. ఈ ఋక్కుకి తరువాత ఉన్న వాయవ్యాది దేవ సూక్తాలు ఏడిటిని నిత్యం నియమపూర్వకంగా జపించాలి. ఇలా చేసినవాడు మనోవాంఛిత ఫలాలు పొందుతాడు.
2. **సదస్పతి (ఋ1-18-16) :** అనే ఋక్కులు మూడుంటాయి. వీటిని ప్రతిరోజూ జపించేవాడికి మేధస్సు పెరుగుతుంది.
3. **అంబయోయంత్సధ్యభి (ఋ-1-23-18) :** ఇవి మొత్తం తొమ్మిది ఋక్కులు. వీటిని పారాయణ చేస్తే అకాల మృత్యువు తొలగిపోతుంది.
4. **శునశ్శేపోయ (ఋ-1-24-12) :** ఇత్యాది మూడు ఋక్కుల్ని జపించిన వాడు సకల పాపాల నుంచి విముక్తి పొందుతాడు. అలాగే రోగాలతో బాధపడేవాడికి రోగవిముక్తి కలుగుతుంది.
5. **ఏతేపంథాః (ఋ-1-35-11) :** అనే మంత్రాన్ని పారాయణ చేసినవాడు క్షేమంగా ప్రయాణించగలుగుతాడు.
6. **ఉద్వయంతమసః (1-50-10) :** అనే ఋక్కుల్ని పారాయణ చేస్తూ ప్రతిరోజూ సూర్యోపస్థానాన్ని చెప్పేవాడు, సూర్యుడికి ఏడుతర్పణాలు సమర్పించేవాడు మానసిక దుఃఖాల నుంచి విముక్తి పొందుతాడు.

**7. పురీష్యాసోఽగ్నయం: (3-22-4) :** అనే ఋక్కుని జపిస్తే ఆరోగ్యలాభం కలుగుతుంది. ఇది శత్రుబాధల్ని కూడా నివారిస్తుంది. ఈ ఋక్కుని సూర్యోదయ సమయంలో జపిస్తే దీర్ఘాయువు, మధ్యాహ్న కాలంలో జపిస్తే తేజస్సు, సూర్యాస్తమయకాలంలో జపం చేస్తే శత్రువినాశనం కలుగుతాయి.

**8. త్వంసోమ (9-86-24) :** అనే ఋక్కుని పారాయణ చేస్తూ శుక్లపక్ష తదియనాడు చంద్రుణ్ణి దర్శించాలి. ఈవిధంగా చేయటం వల్ల నిస్సందేహంగా ఉన్నతమైన వస్త్రాభరణాల్ని పొందుతాడు.

**9. ఆపనః శోశుచమం (1-97-1) :** అనే ఋక్కుతో సూర్యుణ్ణి స్తుతించిన వాడికి పాపలన్నీ నశిస్తాయి.

**10. జాతవేదసే (1-19-1) :** అనే ఋక్కుని యాత్రా సమయంలో పారాయణ చేస్తే యాత్ర సుఖవంతంగా కొనసాగుతుంది.

**11. ప్రమందినే (1-101-1) :** అనే ఋక్కుని జపించటం వల్ల స్త్రీలకి సుఖప్రసవ మవుతుంది.

**12. చిత్రందేవానాం (1-115-1) :** ఇత్యాది ఋగ్వేదమంత్రాలతో సూర్యోపస్థానం చేసేవాడు మనోవాంఛిత ధనాన్ని పొందుతాడు.

**13. స్వప్నేనాభ్యుష్యా (2-15-9) :** అనే ఋక్కుని ఉదయం, మధ్యాహ్నం, సంధ్యాకాలాలలో జపిస్తే దుఃస్వప్నాలు తొలగిపోతాయి. మంచి ఆహారం లభిస్తుంది.

**14. కయశుభాసవయసః (1-165-1) :** అనే ఋక్కుని జపించేవాడు తన వంశంవారందరిలోకీ ఉత్తముడిగా కీర్తి ప్రతిష్ఠలు పొందుతాడు.

**15. అగ్నేనయ సుపథా (1-189-1) :** అనే ఋక్కులతో కూడిన సూక్తాన్ని పఠిస్తూ నెయ్యితో హోమాన్ని ఆచరించిన వాడికి ఉత్తమగతులు కలుగుతాయి.

## యజుర్వేద పారాయణ ఫలం

వేదాల్లో రెండవది యజుర్వేదం. ఈ వేదం అంతా యజ్ఞయాగాది కర్మ కాండల్ని గురించి వివరిస్తుంది. ఈ యజుర్వేదానికి సంబంధించిన మహావ్యాహృతుల మంత్రాల్ని ఓంకార పూర్వకంగా వందసార్లు హోమం చేస్తే సకల కోరికలూ తీరుతాయి.

### హోమ సమిధలు

మనసః కాంక్షితం రామ మనసేప్సిత కామదమ్ ।
శాంతికామో యవైః కుర్యాత్తిలైః పాపాపనుత్తయే ॥ 1

దానైః సిద్ధార్థకైశ్చైవ సర్వకామకరైస్తథా ।
ఔదుంబరీభిరిద్యాభిః పశుకామస్య శస్యతే ॥ 2

దధ్నా చైవాన్న కామస్య పయసా శాన్తిమిచ్ఛతః ।
అపామార్గ సమిద్భిస్తు కామయన్కనకం బహు ॥ 3

కన్యాకామో ఘృతాక్తాని యుగ్మశోగ్రధితానితు ।
జాతీ పుష్పాణి జుహుయాద్గ్రామార్థీతిలతండులాన్ ॥ 4

వశ్యకర్మణి శాఖోట వాసాపా మార్గమేవచ ।
విషాసృజ్ మిశ్ర సమిధో వ్యాధిఘాతస్య భార్గవ ॥ 5

కుద్ధస్తు జుహుయాత్సమ్యక్ఛత్రూణాం వధకామ్యయా ।
సర్వవ్రీహిమయీం కృత్వా రాజ్ఞః ప్రతికృతింద్విజః ॥ 6

సహస్రశస్తు జుహుయాద్రాజావశగతో భవేత్ ।
వస్త్రకామస్య పుష్పాణి దూర్వావ్యాధివినాశినీ ॥ 7

బ్రహ్మవర్చస కామస్య వాసోగ్రంచ విధీయతే ।
ప్రత్యంగిరేషు జుహుయాత్తుష కంటకభస్మభిః ॥ 8

విద్వేషణే చ పక్ష్మాణి కాక కౌశికయోస్తథా ।
కాపిలంచ ఘృతం హుత్వా తథా చంద్రగ్రహేద్విజః ॥ 9

వచాచూర్ణేన సంపాతాత్స మానీయచతాం వచామ్ ।
సహస్రమంత్రితాం భుక్త్వా మేధావీ జాయతేనరః ॥ 10

ఏకాదశాంగులం శంకుం లౌహం ఖాదిరమేవచ ।
ద్విషతోవధోఽసీతి జపన్నిఖనేద్రి పువేశ్మని ॥ 11

ఉచ్చాటన మిదం కర్మ శత్రూణాం కథితం తవ ।
చక్షుష్యా ఇతి జప్త్వాచ వినష్టం చక్షురాప్నుయాత్ ॥ 12

ఉపయుంజత ఇత్యేతదనువాకం తథాన్నదమ్ ।
తనూనపాగ్నే సదితి దూర్వాహుత్వార్తివర్జిత ॥ 13

భేషజమసీతి దద్యాజ్యైర్హోమః పశూపసర్గనుత్ ।
త్రియంబకం యజామహే హోమః సౌభాగ్యవర్ధనః ॥ 14

కన్యానామ గృహీత్వాతు కన్యాలాభకరః పరః ।
భయేషుతు జపన్నిత్యం భయేభ్యో విప్రముచ్యతే ॥ 15

ధస్తూ (త్తూ) ర పుష్పం సఘృతం హుత్వా స్యాత్సర్వ కామభాక్ ।
హుత్వాతు గుగ్గులం రామ స్వప్నే పశ్యతి శంకరమ్ ॥ 16

*(శ్లో॥1-16,అధ్యా-260)*

★ శాంతిని కోరుకునేవారు యవలతో ★ పాపాలు పోగొట్టు కోవాలనుకునేవారు నువ్వులతో హోమం చేయాలి. ★ ధ్యానంతో, తెల్లావాలతో హోమం చేస్తే సకల కోరికలూ తీరతాయి ★ పశువులు కావాలనుకునేవాడు ఔదుంబర (మేడి) సమిధలతో హోమం చేయాలి. ★ అన్నం కావాలనుకునేవాడు పెరుగుతో, శాంతికోరుకునేవాడు పాలతో, బంగారం వాంఛించేవాడు అపామార్గ (ఉత్తరేణి) సమిధలతో హోమం చేయాలి.

ఉత్తమమైన కన్య భార్యగా రావాలని కోరుకునేవాడు రెండు రెండు జాతి పుష్పాల్ని కలిపి నేతితో తడిపి హోమం చేయాలి. ★ కామశక్తి పొందాలను కునేవాడు నువ్వులు బియ్యం కలిపి తిలతండుల హోమాన్ని నిర్వర్తించాలి. అదేవిధంగా వశీకరణ శక్తి కోరుకునేవాడు శాకోట-వస-అపామార్గ సమిధలతో హోమం చేయాలి.

రోగాలు నశించటానికి విషరక్తంతో తడిపిన సమిధలతో హోమం చేయాలి. శత్రువుల్ని వధించాలని కోరుకునేవాడు కూడా పైవిధంగా హోమం చేయాలి. అయితే ఆ హోమాన్ని క్రోధంతో చేస్తేనే శత్రునాశనం జరుగుతుంది. రాజు వశం కావాలంటే అన్ని రకాల ధాన్యాలతో ఒక రాజు ప్రతిమని నిర్మించి ఆ ప్రతిమని వెయ్యిసార్లు హోమం చేయాలి. వస్త్రాలు కావాలనుకునేవాడు పూలతో హోమం చేయాలి. గరికతో హోమం చేస్తే వ్యాధులు దూరమవుతాయి.

బ్రహ్మ తేజస్సు కావాలని కోరుకునేవారు మంచి వస్త్రాలతో హోమం చేయాలి. విద్వేషణ జరగాలంటే ప్రత్యంగిరా పద్ధతిలో స్థాపించిన అగ్నిలో-పాలు, ముల్లు, బూడిద, కాకి ఈకలు, గుడ్లగూబ ఈకలు ఉపయోగించి హోమం చేయాలి. చంద్రగ్రహణం వచ్చిన సమయంలో కపిల ధేనువు నెయ్యితో హోమాన్ని చేసి, ఆ మిగిలిన నెయ్యిలో వస చూర్ణాన్ని కలిపి, 'సంపాతం' అనే అగ్నికి ఆహుతిగా ఇచ్చి, మిగిలిన 'వస' ని చేతిలోకి తీసుకుని, వెయ్యిసార్లు గాయత్రీ మంత్రంతో అభిమంత్రించి ఆ 'వస' చూర్ణాన్ని తినాలి. ఆ విధంగా చేసిన వాడికి అద్భుతమైన మేధాశక్తి లభిస్తుంది.

**యజుర్వేద మంత్రాలు-ఫలితాలు :-**

1. **చక్షుష్యా (2.16) :** అనే మంత్రాన్ని జపించటం వల్ల పోయిన చూపు తిరిగి వస్తుంది.
2. **తనూనపాగ్నే౽ సి (3-17) :** అనే మంత్రాన్ని పఠిస్తూ గరికతో హోమం చేస్తే అన్ని రకాల కష్టాలూ దూరమవుతాయి.
3. **భాషజమసి (3-59) :** ఇత్యాది మంత్రాలు పఠిస్తూ, పెరుగు, నెయ్యి - వీటితో హోమం చేస్తే పశువులకి వచ్చే మహామారి లాంటి రోగాలన్నీ తొలగిపోతాయి.
4. **త్ర్యంబకం యజామహే (3-60) :** అనే మంత్రాన్ని పఠించి హోమం చేస్తే ఆరోగ్యం సౌభాగ్యం వృద్ధిచెందుతాయి. ఈ మంత్రాన్నే పఠిస్తూ నెయ్యి కలిపిన దుత్తూర పుష్పాలతో హోమం చేస్తే సకల కామ్యాలు తీరతాయి.

ఇదే మంత్రంతో గుగ్గులు ఉపయోగించి హోమం చేస్తే వాడికి స్వప్నంలో శంకరుడు దర్శనమిస్తాడు.

**5. యుంజంతేమనః (3-59) :** అనే అనువాకాన్ని జపించిన వాడికి దీర్ఘాయుర్దాయం లభిస్తుంది.

**6. అయం నో అగ్నిః (5-37) :** ఇత్యాది మంత్రాల్ని శ్రద్ధగా పఠిస్తే యుద్ధంలో విజయం లభిస్తుంది.

**7. ఇదమాపః ప్రవహత (6-17) :** అనే మంత్రాన్ని పఠిస్తూ స్నానం చేస్తే పాపాలు నశిస్తాయి.

**8. దేవసవితః (11-7) :** అనే మంత్రంతో హోమం చేసిన వాడికి అన్నానికి లోటుండదు.

**9. మధువాలూ (13-17) :** ఇత్యాది మంత్రాలతో హోమం చేసినవాడికి సకల కార్యాలూ నెరవేరతాయి.

**10. దధిక్రావ్ణో (23-32) :** అనే మంత్రంతో హోమంచేసిన గృహస్థుడు నిస్సందేహంగా పుత్రసంతానాన్ని పొందుతాడు.

**11. ఘృతవతీ భువనా (34-45) :** అనే మంత్రాన్ని పఠిస్తూ నేతితో హోమం చేసినట్లైతే ఆయుర్వృద్ధి కలుగుతుంది.

**12. స్వస్తినః ఇంద్రః (25-19) :** అనే మంత్రాన్ని శ్రద్ధగా జపిస్తే సకల బాధలూ తొలగిపోతాయి.

**13. రుద్రయత్తే (10-20) :** అనే మంత్రాన్ని పఠిస్తూ, పలాశ సమిధలతో హోమం చేస్తే సువర్ణం లభిస్తుంది.

**14. శివోభవ (11-45) :** అనే మంత్రాన్ని పఠిస్తూ, 'వ్రీహి' తో హోమం చేస్తే అగ్ని ప్రమాదాలు జరుగవు.

**15. ద్రుపదాదివ (20-20) :** అనే మంత్రాన్ని మూడుసార్లు వరుసగా పఠిస్తే చాలు వాడు సకల పాపాలనుంచీ విముక్తి పొందుతాడు.

## సామవేద పారాయణ ఫలం

సంహితాం వైష్ణవీం జప్త్వాహుత్వాస్యాత్సర్వ కామభాక్ ।
సంహితాం ఛాందసీం సాధుజప్త్వా ప్రీణాతిశంకరమ్ ॥
స్కాందీం పైత్ర్యాం సంహితాం చ జప్త్వాస్యాత్తు ప్రసానవాన్ ॥

*(శ్లో॥1-3,అధ్యా-261)*

సామవేదంలో చెప్పబడ్డ వైష్ణవీ సంహితని జపించి, ఆ తరువాత ఆ జపంలో దశాంశం హోమం చేసినవాడు సకల కామ్యాలనీ సిద్ధింప చేసుకుంటాడు. అదేవిధంగా 'ఛాందసీ సంహితని" యథావిధిగా జపం చేస్తే శంకరుడి దివ్యానుగ్రహం లభిస్తుంది. స్కంద సహితని జపించినవాడికి ప్రసన్నత కలుగుతుంది.

1. **యత ఇంద్ర భజామహే (1321) :** ఈ మంత్రాన్ని జపించటం వల్ల హింసాదోషం నశిస్తుంది.
2. **అగ్నిస్తిగ్మేన (22) :** అనే మంత్రాన్ని జపించిన వారికి అపకీర్తి తొలగిపోతుంది.
3. **పరితోసించ తాసుతం (512) :** అనే సామాన్ని గానం చేయటం వల్ల సమస్త పాపాలూ నశిస్తాయి.
4. **అద్యానోదేవ సవితః (141) :** అనే మంత్రాన్ని జపిస్తే దుః స్వప్నాలు బాధించవు
5. **అబోధ్యగ్నిః (1746) :** అనే మంత్రాన్ని పఠిస్తూ నేతితో హోమాన్ని చేయాలి. తరువాత మిగిలిన నేతితో మేఖల బంధం (దర్భలతో తయారుచేసిన వడ్డాణం) తడిపి దాన్ని గర్భస్రావాలతో బాధపడే స్త్రీకి కట్టాలి. అలా చేసినట్లైతే గర్భస్రావ దోషం తొలగిపోతుంది.
6. **మాపాపత్వాయనో (918) :** అనే మంత్రాన్ని పఠిస్తూ వందసార్లు హోమం చేస్తే శతృభయం ఉండదు. ఈ హోమం చేసిన తరువాత 'శతావరీ' మూలికని కట్టుకోవాలి. అలాగే 'దీర్ఘమసో౽ర్కః' అనే మంత్రంతో హోమం చేస్తే అన్న సమృద్ధి కలుగుతుంది.

7. **త్వమిమాఓషధీః (604) :** అనే మంత్రాన్ని జపించినవాడికి ఎలాంటి వ్యాధులూ రావు. అలాగే 'సమన్వాయంతః' అనే మంత్రాన్ని పఠించినవాడు దాహంతో మరణించడు.

8. **యదింద్రోఽనునయత్ (148) :** అనే మంత్రాన్ని పఠిస్తూ హోమం చేస్తే సకల సౌభాగ్యాలూ కలుగుతాయి. అదేవిధంగా 'ఇంద్ర' శబ్దంతో ప్రారంభమయ్యే మంత్రవర్గాన్ని జపించినవారికి కూడా సౌభాగ్యవృద్ధి కలుగుతుంది.

9. **ఇంద్రమిద్గాథినో (198) :** అనే మంత్రాన్ని జపించి నెయ్యి కలిపిన 'వస' చూర్ణాన్ని ప్రతిరోజూ చిన్నపిల్లలకి తినిపిస్తే వారికి అసాధారణమైన జ్ఞాపకశక్తి కలుగుతుంది. 'రథంతర' అనే సామాన్ని పఠించి హోమం చేసిన వారికి నిస్సందేహంగా పుత్ర సంతానం కలుగుతుంది.

10. **మయిశ్రీః (602) :** అనే మంత్రాన్ని అలాగే 'వైరూప్యాష్టకాన్ని' ప్రతిరోజు పఠించేవారికి లక్ష్మీ అనుగ్రహం కలుగుతుంది.

11. **గవ్యేషు నోయధా(186) :** అనే మంత్రాన్ని ప్రతిరోజూ ఉదయం సాయంత్రం పఠించేవారికి గోసమృద్ధి కలుగుతుంది.

12. **పదైవోదాసో(51) :** అనే మంత్రాన్ని పఠిస్తూ తిలలతో హోమం చేస్తే ఇతరులు చేసిన అభిచార ప్రయోగాలు నశిస్తాయి.

13. **అభిత్వాశూరనోనమో (232) :** అనే సామానికి 'వషట్' అనే పదాన్ని చివరచేర్చి ఆవనూనెతో తడిపిన సమిధలతో హోమం చేసినట్లైతే యుద్ధంలో విజయం లభిస్తుంది. అయితే ఈ హోమాన్ని శత్రువుపై చాలా కోపంతో చెయ్యాలి.

సామవేదంలో చెప్పబడ్డ గారుడ మంత్రం వామదేవ్య మంత్రం, రథంతర, బృహద్రసమంత్రాలన్నీ నిస్సందేహంగా సకల పాపాల్నీ తొలగిస్తాయి.

## అధర్వవేద పారాయణ ఫలం

వేదాలలో చివరిది అధర్వవేదం. ఈ వేదంలో ఎన్నో రకాల మంత్రాలు కామ్యసిద్ధి కలిగేవిగా చెప్పబడ్డాయి. అధర్వవేదంలో చెప్పిన 'శాంతాతీయ' గణాల్ని ఉచ్చరిస్తూ హోమం చేస్తే శాంతిలభిస్తుంది. 'బహషజ్య' గణాల్ని ఉద్దేశించి హోమం చేస్తే సమస్త రోగాలూ తొలగిపోతాయి. అలాగే 'ఆసప్తీయ' గణాల్ని ఉద్దేశించి హోమం చేసిన వాడికి పాపాలు నశిస్తాయి. 'అభయ' గణాన్ని ఉద్దేశించి హోమం చేస్తే భయం అనేదే కలగదు. 'అపరాజితా' గణాల్ని ప్రార్థిస్తూ హోమం చేసిన వాడికి ఏవిషయంలో అపజయమే ఉండదు.

ఆయుష్య గణాల్ని ఉద్దేశించి హోమం చేసినవాడికి అపమృత్యు బాధలుండవు. 'సస్త్ర్యయన' గణాలకి హోమం చేస్తే సకల శుభమంగళాలు కలుగుతాయి. 'శర్వవర్మ' గణాలనుద్దేశించి హోమం చేసిన వాడికి కీర్తిప్రతిష్ఠలు లభిస్తాయి. 'వాస్తోష్పత్య' గణాల గురించి హోమం చేస్తే సకలవాస్తు దోషాలూ తొలగిపోతాయి. అదేవిధంగా రౌద్ర గణాల గురించి హోమం చేస్తే వివిధరకాల దోషాలు నశిస్తాయి.

1.వైష్ణవీ 2.ఘోందీ 3.బ్రహ్మీ 4.రౌద్రీ 5.వాయవ్య 6.వారుణీ 7.కౌబేరీ 8.భార్గవీ 9.ప్రాజాపత్య 10. త్వాష్ట్రీ 11.కౌమారీ 12.ఆగ్నేయీ 13.మారుద్గణీ 14.గాంధర్వీ 15.నైర్రుతికీ 16.ఆంగీరసీ 17.యామ్యా అనే ఈ పదిహేడు గణాలు శాంతినిచ్చేవి. వీటినుద్దేశించి హోమం చేస్తే సకల శాంతులు కలుగుతాయి. అన్ని రకాల కోరికలూ తీరుతాయి.

1. **యస్త్వావం మృత్యుం :** అనేమంత్రాన్ని జపిస్తే అపమృత్యు దోషం తొలగిపోతుంది.
2. **సుపర్ణస్త్వా (4-63) :** అనే మంత్రంతో హోమం చేసిన వాడికి సర్పబాధ ఉండదు.
3. **ఇంద్రేణదత్తో (2-2-94) :** అనే మంత్రం జపించి హోమం చేస్తే సకల కామ్యాలూ సిద్ధిస్తాయి. అలాగే 'ఇంద్రేనాదత్తం' అనే మంత్రంతో హోమం చేస్తే సమస్త బాధలూ తొలగిపోతాయి.

**4. ఇమాయాదేవి (2-10-4) :** అనే మంత్రంతో చేసే హోమం సర్వశాంతికరం. అదేవిధంగా 'దేవామరుతః' అనే మంత్రంతో చేసే హోమం సకల కామప్రదం.

**5. యమస్యలోకాత్ (19-56-1):** అనే మంత్రం జపించే హోమం చేస్తే దుఃస్వప్నాలు రావు. "ఇంద్రశ్చపంచవణిజః" అనే మంత్రంతో హోమం చేస్తే వర్తక, వ్యాపారాలు అభివృద్ధి చెందుతాయి. అదేవిధంగా 'కామోమేవాజి" అనే మంత్రంతో చేసే హోమం స్త్రీలకి సౌభాగ్యవృద్ధిని కలిగిస్తుంది.

**7. తుభ్యమేవ జవీమన్ (2-28-1):** అనే మంత్రాన్ని వెయ్యిసార్లు జపించి, దశాంశం అనగా వందసార్లు అదేమంత్రంతో హోమం చేయాలి. తరువాత 'అగ్నిగోభిర్నః' అనే మంత్రంతో చేసే హోమం సౌభాగ్యవృద్ధి కరంగా పనిచేస్తుంది.

**8. అతుంతేయోసిః (3-20-1):** అనే మంత్రాన్ని పఠించి హోమం చేయటం వల్ల పుత్ర సంతానం కలుగుతుంది. అదే విధంగా 'శివశ్శివాభిః' అనే మంత్రం సౌభాగ్యవృద్ధికరం.

**9. బృహస్పతిర్నః పరిపాతు (7-51-1):** అనే మంత్రాన్ని జపించటం వల్ల ప్రమాణాలలో క్షేమం కలుగుతుంది. 'ముంచమిత్వా' అనే మంత్రాన్ని పఠిస్తే అపమృత్యు నివారణమవుతుంది.

అధర్వణ శీర్షాన్ని పఠించేవారు సమస్త పాపాలనుంచీ విముక్తులౌతారు.

అధర్వవేదమంత్రాల్ని ఉపయోగిస్తూ చేసే హోమాలలో ముఖ్యంగా - హవిస్సు, నెయ్యి, ధాన్యం, తెల్ల ఆవాలు, అక్షతలు, నువ్వులు, పెరుగు, పాలు, దర్భలు, గరిక, బిల్వపత్రాలు అనేవి ఉపయోగించాలి. ఇవన్నీ శాంతి, పుష్టికరాలు.

నూనెలు, కణాలు, రాజికలు, విషం, ముళ్ళతో ఉన్న సమిధలు - వీటిని అభిచార కర్మల్లో వినియోగించాలి. ఈ హోమాలు చేసేవారు ఆయా మంత్రాల ఋషి, దేవతా, ఛందస్సు, వినియోగాల్ని తెలుసుకుని మాత్రమే హోమాలు ఆచరించాలి.

## లక్ష్మీవర్ధక సూక్తాలు

మానవులకి లక్ష్మీప్రాప్తిని కలిగించే శ్రీసూక్తాలు నాలుగువేదాల్లో ఉన్నాయి. ఋగ్వేదంలో "హిరణ్యవర్ణాం" అని మొదలయ్యే పదిహేను ఋక్కులు ఋగ్వేదీయ శ్రీసూక్తంగా ప్రసిద్ధి పొందగా 1.రథే (29–43) 2.అక్షరాజాయ (30–18) 3.వాజః (18–34) 4.చతస్రః (18–32) అనే నాలుగు మంత్రాలూ యజుర్వేదీయ శ్రీసూక్తంగా ప్రసిద్ధి చెందాయి. అలాగే 'శ్రావంతీయసామ' అనేది సామవేదానికి చెందిన శ్రీసూక్తంగా "శ్రియంధాతర్మయి దేహి" అనే మంత్రం అధర్వవేదీయ శ్రీసూక్తంగా విఖ్యాతి చెందాయి.

## ఋగ్వేదీయ శ్రీసూక్తం

ఓమ్॥ హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణ రజత స్రజామ్ ।
చన్ద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ ॥

తాం మ ఆవహ జాతవేదో ల క్ష్మీ క్ష్మీ మనపగామినీమ్ ।
యస్యాం హిరణ్యం విన్దేయం గామశ్వంపురుషానహమ్ ॥

అశ్వపూర్వాం రథమధ్యాం హస్తినాద ప్రబోధినీమ్ ।
శ్రియం దేవీముపహ్వయే శ్రీర్మా దేవీజుషతామ్ ॥

కాంసోస్మి తాం హిరణ్యప్రాకారా మార్ద్రాం జ్వలంతీం తృప్తాం తర్పయన్తీమ్ ।
పద్మే స్థితాం పద్మవర్ణాన్తామి హోపహ్వయే శ్రియమ్ ॥

చన్ద్రాం ప్రభాసాం యశసా జ్వలంతీం శ్రియం లోకే దేవజుష్టా ముదారామ్ ।
తాం పద్మినీమీం శరణ మహం ప్రపద్యేఽలక్ష్మీ ర్మే నశ్యతాన్త్వాం వృణే ॥

ఆదిత్యవర్ణే తపసోఽధిజాతో వనస్పతిస్తవ వృక్షోఽథ బిల్వః ।
తస్య ఫలాని తపసా నుదన్తు మాయా స్తరాయాశ్చ బాహ్యా అలక్ష్మీః ॥

ఉపైతు మాం దేవసఖః కీర్తిశ్చ మణినా సహ ।
ప్రాదుర్భూతోఽస్మి రాష్ట్రేఽస్మిన్కీర్తి మృద్ధిన్దదాతు మే ॥

క్షుత్పిపాసామలాం జ్యేష్ఠామలక్ష్మీం నాశయామ్యహమ్ ।
అభూతి మసమృద్ధిఞ్చ సర్వాన్నిర్ణుద మే గృహాత్ ॥

గన్ధద్వారా న్దురాధర్షాం నిత్యపుష్టాఙ్కరీషిణీమ్ ।
ఈశ్వరీగ్ం సర్వభూతానాం తా మిహోపహ్వయే శ్రియమ్ ॥

శ్రీ ర్మే భజతు అలక్ష్మీర్మే నశ్యతు మనసః కామ మాకూతిం వాచస్సత్యమశీమహి ।
పశూనాగ్ం రూప మన్నస్య మయి శ్రీశ్శ్రయతాం యశః ॥

కర్దమేన ప్రజాభూతా మయి సమ్భవ కర్దమ ।
శ్రియం వాసయ మే కులే మాతరం పద్మమాలినీమ్ ॥

ఆపస్సృజన్తు స్నిగ్ధాని చిక్లీత వస మే గృహే ।
ని చ దేవీం మాతరం శ్రియం వాసయ మే కులే ॥

ఆర్ద్రాం పుష్కరిణీం పుష్టిం పిఙ్గళాం పద్మమాలినీమ్ ।
చన్ద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మ మావహ ॥

ఆర్ద్రాం యః కరిణీం యష్టిం సువర్ణాం హేమమాలినీమ్ ।
సూర్యాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ ॥

తామ్మ ఆవహ జాతవేదో లక్ష్మీమనపగామినీమ్ ।
యస్యాం హిరణ్యం ప్రభూతం గావో దాస్యో౽శ్వాన్ విన్దేయమ్పురుషానహమ్ ॥

**– ఫలశ్రుతి –**

యశ్శుచిః ప్రయతో భూత్వా జుహూయా దాజ్యమన్వహమ్ ।
శ్రియః పంచ దశర్చం చ శ్రీకామ స్సతతం జపేత్ ॥

ఆనందః కర్దమశ్చైవ చిక్లీత ఇతి విశ్రుతాః ।
ఋషయస్తే త్రయః పుత్రాః స్వయం శ్రీరేవ దేవతా ॥

పద్మాననే పద్మఊరు పద్మాక్షీ పద్మసంభవే ।
త్వమ్మాం భజస్వ పద్మాక్షీ యేన సౌఖ్యం లభామ్యహమ్ ॥

అశ్వదాయి చ గోదాయి ధనదాయి మహాధనే ।
ధనం మే జుషతాం దేవీం సర్వకామార్థసిద్ధయే ॥

పుత్ర్త పౌత్ర ధనం దాన్యం హస్త్యశ్వాజావిగోరథమ్ ।
ప్రజానాం భవసి మాతా ఆయుష్మంతం కరోతు మామ్ ॥

చంద్రాభాం లక్ష్మీ మీశానాం సూర్యాభాం శ్రియమీశ్వరీమ్ ।
చంద్ర సూర్యాగ్ని సర్వాభాం శ్రీమహాలక్ష్మీ ముపాస్మహే ॥

ధన మగ్నిర్ధనం వాయుర్ధనం సూర్యో ధనం వసుః ।
ధన మింద్రో బృహస్పతి ర్వరుణం ధన మశ్నుతే ॥

వైనతేయ సోమం పిబ సోమం పిబతు వృత్రహా ।
సోమం ధనస్య సోమినో మహ్యం దదాతు సోమినీ ॥

న క్రోధో న చ మాత్సర్యం న లోభో నాశుభా మతిః ।
భవంతి కృత పుణ్యానాం భక్తానాం శ్రీసూక్తం జపేత్సదా ॥

వర్షంతు తే విభావరి దివో అభ్రస్య విద్యుతః ।
రోహంతు సర్వబీజా న్యవ బ్రహ్మ ద్విషో జహి ॥

పద్మప్రియే పద్మిని పద్మహస్తే పద్మాలయే పద్మదళాయతాక్షి ।
విశ్వప్రియే విష్ణుమనోనుకూలే త్వత్పాదపద్మం మయి సన్నిధత్స్వ ॥

యా సా పద్మాసనస్థా విపులకటితటీ పద్మపత్రాయతాక్షీ ।
గంభీరావర్తనాభి స్తనభరనమితా శుభ్ర వస్త్రోత్తరీయా ॥

లక్ష్మీర్దివ్యైర్గజేంద్రై ర్మణిగణ ఖచితై స్స్నాపితాహేమకుంభైః ।
నిత్యం సాపద్మహస్తా మమ వసతు గృహే సర్వమాంగళ్యయుక్తా ॥

లక్ష్మీం క్షీరసముద్ర రాజతనయాం శ్రీరంగధామేశ్వరీం ।
దాసీభూత సమస్త దేవ వనితాం లోకైక దీపాంకురామ్ ॥

శ్రీమన్మందకటాక్షలబ్ధ విభవ బ్రహ్మేంద్ర గంగాధరాం త్వాం ।
త్రైలోక్య కుటుంబినీం సరసిజాం వందే ముకుందప్రియామ్ ॥

సిద్ధలక్ష్మీ ర్మోక్షలక్ష్మీ ర్జయలక్ష్మీ సరస్వతీ ।
శ్రీలక్ష్మీర్వరలక్ష్మీశ్చ ప్రసన్నా మమ సర్వదా ॥

వరాంకుశౌ పాశమభీతిముద్రాం కరైర్వహంతీం కమలాసనస్థామ్ ।
బాలార్కకోటి ప్రతిభాం త్రినేత్రాం భజేఽహ మంబాం జగదీశ్వరీం తామ్॥

సర్వ మంగళమాంగళ్యే శివే సర్వార్థసాధికే ।
శరణ్యే త్ర్యంబకే దేవి నారాయణి నమోఽస్తుతే ॥

సక్తుమివతితఉనాపునంతో యత్రధీరా మనసా వాచ మక్రత ।
అత్రాసఖా యస్సఖ్యాని జానతే భద్రైషాం లక్ష్మీర్నిహితాధివాచి ॥

ప్రణోదేవీ సరస్వతీ వాజేభిర్వాజినీవతీ ధీనామవిత్ర్యవతు ।
గౌరీ మిమాయ సలిలాని తక్షత్యేకపదీ ద్విపదీ సా చతుష్పదీ ।
అష్టాపదీ నవపదీ బభూవుషీ సహస్రాక్షరా పరమే వ్యోమన్ ॥

భక్తి పూర్వకంగా పై తెలిపిన శ్రీసూక్తాల్ని జపించి, ఆ సూక్తంతో హోమం చేసిన వారికి లక్ష్మి అనుగ్రహం కలుగుతుంది. ఈ సూక్తాలతో హోమం చేసేవారు లక్ష్మీదేవి అనుగ్రహ ప్రాప్తి కోసం కమలపుష్పాలు, బిల్వపత్రాలు, నేయి, నువ్వులు ఉపయోగించాలి.

శ్రీసూక్తంలాగానే నాలుగు వేదాల్లో పురుషసూక్తం కూడా చెప్పబడింది. అది సకల పాపాల్ని హరిస్తుంది. శుచిగా స్నానం చేసి పురుషసూక్తంలోని ఒక్కోమంత్రంతో మహావిష్ణువుకి ఒక్కో జలాంజలిని, పుష్పాన్ని సమర్పించేవాడు పాపరహితుడై తిరిగి తానే ఇతరుల పాపాల్ని కూడా తొలగించగలిగేవాడౌతాడు.

## పురుష సూక్తం

హరిః ఓమ్ తచ్ఛంయోరా వృణీమహే గాతుంయజ్ఞాయ ।
గాతుం యజ్ఞపతయే దైవీ స్వస్తిరస్తు నః ॥

స్వస్తిర్మానుషేభ్యః। ఊర్ధ్వం జిగాతు భేషజమ్ ।
శం నో అస్తు ద్విపదే। శం చతుష్పదే ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః ॥

ఓం సహస్రశీర్షా పురుషః। సహస్రాక్షస్సహస్రపాత్ ।
స భూమిం విశ్వతో వృత్వా। అత్యతిష్ఠద్దశాంగులమ్ ॥

పురుష ఏవేదగ్ం సర్వమ్। యద్భూతం యచ్చ భవ్యమ్ ।
ఉతామృతత్వ స్యేశానః। యదన్నేనాతిరోహతి ॥

ఏతావానస్య మహిమా। అతో జ్యాయాగ్శ్చ పూరుషః ।
పాదోఽ స్య విశ్వా భూతాని। త్రిపాదస్యామృతం దివి ॥

త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః। పాదో ఽ స్యేహాభవాత్పునః ।
తతో విష్వఙ్వ్యక్రామత్। సాశనానశనే అభి ॥

తస్మాద్విరాడజాయత । విరాజో అధిపూరుషః ।
స జాతో అత్యరిచ్యత। పశ్చాద్భూమి మథో పురః ॥

యత్పురుషేణ హవిషా। దేవా యజ్ఞమతన్వత ।
వసంతో అస్యాఽ సీదాజ్యమ్। గ్రీష్మ ఇధ్మశ్శరద్ధవిః ॥

సప్తాస్యాసన్పరిధయః। త్రిస్సప్తసమిధః కృతాః ।
దేవా యద్యజ్ఞం తన్వానాః। అబధ్నన్పురుషం పశుమ్ ॥

తం యజ్ఞం బర్హిషి ప్రౌక్షన్న్। పురుషం జాత మగ్రతః ।
తేన దేవా అయజంత। సాధ్యా ఋషయశ్చ యే ॥

తస్మాద్యజ్ఞాత్సర్వహుతః । సంభృతం పృషదాజ్యమ్ ।
పశూగ్స్తాగ్శ్చక్రే వాయవ్యాన్। ఆరణ్యాన్గ్రామాశ్చ యే ॥

తస్మాద్యజ్ఞాత్సర్వహుతః। ఋచస్సామాని జజ్ఞిరే ।
ఛందాగ్ంసి జిజ్ఞిరే తస్మాత్। యజుస్తస్మాదజాయత ॥

తస్మాదశ్వా అజాయంత। యే కే చోభయాదతః ।
గావో హ జిజ్ఞిరే తస్మాత్ । తస్మాజ్జాతా అజావయః ॥

యత్పురుషం వ్యదధుః। కతిధా వ్యకల్పయన్ ।
ముఖం కిమస్య కౌ బాహూ। కావూరూ పాదావుచ్యేతే ॥

బ్రాహ్మణోస్య ముఖమాసీత్। బాహూ రాజన్యః కృతః ।
ఊరూ తదస్య యద్వైశ్యః। పద్భ్యాగ్ం శూద్రో అజాయత ॥

చంద్రమా మనసో జాతః। చక్షో స్సూర్యో అజాయత ।
ముఖాదింద్ర శ్చాగ్నిశ్చ । ప్రాణాద్వాయు రజాయత ॥

నాభ్యా ఆసీదంతరిక్షమ్। శీర్ష్ణోద్యౌ స్సమవర్తత ।
పద్భ్యాం భూమిర్దిశశ్శ్రోత్రాత్ । తథా లోకాగ్ం అకల్పయన్ ॥

వేదాహ మేతం పురుషం మహాంతమ్। ఆదిత్యవర్ణం తమసస్తు పారే ।
సర్వాణి రూపాణి విచిత్య ధీరః। నామాని కృత్వాఽభివదన్ యదాస్తే ॥

ధాతా పురస్తాద్వముతాజహార। శక్రః ప్రవిద్వాన్ ప్రదిశ శ్చతస్రః ।
తమేవం విద్వా నమృత ఇహ భవతి। నాన్యః పన్థా అయనాయ విద్యతే ॥

యజ్ఞేన యజ్ఞ మయజంత దేవాః తాని ధర్మాణి ప్రథమా న్యాసన్ ।
తే హ నాకం మహిమానస్సచన్తే యత్ర పూర్వే సాధ్యాస్సంతి దేవాః ॥

అద్భ్యస్సంభూతః పృథివ్యై రసాచ్చ। విశ్వకర్మణ స్సమవర్తతాధి ।
తస్య త్వష్టా విదధ ద్రూపమేతి। తత్పురుషస్య విశ్వమాజాన మగ్రే ॥

వేదాహ మేతం పురుషం మహాంతమ్। ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్ ।
తమేవం విద్వానమృత ఇహ భవతి। నాన్యః పంథా విద్యతేఽయనాయ ॥

ప్రజాపతిశ్చరతి గర్భే అంతః। అజాయమానో బహుధా విజాయతే ।
తస్య ధీరాః పరిజానంతి యోనిమ్। మరీచీనాం పద మిచ్ఛంతి వేధసః ॥

యో దేవేభ్య ఆతపతి। యో దేవానాం పురోహితః ।
పూర్వో యో దేవభ్యో జాతః । నమో రుచాయ బ్రాహ్మయే ॥

రుచం బ్రాహ్మం జనయంతః। దేవా అగ్రే తదబ్రువన్ ।
యస్త్వైవం బ్రాహ్మణో విద్యాత్। తస్య దేవా అసన్ వశే ॥

హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ। అహోరాత్రే పార్శ్వే ।
నక్షత్రాణి రూపమ్। అశ్వినౌ వ్యాత్తమ్ ॥

ఇష్టం మనిషాణ । అముం మనిషాణ। సర్వం మనిషాణ ।
ఓమ్ తచ్ఛంయోరా వృణీమహే। గాతుం యజ్ఞాయ ॥
గాతుం యజ్ఞపతయే। దైవీ స్వస్తిరస్తు నః ।
స్వస్తిర్మానుష్యేభః। ఊర్ధ్వం జిగాతు భేషజమ్ ।
శం నో అస్తు ద్విపదే। శం చతుష్పదే ॥

పై తెలిపిన పురుష సూక్తంలోని ఒక్కో మంత్రంతో ఒక్కో ఫలాన్ని శ్రీమహావిష్ణువుకి సమర్పిస్తే సకల కోరికలూ సిద్ధిస్తాయి. అలాగే ఈ పురుష సూక్తాన్ని జపించటం వల్ల మహా పాతకాలు, ఉపపాతకాలు కూడా నశిస్తాయి. కృచ్ఛ్రవ్రతాన్ని చేసి పరిశుద్ధుడై పురుష సూక్తంతో జపహోమాలు చేసిన వాడు అన్నిటినీ పొందగలడు.

## ఉత్పాతాలు - శాంతులు

భూమండలంలో అప్పుడప్పుడూ వివిధ రకాల ఉత్పాతాలు కలుగుతుంటాయి. ఈ ఉత్పాతాలని శాంతింప చేయటానికి శాస్త్రాలలో మొత్తం పద్దెనిమిది రకాల శాంతులు చెప్పారు. అయితే వీటిలో 1.అమృత 2.అభయ 3.సౌమ్య అనే శాంతులు ప్రధానమైనవి. అమృత శాంతి సర్వదైవత్యం కాగా, అభయశాంతి బ్రహ్మదైవత్వంగా, సౌమ్యాశాంతి సర్వదైవత్వంగా ప్రసిద్ధి చెందాయి. ఈ శాంతులన్నీ దివ్య- అంతరిక్ష - భౌమ అనే మూడు రకాల ఉత్పాతాల్ని శమింపచేస్తాయి.

గ్రహనక్షత్ర వికారాల వల్ల సంభవించే ఉత్పాతాల్ని దివ్య ఉత్పాతాలంటారు. ఉల్కాపాతాలు, దిక్కులు మండటం, సూర్యుడు గుడి కట్టటం, గంధర్వనగరం కనిపించటం, వికృతంగా వర్షం పడటం - ఇలాంటివన్నీ అంతరిక్ష జన్య ఉత్పాతాలు. స్థావరాలలో, జంగమాలలో ఉన్న ప్రాణులకి హఠాత్తుగా కలిగే ఉపద్రవాలు, భూకంపాలు లాంటివి భూమి జనిత ఉత్పాతాలు.

ఈ ఉత్పాతాలు కనబడిన తరువాత ఒక వారం రోజుల్లో వర్షం కురిస్తే ఆ అద్భుతాలన్నీ నిష్ఫలమైపోతాయి. మూడు సంవత్సరాలలోపు ఈ అద్భుత ఉత్పాతాలకి తగిన శాంతి చేయలేకపోతే భూమండలానికి ఎంతో ఉపద్రవం కలుగుతుంది.

దేవతా ప్రతిమలు నాట్యం చేయటం, విపరీతంగా కదలటం, మండిపోవటం, గట్టిగా శబ్దం చేయటం, ఏడ్వటం, వాటికి చెమట పట్టటం, ఉన్నట్టుండి ప్రతిమలు నవ్వటం లాంటి వికారాలు కనబడితే ఆయా దేవతల్ని పూజించి, ప్రాజాపత్య హోమాన్ని శాంతి కోసం చేయాలి. ఏ రాజ్యంలోనైనా ఎవరూ అంటించకుండా ఘోరమైన శబ్దం చేస్తూ అగ్ని ప్రజ్వరిల్లితే, ఆ రాజ్యం దుష్టగ్రహాల చేత పీడించబడుతుంది. ఈ విధంగా సంభవించే అగ్నివికారాలు శాంతించటానికి 'అగ్నిదేవత' మంత్రాలతో హోమం చేయాలి.

చెట్లనుంచి పాలు, రక్తం కారితే దాన్ని వృక్ష జనిత ఉత్పాతమంటారు. అలా జరిగినప్పుడు పరమేశ్వరుణ్ణి పూజించాలి. అతివృష్టి- అనావృష్టి అనే రెండూ దుర్భిక్షానికి కారకాలు. వర్షఋతువు కాని సమయంలో మూడు రోజులు వరుసగా వానకురిస్తే అది వర్షజన్య ఉత్పాతమవుతుంది. అలాంటప్పుడు పర్జన్యుణ్ణి, సూర్యచంద్రుల్ని పూజిస్తే ఆ ఉత్పాతం శాంతిస్తుంది. ఒక నగరంలో ఉన్న నది దూరంగా జరిగిపోయి తిరిగి దగ్గరకు రావటం, నగరంలో ఉన్న సరోవరాలు హఠాత్తుగా ఎండిపోవటం జరిగితే దాన్ని జలాశయవికారాలంటారు. వీటిని తొలగించుకోవటానికి వరుణ మంత్రజపాలు చేయాలి.

అకాలంలో స్త్రీలు ప్రసవించినా, సరైన సమయంలో ప్రసవించక పోయినా, వికృతమైన గర్భాన్నికన్నా, కవలపిల్లల్ని కన్నా వీటిని ప్రసవజన్యవికారాలంటారు. ఈ వికారాలు తొలగించబడాలంటే పతివ్రతలైన స్త్రీలని, బ్రాహ్మణుల్ని పూజించాలి.

గుర్రాలుగానీ, ఆవులుగానీ, ఏనుగుగానీ, రెండు పిల్లల్నికన్నా, వికృతమైన సంతానాన్ని కన్నా, వాటికి పుట్టిన సంతానం ఆరునెలల్లో మరణించిన అవి ఉన్న ప్రాంతానికి లేక రాజ్యానికి శత్రుబాధ కలుగుతుంది. ఈ ఉత్పాతాల్ని శమింపచేయాలంటే శాంతి హోమం విప్రపూజ ఆచరించాలి.

ఆకాశంలో తూర్యానాదాలు వినబడ్డా, అడవిలో ఉండే పశువులు, పక్షులు గ్రామంలోకి గుంపులుగా ప్రవేశించినా, అలాగే గ్రామంలో ఉండే పశువులు ఒక్కసారిగా అడవిలోకి వెళ్ళిపోయినా, నేలమీద సంచరించేవి నీళ్ళలోకి వెళ్ళినా, నీళ్ళలో సంచరించే జీవులు ఒక్కసారిగా నేలమీదకి వచ్చినా, రాజద్వారం దగ్గరకి నక్కలు వచ్చి అరిచినా, ప్రదోషకాలంలో కోడికూసినా, సూర్యదయ సమయంలో నక్కలు అరిచినా, పావురాలు ఇంట్లోకి దూరినా, మాంసం తినే పక్షులు తనమీద తిరిగినా, కాకులు మైథునం చేస్తూ కనిపించినా, వాటిని గొప్ప ఉత్పాతాలుగా గ్రహించాలి.

దృఢంగా నిర్మించిన ప్రాకారాలు, తోరణాలు, కట్టడాలు హఠాత్తుగా కూలిపోయినట్లైతే ఆ రాజ్యాన్ని పాలించే రాజు మరణిస్తాడు. పరాగంగానీ, పొగగానీ పదిదిక్కుల్లో నిండిపోయినా, కేతువు ఉదయించినా, సూర్యచంద్ర బింబాల మధ్యలో రంధ్రం కనబడినా, వాటిని గ్రహనక్షత్ర వికారాలుగా గుర్తించాలి. ఇవి ఎక్కడ కనిపిస్తే ఆ ప్రాంతంలో భయాన్ని కలిగిస్తాయి.

అగ్ని ఎంత ప్రయత్నించినప్పటికీ మండకపోయినా, నీళ్ళతో నిండిన కుండ అకారణంగా కారిపోయినా, మరణం, భయం, మహామారిలాంటి ఉత్పాతాలు సంభవిస్తాయి. ఈ రకమైన ఉత్పాతాలన్నీ శాంతించాలంటే యోగ్యులైన విప్రుల్ని, దేవతల్ని పూజించి, జప, హోమాలు ఆచరించాలి.

## స్నానఫలం

మానవులకి సకలకార్య సిద్ధిని కలిగించే, శాంతికరమైన స్నాన విధానాలు శాస్త్రాలలో చెప్పబడ్డాయి. గృహస్థులు తమకి సకల సౌభాగ్యాలు

కలగాలంటే శ్రీమహావిష్ణువు ప్రతిమకి నదీతీరంలో స్నానం చేయించాలి. అలాగే గ్రహబాధలు, జ్వరపీడలు కలిగినప్పుడు శ్రీమహావిష్ణువుకి దేవాలయంలో స్నానం (అభిషేకం) చేయించాలి.

ఉన్నత విద్యనే కావాలనికోరుకునేవాడు జలాశయంలోకానీ, స్వగృహంలో కానీ స్నానం చేయాలి. విజయం కావాలనుకునేవాడు తీర్థస్థలాల్లో ఉన్న జలాశయాల్లో లేక నదుల్లో స్నానంచేయాలి. గర్భస్రావాలతో బాధపడే స్త్రీ కి పుష్కరిణిలో స్నానం చేయిస్తే ఆ దోషం తొలగిపోతుంది. పుట్టిన వెంటనే పిల్లలు మరణిస్తున్న స్త్రీకి అశోకవృక్ష సమీపంలో స్నానం చేయించాలి. రజస్వలకాని స్త్రీలు పూలతో నిండిన వనంలో స్నానం చేస్తే సకాలంలో రజస్వలలవుతారు.

పుత్రుల్ని కావాలని కోరుకునే స్త్రీలు సముద్రంలో, సౌభాగ్యాన్ని కోరుకునే స్త్రీలు స్వగృహంలో స్నానం చేయాలి. ఇప్పుడు చెప్పిన వారంతా శ్రీమహావిష్ణువు ప్రతిమని తాము స్నానం చేసే ప్రాంతంలో స్థాపించి ఆ ప్రతిమకి సమీపంలో స్నానంచేయాలి. అలా చేస్తేనే కోరిన ఫలితాలు లభిస్తాయి.

శ్రవణ, రేవతి, పుష్యమి నక్షత్రాలున్న రోజులు అందరికీ స్నానం కోసం ప్రశస్తమైనవి. కామ్యస్నానం చేయాలనుకునేవారు ఒక సప్తాహం అనగా ఏడురోజులకు ముందే ఉత్సాధనం విధించబడింది. పునర్నవా, గోరోచనం, శతాంగం, గురుణి, బెరడు, మధూకం, రెండు రకాల పసుపు, తగరం, నాగకేసరాలు, అంబరి, మంజిష్ఠ, జటామాంసి, యాసకం, కర్దమం, ప్రియంగువు, తెల్లఆవాలు, కుష్ఠం, బలబ్రాహ్మీ కుంకుమ, సక్తువులు కలిపిన పంచగవ్యాలు వీటన్నిటినీ కలిపి దానితో శరీరానికి నలుగుపెట్టుకొని, ఆ తరువాత స్నానం చేయాలి. ఈ విధంగా చేస్తే సకల సౌభాగ్యాలూ కలుగుతాయి.

## వినాయక స్నానం

మానవులు చేసే సకల కర్మలకీ విఘ్నాలు కలిగించటం కోసం బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ముగ్గురూ శ్రీవినాయక స్వామిని సృష్టించి అతనికి

గణాధిపత్యాన్ని కూడా ప్రసాదించారు. ఈ వినాయకుడి బాధ లోకంలో కొంతమందికి వారి వారి పూర్వజన్మ పాప పుణ్యానుసారం కలుగుతుంటుంది. ఈ వినాయక బాధల లక్షణాలు ఎలా ఉంటాయంటే – స్వప్నంలో లోతైన నీళ్ళలో మునిగిపోవటం, గుండుతో వున్న ప్రజల్ని దర్శించటం, మాంసం తినే మృగాలు కనబడటం, ఎక్కడైనా నడిచివెళ్తున్నప్పుడు తన వెనకే ఎవరో వస్తున్నట్టు అనిపించటం, కన్యకి వరుడు లభించకపోవటం, స్త్రీకి సంతానం కలగకపోవటం, అకారణంగా మనసుబాధ పడటం శ్రోత్రియుడికి ఆచార్యత్వం, శిష్యుడికి అధ్యయనం, ధనవంతుడికి ఆర్థికలాభం, వ్యవసాయం చేసేవాడికి పంటఫలం, రాజుకి రాజ్యం లభించవు. ఇలాంటి వారందరికీ వినాయక స్నానాన్ని చేయించాలి.

హస్త, పుష్యమి, అశ్విని, మృగశిర, శ్రవణానక్షత్రాలు ఈ వినాయక స్నానానికి మంచివి. ఈ నక్షత్రాలున్న రోజు ఒకపీఠం మీద బాధితవ్యక్తిని కూర్చోబెట్టి పచ్చటి ఆవాల్ని బాగా నూరి ముద్ధచేసి ఆ ముద్దని నేతితో తడిపి దానితో అతడి శరీరాన్నంతా నలుగుపెట్టాలి. తరువాత ఆ వ్యక్తి తలమీద అన్నిరకాల ఓషధులతో, సుగంధ ద్రవ్యాల్ని కలిపి, లేపనం చేయాలి. అలాగే అశ్వశాల, గజశాల, పుట్ట, నదీసంగమం, జలాశయం ప్రాంతాల నుంచి తెచ్చిన అయిదురకాల మట్టి, గోరోచనం, గంధం, గుగ్గులు అనేవాటిని నాలుగు కలశాలలో వేసి ఆకలశాన్ని నీటితో నింపాలి. తరువాత నింపిన ఆ నాలుగు కలశాలలో తూర్పు వైపు ఉంచిన కలశాన్ని తీసుకుని –

సహస్రాక్షంశతధారమృషిభిః పావనం కృతమ్ ।
తేనత్వామభిషించామి పావమాన్యః పునంతుతే ॥
భగంతే వరుణోరాజా భగం సూర్యో బృహస్పతిః ।
భగమింద్రశ్చ వాయుశ్చ భగం సప్తర్షయో దదుః ॥

యత్తే కేశేషుదౌర్భాగ్యం సీమంతే యచ్ఛమూర్ధని ।
లలాటే కర్ణమోరక్ష్ణో రాపస్తద్ ఘ్నంతు సర్వదా ॥

*(శ్లో॥10-12,అధ్యా-266)*

వేయినేత్రాలు కలిగినది, మహర్షులందరిచేతా పవిత్రీకరించబడింది అయిన ఈ దివ్యజలంతో నీకు స్నానం చేయిస్తున్నాను. రాజీవంలాంటి శరీరవర్ణం కలిగిన సూర్యుడు, బృహస్పతి, ఇంద్రుడు, వాయుదేవుడు, సప్తర్షులు నీకు శుభాల్ని కలిగించెదరుగాక! నీ కేశాలలో, సీమంతం (పాపిట)లో, తలమీద, నుదురు, చెవులు, కళ్ళు - ఈ స్థానాల్లో ఉన్న దౌర్భాగ్యాన్ని,అమంగళాల్ని, ఈ పవిత్రజలం తొలగించుగాక! అని చెబుతూ స్నానం చేయించాలి.

అలా స్నానం చేయించిన తరువాత గురువు లేక పురోహితుడు, తన ఎడమచేత్తో దర్భల్ని పట్టుకుని, వాటిని స్నానం చేసిన వాడి తలమీద ఉంచాలి. చరువు, ఆవనూనెలతో హోమాన్ని చేయాలి. హోమం చేసేదప్పుడు ఓం మితాయ స్వాహా, ఓం సమ్మితాయ స్వాహా, ఓం శాలకాయ స్వాహా, కంటకాయ స్వాహా, ఓం కూష్మాండాయ స్వాహా, ఓం రాజపుత్రాయ స్వాహా అనే మంత్రాల్ని పఠిస్తూ హోమం చేయాలి.

హోమం పూర్తయిన తరువాత మిగిలిన చరువుతో 'వం నమః' అనే వరుణమంత్రాన్ని ఉచ్చరిస్తూ బలిని సమర్పించాలి. బలిలో భాగంగా ఒక చేటలో దర్భల్ని పరిచి, తడిపొడిగా ఉన్న బియ్యం నువ్వులు కలిపి నూరి వండిన అన్నం, వివిధ రకాల పుష్పాలు, మాంసాన్నం, మత్స్యాలు మూడు రకాలైన మద్యం, అపూపాలు, ఏండవిక మాలలు, దధ్యన్నం, పాయసం, పిష్టం, లడ్డూలు, బెల్లం, వీటన్నిటినీ ఆ చేటలోకి చేర్చి ఆ చేటను తీసుకెళ్ళి నాలుగు దార్లు కలిసే చోట ఉంచి దేవతా, సువర్ణ, సర్ప, గృహ, అసుర, యాతుధాన, పిశాచ, నాగ, మాతృ, శాకినీ, యక్ష, వేతాళ, యోగినీ, పూతనాదులకి ఆ బలిని సమర్పించాలి.

బలిని సమర్పించిన తరువాత వినాయకుడికి తల్లి అయిన పార్వతీదేవికి దూర్వా (గరిక) దళాలు తెల్లావాలు, పుష్పాలు వీటితో నిండిన అంజలి సమర్పించాలి.

రూపందేహియశోదేహి సౌభాగ్యం సుభగేమమ ।
పుత్రందేహి ధనందేహి సర్వాన్కామాంశ్చదేహిమే ॥
భోజయేద్బ్రాహ్మణాన్ దద్యాద్వస్త్రయుగ్మం గురోరపి ।
వినాయకం గ్రహాన్స్రార్చ్యశ్రియం కర్మఫలం లభేత్ ॥

*(శ్లో॥19-20,అధ్యా-266)*

సకల సౌభాగ్యవతివైన "ఓ పార్వతీదేవీ! నాకు అందమైన రూపాన్ని, కీర్తిని, సౌభాగ్యాన్ని, పుత్ర సంతానాన్ని, ధనాన్ని, సకలకోరికలు ఫలించే సిద్ధిని" ప్రసాదించమని ప్రార్థించాలి. తరువాత విప్రులకి భోజనం పెట్టి ఆచార్యుడికి పంచె ఉత్తరీయం సమర్పించాలి. ఈ విధంగా వినాయక స్నానాన్ని ఆచరిస్తే సకల గ్రహదోషాలూ, తొలగిపోతాయి.

## శుభఫలితాలనిచ్చే వివిధ స్నానాలు

నేతితో స్నానం చేస్తే ఆయుర్వృద్ధి కలుగుతుంది. గోమయం (ఆవుపేడతో) స్నానం చేస్తే లక్ష్మీ ప్రదం. గోమూత్రంతో చేసే స్నానం పాపాల్ని నశింపచేస్తుంది. పాలతో స్నానం చేస్తే బలం వృద్ధి చెందుతుంది. పెరుగుతో స్నానం చేస్తే ఐశ్వర్యప్రదం.

దర్భలు వేసిన నీళ్ళతో స్నానం చేస్తే పాపాలన్నీ నశిస్తాయి. పంచగవ్యాలతో చేసే స్నానం సకల కోరికల్నీ తీరుస్తుంది. అదేవిధంగా ఆవు కొమ్ముల్లో నీళ్ళు నింపి దానితో స్నానం చేస్తే పాపాలు తొలగిపోతాయి.

వస, రెండు రకాల పసుపులు (మంజిష్ఠ పసుపు – కస్తూరి పసువు) ముస్త కలిపిన నీళ్ళతో స్నానం చేస్తే అసుర శక్తుల ప్రయోగాలు తొలగిపోతాయి. ఈ దివ్యస్నానం వల్ల ఆయుర్వృద్ధి, మేధాశక్తి కూడా పెంపొందుతుంది.

బంగారం నీళ్ళతో స్నానం చేస్తే మంగళకరంగా ఉంటుంది. రత్నాలతో నింపిన నీళ్ళతో చేసే స్నానం విజయాన్నిస్తుంది. రజత (వెండి) తామ్ర (రాగి) జలంతో స్నానం చేసినా శుభప్రదంగా వుంటుంది.

అన్నిరకాల సుగంధద్రవ్యాలు నీళ్ళలో కలిపి ఆ నీళ్ళతో స్నానం చేస్తే సౌభాగ్యం పెంపొందుతుంది. అలాగే ఫలోదక స్నానంతో ఆరోగ్యం, ఉసిరికాయల రసం కలిపిన నీటితో చేసే స్నానం వల్ల ఐశ్వర్యం కలుగుతాయి. తిలలు, శ్వేత సర్షపాలు కలిపిన నీళ్ళతో స్నానం చేస్తే లక్ష్మీప్రాప్తి, ప్రియాంగు కలిపిన నీళ్ళతో స్నానం చేస్తే సౌభాగ్యం, పద్మాలు ఉత్పలాలు కలిపిన నీళ్ళతో స్నానం చేస్తే ఐస్వర్యప్రాప్తి కలుగుతుంది. బలా వృక్షపు ఆకులు కలిపిన నీళ్ళతో స్నానం చేస్తే అమితమైన బలం లభిస్తుంది. వీటన్నిటికన్నా శ్రీమహావిష్ణువు పాదోదకాలతో చేసే స్నానం సకలశుభాల్నీ అందిస్తుంది.

## శ్రీహరి స్నానం - ఫలితాలు

శ్రీమహావిష్ణువు అన్ని కోరికలకీ అధిపతి. ఆ స్వామిని భక్తి శ్రద్ధలతో పూజిస్తే అన్ని కోరికలూ తీరుతాయి. నెయ్యి పాలు కలిపి శ్రీహరి ప్రతిమకి స్నానం చేయించి, పూజ చేసినవాడికి పిత్తరోగం నశిస్తుంది. శ్రీహరికి పంచముద్గాల్ని బలిస్తే అతిసార రోగం నమయమవుతుంది. పంచగవ్యాలతో స్వామికి స్నానం చేయిస్తే వాత వ్యాధులు, ద్విస్నేహద్రవ్యాలతో స్నానం చేయించి శ్రద్ధగా పూజిస్తే శ్లేష్మరోగాలు నశిస్తాయి.

శ్రీహరి ప్రతిమకి నెయ్యి, నూనె, తేనెలతో చేయించిన స్నానం, త్రిరసాలతో (ఫల) చేయించిన స్నానం, నెయ్యి, నీళ్ళతో చేయించిన స్నానం, నెయ్యి నూనె కలిపిన నీళ్ళతో చేయించిన స్నానం వీటిని సమలస్నానం అంటారు. అలాగే తేనె, చెఱుకురసం పాలతో చేయించిన స్నానం, త్రిమధురాలు (పాలు –తేనె–పంచదార) ఉపయోగించి చేయించిన స్నానం వీటిని త్రిరసస్నానం అంటారు. ఇవి రెండూ లక్ష్మీ ప్రాప్తిని కలిగిస్తాయి.

కర్పూరం, ఉశీరచందనంతో చేసిన అనులేపనం, త్రిశుక్లం, చందనం, అగరు, కర్పూరం, కస్తూరి, కుంకుమలతో చేసిన అనులేపనం శ్రీ మహా విష్ణుమూర్తికి సమర్పిస్తే అది సకలకామప్రదమవుతుంది. కర్పూర చందన కుంకుమలతోకానీ, కస్తూరి, కర్పూర చందనాలతో కానీ చేసిన త్రిసుగంధ అనులేపనాన్ని శ్రీహరికి చేస్తే కోరిన కోరికలు తీరుతాయి. జాతిఫలం, కర్పూరం, శ్రీచందనం అనే మూడిటినీ 'త్రిశీతకాలు' అని అంటారు. పీతవర్ణం (పసుపు) శుక్లవర్ణం (తెలుపు) కృష్ణవర్ణం (నలుపు) రక్తవర్ణం (ఎరుపు) వరితవర్ణం (ఆకుపచ్చ) ఇవి పంచవర్ణాలు.

శ్రీహరి పూజకి ఉత్పలాలు, కమలాలు, జాతీపుష్పాలు, త్రిశీతకాలు ఉపయోగించాలి. కుంకుమ, ఎర్రకలువ, ఎర్రపద్మాలకి 'త్రిరక్తాలని' పేరు. వీటిని శ్రీహరికి సమర్పించి ధూపదీపాది షోడశోపచారాలతో ఆ స్వామిని పూజించే వారికి సుఖశాంతులు లభిస్తాయి.

నాలుగు హస్తాల కొలతతో చతురస్రకుండాన్ని ఏర్పర్చి ఎనిమిది లేక పదహారు మంది బ్రాహ్మణులు నేయి, తిల తండులాలు (నువ్వులు బియ్యం) ఉపయోగిస్తూ ఒక లక్ష లేక కోటిసార్లు శ్రీహరి మంత్రంతో హోమాన్ని చేయాలి. ఆ తరువాత గాయత్రీ మంత్రంతో కూడా యథాశక్తి హోమం చేస్తే అన్నిరకాల కామ్యాలు నెరవేరుతాయి.

## శ్రీ విష్ణు పంజర స్తోత్రం

శ్రీమహావిష్ణువు సంపూర్ణ అనుగ్రహాన్ని కలిగించే స్తోత్రాలలో ప్రధానమైనది 'విష్ణు పంజర స్తోత్రం'. పూర్వం త్రిపురాసుర సంహారం కోసం బయలుదేరిన పరమేశ్వరుడి రక్షణ కోసం బ్రహ్మదేవుడు ఆయనకి ఈ విష్ణు పంజర స్తోత్రాన్ని ఉపదేశించాడు. తిరిగి ఇదే దివ్యస్తోత్రాన్ని, బలాసురుణ్ణి చంపటానికి వెళ్తున్న ఇంద్రుడికి బృహస్పతి ఉపదేశించాడు.

విష్ణుః ప్రాచ్యాం స్థితశ్చక్రీ హరిర్దక్షిణతోగదీ ।
ప్రతీచ్యాం శార్జ్గదృగ్విష్ణుర్జిష్ణుః ఖడ్గీమమోత్తరే ॥ 1

హృషీకేశో వికోణేషు తచ్ఛిద్రేషు జనార్ధనః ।
క్రోడరూపీ హరిర్భూమౌ నరసింహోఽంబరే మమ ॥ 2

క్షురాన్తమమలం చక్రం భ్రమత్యేతత్సుదర్శనమ్ ।
అస్యాంశుమాలా దుష్ప్రేక్ష్యా హన్తుం ప్రేతనిశాచరాన్ ॥ 3

గదా చేయం సహస్రార్చిః ప్రదీప్తపావకోజ్జ్వలా ।
రక్షోభూతపిశాచానాం డాకినీనాంచ నాశినీ ॥ 4

శార్జ్గ విస్ఫూర్జితం చైవ వాసుదేవస్య మద్రిపూన్ ।
తిర్యఙ్మనుష్య కూష్మాండ ప్రేతాదీన్హన్త్వ శేషతః ॥ 5

ఖడ్గ ధారోజ్జ్వలజ్యోత్స్నా నిర్ధూతామే సమాహితాః ।
తేయాన్తు శామ్యతాం సద్యోగరుడేనేవ పన్నగాః ॥ 6

యే కూష్మాండాస్తథా యక్షాయే దైత్యాయే నిశాచరాః ।
ప్రేతావినాయకాః క్రూరా మనుష్యాజంభగాఃఖగాః ॥ 7

సింహాదయశ్చ పశరో దందశూకాశ్చ పన్నగాః ।
సర్వేభవన్తుతే సౌమ్యాః కృష్ణశంఖరవాహతాః ॥ 8

చిత్తవృత్తి హరాయేమే యేజనాః స్మృతి హారకాః ।
బలౌజసాంచ హర్తార శ్ఛాయావి భ్రంశకాశ్చయే ॥ 9

యే చోపభోగ హర్తారే యేచ లక్షణ నాశకాః ।
కూష్మాండాస్తే ప్రణశ్యన్తు విష్ణుచక్ర రవాహతాః ॥ 10

బుద్ధిస్వాస్థ్యం మనః స్వాస్థ్యం స్వాస్థ్య మైంద్రియకంతథా ।
మమాస్తు దేవ దేవస్య వాసుదేవస్య కీర్తనాత్ ॥ 11

పృష్ఠే పురస్తాన్మమ దక్షిణోత్తరే వికోణతశ్చాస్తు జనార్దనో హరిః ।
తమీడ్య మీశాన మనంత మచ్యుతం జనార్ధనం ప్రణిపతితోన సీదతి ॥ 12

యథా పరం బ్రహ్మ హరిస్తథాపరో జగత్సరూపశ్చ సఏవ కేశవః ।
సతేన తేనాచ్యుత నామ కీర్తనాత్ర్పణాశయేత్తు త్రివిధం మమాశుభమ్ ॥ 13
*(శ్లో॥3-15,అధ్యా-270)*

## వేదశాఖలు

ఋక్, యజు, అధర్వ, సామ అని వేదాలు నాలుగు. ఈ నాలుగు వేదాలలో ఉండే మంత్రాలు సర్వానుగ్రహకారకాలు. నాలుగు వేదాలలో ఉండే మంత్రాల సంఖ్య ఒక లక్ష.

1. **ఋగ్వేదం :** ఋగ్వేదానికి సాంఖ్యాయానం - అశ్వలాయనం అని రెండు శాఖలున్నాయి. ఈ ఋగ్వేదానికి సంబంధించిన బ్రాహ్మణాలలో మొత్తం రెండువేల మంత్రాలున్నాయి. కృష్ణ ద్వైపాయ నాదులు (వ్యాసమహర్షి) ఋగ్వేదాన్ని పరమప్రామాణికంగా అంగీకరించాడు.
2. **యజుర్వేదం :** యజుర్వేదంలో మొత్తం 1999 మంత్రాలున్నాయి. యజుర్వేదానికి సంబంధించిన బ్రాహ్మణాలలో వెయ్యి మంత్రాలున్నాయి. దీనికి సంబంధించిన శాఖలు 86. వీటిలో ప్రధానమైనవి కాండ్వి, మాధ్యందినీ, కఠి, మైత్రాయణీ, తైత్తరీయ, వైశంపాయనిక అనే శాఖలు.
3. **సామవేదం :** సామవేదంలో కౌథుమశాఖ, అధర్వణాయణిశాఖ అనే రెండు శాఖలున్నాయి. ఈ సామవేదంలో 1.వేదం 2.అరణ్యకం 3.ఉక్థకం 4.ఊహం అని నాలుగు రకాల గానాలున్నాయి. మొత్తం 9425 మంత్రాలు ఈ సామవేదంలో ఉన్నాయి. ఇవన్నీ బ్రహ్మదేవుడికి సంబంధించిన మంత్రాలు.
4. **అధర్వవేదం :** అధర్వవేదంలో మొత్తం 16000 మంత్రాలున్నాయి. వాటితో పాటు వంద ఉపనిషత్తులు కూడా ఉన్నాయి 1.సుమంతుడు 2.జాబాలి 3.శ్లోకాయణీ 4.శౌనకుడు 5.పిప్పలాదుడు 6.ముంజకేశుడు అనేవారు అధర్వవేద శాఖల్ని ప్రవర్తింపచేసిన మహర్షులు.

శ్రీమహావిష్ణువే వేదవ్యాసుడి రూపంలో అవతరించి వేదాల్ని విభాగించాడు. వేదశాఖలు (నాలుగు వేదాలు, వాటిశాఖలు) ఇతిహాసాలు (రామాయణ భారతాలు) పురాషాలు (అష్టాదశమహాపురాణా ఉపపురాణాలు) ఇవన్నీ శ్రీహరి స్వరూపాలు.

పూర్వం లోమహర్షణుడనే సూతుడు, వ్యాసమహర్షి నుంచి పురాణాల్ని గ్రహించి వాటిని తిరిగి లోకంలో ప్రచారం చేసాడు. ఆ లోమహర్షణుడికి 1.సుమతి 2.అగ్నివర్చసుడు 3.మిత్రుడు 4.శింశపాయనుడు 5.కృతవ్రతుడు 6.సావర్ణి అనే శిష్యులున్నారు. వీరిలో శింశపాయనాది మహర్షులు పురాణ సంహితని రచించారు. శ్రీమహావిష్ణువే అష్టాదశ పురాణాలలో అష్టాదశ విద్యల స్వరూపంతో కొలువైవున్నాడు.

## అష్టాదశ పురాణాల దాన మాహాత్మ్యం

1. **బ్రహ్మపురాణం :** పూర్వం మరీచి మహర్షికి చెప్పబడ్డ బ్రహ్మపురాణం 50000 శ్లోకాలతో ఉన్నది. దానిని వ్రాసి వైశాఖ పూర్ణిమనాడు జలధేనువుతో కలిపి యోగ్యుడైన విప్రుడికి దానం చేయాలి. అలాచేస్తే స్వర్గ ప్రాప్తి కలుగుతుంది.
2. **పద్మపురాణం :** పన్నెండు వేల శ్లోకాలతో ఉన్న పద్మపురాణాన్ని శ్రద్ధగా వ్రాసి ధేనువుతో సహా జ్యేష్ఠ మాసంలో దానం చేయాలి.
3. **విష్ణుపురాణం :** పూర్వం పరాశర మహర్షి చేత వరాహకల్పవృత్తాంతం 23000 శ్లోకాలతో విష్ణుపురాణంగా రచించబడింది. దీన్ని శ్రద్ధగా వ్రాసి ఆషాఢమాసంలో ధేనువుతో సహా యోగ్యుడైన విప్రుడికి దానంచేస్తే విష్ణులోక ప్రాప్తి కలుగుతుంది.
4. **వాయుపురాణం :** ఇది పద్నాలుగు వేల 14000 శ్లోకాలతో వున్నది. శ్రీహరికి ఎంతో ప్రియమైనది. దీన్ని శ్రద్ధగా వ్రాసి శ్రావణ మాసంలో బెల్లం ధేనువుతో సహా యోగ్యుడైన విప్రుడికి దానం చేయాలి.

**5. భాగవతపురాణం :** గాయత్రీదేవిని ఆధారం చేసుకుని విస్తృతంగా భాగవత ధర్మాల్ని బోధించింది, సారస్వత కల్పసంబంధమైనది అయిన భాగవత పురాణం 18000 శ్లోకాలతో ఉన్నది. దీన్ని శ్రద్ధగా వ్రాసి బంగారు సింహాసనంతో సహా భాద్రపదమాసంలో దానం చేయాలి.

**6. నారదపురాణం :** బృహత్కల్పానికి సంబంధించిన ధర్మాలతో కూడుకున్నది నారదపురాణం. ఇందులో 25000 శ్లోకాలున్నాయి. ధేను సహితంగా ఈ పురాణాన్ని ఆశ్వీయుజమాసంలో దానం చేయాలి. అలా చేసినవాడికి పరిపూర్ణ సిద్ధి కలుగుతుంది.

**7. మార్కండేయపురాణం :** పక్షులచేత ధర్మాధర్మ విచక్షణ చేయబడ్డ పురాణం మార్కండేయ పురాణం. ఇందులో 9000 శ్లోకాలున్నాయి. వీటిని శ్రద్ధగా వ్రాసి కార్తీక మాసంలో దానం చేయాలి.

**8. అగ్నిపురాణం :** అగ్నిదేవుడు వశిష్ఠమహర్షికి చెప్పినదే అగ్నిపురాణం. 12000 శ్లోకాలున్న ఈ పురాణాన్ని శ్రద్ధగా వ్రాసి, మార్గశీర్షమాసంలో యోగ్యుడైన విప్రుడికి దానం చేయాలి. అలా చేసినవాడికి అన్నికోరికలూ తీరుతాయి.

**9. భవిష్య పురాణం :** ఇది సూర్యసంబంధమైన పురాణం. ఇందులో 14000 శ్లోకాలున్నాయి. వీటిని శ్రద్ధగా వ్రాసి పుష్యమాసంలో బెల్లం – ధేనువుతో సహా దానం చేయాలి.

**10. బ్రహ్మవైవర్త పురాణం :** పూర్వం సావర్ణి నారదుడికి ఈ పురాణాన్ని బోధించాడు. ఇందులో రథంతర కల్ప వృత్తాంతం వర్ణించబడింది. 18000 శ్లోకాలతో ఉన్న ఈ పురాణాన్ని వ్రాసి మాఘమాసంలో దానం చేయాలి.

**11. వరాహ పురాణం :** వరాహమూర్తి భూదేవికి ఈ పురాణాన్ని స్వయంగా బోధించాడు. పరమపవిత్రమైన ఈ పురాణాన్ని శ్రద్ధగా వ్రాసి మాఘమాసంలో దానం చేసిన వాడికి బ్రహ్మలోకం ప్రాప్తిస్తుంది.

**12. లింగపురాణం :** ఆగ్నేయకల్పంలో నివృత్తాంతాలతో కూడింది ఈ లింగ పురాణం. 12000 శ్లోకాలతో ఉన్న ఈ దివ్యపురాణాన్ని శ్రద్ధగా వ్రాసి నువ్వులు – ధేనువుతో సహా ఫాల్గుణమాసంలో దానం చేయాలి. అలాచేసిన వాడు శివలోకాన్ని చేరుకుంటాడు.

**13. స్కందపురాణం :** కుమారస్వామి తత్పురుషకల్పంలో ఉన్న కథనాన్ని శైవమతపరంగా బోధించాడు. 84000 శ్లోకాలున్న ఈ పురాణాన్ని శ్రద్ధగా వ్రాసి చైత్రమాసంలో దానంచేయాలి.

**14. వామనపురాణం :** ధేనుకల్పంలో జరిగిన శ్రీమహావిష్ణువు చరిత్ర ఈ పురాణంలో వివరించబడింది. దీనిలో 10000 శ్లోకాలున్నాయి. ఈ దివ్య పురాణాన్ని శ్రద్ధగా వ్రాసి పౌర్ణమినాడు గానీ, విషువ సంక్రాంతి సమయంలో గానీ దానం చేయాలి.

**15. కూర్మ పురాణం :** కూర్మావతారాన్ని ధరించిన శ్రీహరి ఇంద్రద్యుమ్నుడికి పాతాళంలో చెప్పిన కథనమే ఈ పురాణం. ఇందులో 8000 శ్లోకాలున్నాయి. దీన్ని శ్రద్ధగా వ్రాసి స్వర్ణంతో సహా యోగ్యుడైన విప్రుడికి దానం చేయాలి.

**16. మత్స్యమహాపురాణం :** కల్పాదిలో మత్స్యరూపాన్ని ధరించిన శ్రీహరి మనువుకి ఈ పురాణాన్ని చెప్పాడు. దీన్ని శ్రద్ధగా వ్రాసి బంగారంతో చేసిన మత్స్యంతో పాటు దానమివ్వాలి.

**17. గరుడ పురాణం :** శ్రీమహావిష్ణువు తార్క్ష్య కల్పంలో ఈ గరుడు పురాణాన్ని బోధించాడు. ఇందులో విశ్వాండం నుంచి గరుత్మంతుడి పుట్టుకకి సంబంధించిన కథ చెప్పబడింది. ఈ దివ్యపురాణాన్ని శ్రద్ధగా వ్రాసి బంగారు హంస ప్రతిమతో సహా దానం చెయ్యాలి.

**18. బ్రహ్మాండపురాణం :** బ్రహ్మదేవుడు బ్రహ్మాండ మాహాత్మ్యం గురించి చెప్పిన పురాణం ఇది. ఇందులో 12000 శ్లోకాలున్నాయి. ఈ పురాణాన్ని శ్రద్ధగా వ్రాసి యోగ్యుడైన విప్రుడికి దానమివ్వాలి.

శ్రోతృభిః సకలైః కార్యం శ్రావకే పూజనం ద్విజ ।
ఇతిహాస పురాణానాం పుస్తకాని ప్రయచ్ఛతి ।
పూజయిత్వాయురారోగ్యం స్వర్గమోక్ష మవాప్నుయాత్ ॥

*(శ్లో॥28-29,అధ్యా-272)*

శ్రోతలందరూ పౌరాణికుడిని శ్రద్ధగా పూజించాలి. అదేవిధంగా ఇతిహాస పురాణాలని కూడా పూజించి దానం చేయాలి. అలా చేసినవారు ఆయురారోగ్యాలని, స్వర్గ, మోక్షాలనీ పొందుతారు.

## సిద్ధౌషధాలు

పూర్వం సుశ్రుతుడు - మానవుల, అశ్వాల, గజాల, రోగాల్ని తగ్గించే ఆయుర్వేద, మృత సంజీవకర మైన సిద్ధౌషధ యోగాల గురించి, వాటి మంత్రాల గురించి చెప్పమని ధన్వంతరిని కోరాడు. అప్పుడు ధన్వంతరి (దేవవైద్యుడు) ఆయనకిలా చెప్పాడు.

జ్వరం వచ్చినవాడి శారీరక బలాన్ని చూసి వైద్యుడు అతడితో లంఖణం చేయించాలి. తరువాత శొంఠితో కూడింది, దాహాన్ని, జ్వరాన్ని తగ్గించేది అయిన లాజగంజిలో ముస్త, పర్పట, కోశరి, చందన ఉదీచ్య, నాగరాలు వేసి బాగా కాచి రోగికి ఇవ్వాలి. తిరిగి ఆరురోజులు గడిచాక తిక్తకషాయాన్ని తప్పకుండా త్రాగించాలి. జ్వరం తగ్గిన తరువాత శరీరానికి బాగా చెమట పట్టేలా చేసి, ఆ తరువాత విరేచనాలకి మందు ఇవ్వాలి.

అతిసార రోగం వచ్చినప్పుడు పాతబియ్యంతో వండిన అన్నాన్ని భుజించాలి. గుల్మరోగం వచ్చినప్పుడు కఫకరం కానిది, లోధ్రవృక్షం బెరడుతో చేసి క్వాథాన్ని కలిపినది అయిన అన్నం శ్రేయస్కరం. ఉదరరోగాలు కలిగినప్పుడు పాలతో కలిపి నెయ్యితో సాధితమైన వాట్యాన్ని తినాలి. కుష్ఠరోగం వచ్చిన వాళ్ళు - గోధుమలు, బియ్యం, ముద్గాలు, పలాశబీజాలు, ఖదిరం, జాంగలం, నింబ(నిమ్మ), పర్పటశాకాలు (కూరలు), జాంగలరసం, విడంగ, మరీచ, ముస్తకుష్ఠ, లోధ్ర, సువర్చికా, మనశ్శిలా, వసలు, గోమూత్రంతో నూరి ఉపయోగిస్తే అవి కుష్ఠవ్యాధిని తొలగిస్తాయి.

మేహవ్యాధితో బాధపడేవారికి అపూపకుష్ఠ, కుల్మాష, యవధాన్యం వంటివి హితకరాలు. శ్వాసకాసరోగులకి – కులుత్థ, ముద్గ, కోల, శుష్కమూల, జాంగల, అపూప, దధి(పెరుగు), దాడిమ (దానిమ్మ) రసం, రసమాతులుంగ రస, క్షౌద్ర, ద్రాక్ష, యవలు, గోధుమలు, శాలిబియ్యంతో వండిన అన్నం హితకరమైనవి. శుష్కమూలం, కుళుత్థ, మూల, జాంగలరసం, పాతయవలు, గోధుమలు, పాతబియ్యం ఉశీరంతో కలిపి తీసుకుంటే శ్వాస కాస వ్యాధులు తొలగిపోతాయి.

తక్రం (మజ్జిగ) చిత్రకం అనే రెండూ గ్రహణీరోగాన్ని తగ్గిస్తాయి. ఎప్పుడూ వాతరోగంతో బాధపడేవారికి పాతయవలు, గోధుమలు, వరిజాంగల రసం, ముద్గ, ఆమ్లక, ఖర్జూర, తేనె, నెయ్యి, పాలు, నింబం (నిమ్మ) పర్పటకం అనేవి ఉపయోగపడతాయి.

హృదయరోగంతో బాధపడేవారికి విరేచనం చేయించాలి. ఎక్కిళ్ళు బాగా వస్తుంటే పిప్పలి మంచిది. గాయపడిన వాడు క్షౌద్రంపాలు కలిపిన లాక్షని త్రాగాలి. మాంసరసంతో కూడిన ఆహారాన్ని రోగికి పెట్టినట్లైతే అతడు రోగాన్ని జయిస్తాడు. క్షయ రోగికి భోజనంలో ఎర్రటి వరి,నావారాలు, కలువలు మొదలైనవి హితకరంగా ఉంటాయి.

మూత్రకృచ్ఛ రోగం వచ్చినవారు ముస్తాభ్యాసం, హరిద్రాచిత్రకలేపం, యవాన్నవికృతులు, వరి, పాలు, నేయి, చెరుకురసంతో కలిపిన గోధుమలు తినటానికి మంచివి. వరి అన్నం కాచిన నీళ్ళు, పాలు అనేవి దాహాన్ని కట్టడిచేస్తాయి. అదేవిధంగా ముస్త బెల్లంతో చేసిన గుటికల్ని నోట్లో ఉంచుకుంటే దాహం తగ్గిపోతుంది.

వాతరక్తరోగి ఎర్రవరి, గోధుమలు, ముద్గాలు వంటివి తక్కువగా తినాలి. వీటితో పాటు కాకమారి, వేత్రాగ్రం, వాస్తుకం, సువర్చలా లాంటి కూరలు, తేనె, పంచదార కలిపిన నీళ్ళు స్వీకరించాలి. నాసికా (ముక్కుకి సంబంధించిన) రోగాల వారికి గరికతో సిద్ధంచేసిన నెయ్యి హితకరం. భృంగరాజ రసంతోకానీ,

ఆమలక (ఉసిరి) రసంతో గానీ, శోధితమైన తైలాన్ని నశ్యంగా ఇస్తే అన్ని రకాల శిరోరోగాలు తగ్గిపోతాయి.

చల్లటినీళ్ళు, అన్నపానాలు, నువ్వులు తినటం చేస్తే దంతాలు దృఢమవుతాయి. తిలతైలంతో (నువ్వులనూనెతో) గండూషం (పుక్కిలించటం) చేస్తే దంతాలకి పటుత్వం చేకూరుతుంది. విడంగ చూర్ణం గోమూత్రం అన్ని రకాల క్రిములూ నాశనమవటానికి ఉపకరిస్తాయి. ఉసిరిపళ్ళు నూరి నెయ్యిలో కలిపి తలకి మర్ధిస్తే శిరోరోగాలన్నీ నశిస్తాయి.

చెవిలో బాధ తగ్గాలంటే చెవుల్లో నూనెగానీ, మేకమూత్రం గానీ వేసి నింపాలి. దీనివల్ల శిరోవ్యాధులు కూడా నివారించబడతాయి. లోధ్రకాంజిక సైంధవాలని నేయిలో వేయించి దాన్ని ఒక శిలమీద నూరి కళ్ళకి లేపనం చేస్తే అన్ని రకాల నేత్రరోగాలు దూరమవుతాయి. కళ్ళవెంబడి నీళ్ళు కారటం తగ్గిపోతుంది. నేత్రరోగాలు నశించి పోవటానికి ఎప్పుడూ త్రిఫల చూర్ణాన్ని సేవించాలి.

దీర్ఘాయువు కోరుకునేవాడు త్రిఫలచూర్ణాన్ని తేనె నేయిలతో సేవించాలి. బలం కావాలంటే శతావరీ రసశోధితమైన క్షీర ఘృతాలు శ్రేష్ఠమైనవి. మినుములు (మినపపిండి) పాలు, నెయ్యి కూడా బలవర్ధకాలే. మధుకాది రస మిశ్రితమైన త్రిఫలం తెల్ల వెంట్రుకల్ని నలుపు చేస్తుంది. వసతో చేసిన ఘృతం (నెయ్యి) సేవిస్తే భూతదోషాలు నివారించబడతాయి. రాస్నతోగానీ, సహచరితోగానీ సిద్ధంచేసిన తైలం వాత రోగులకి చాలా మంచిది.

పుండు బాగా పక్వమైనప్పుడు దాన్ని చితికించటానికి, ఆ పుండుని మాన్పటానికి వేపపొడి ఉపయోగపడుతుంది. పాము కరిచిన వాడికి వేపాకులు తినిపించాలి. తాళ(తాటి), నింబ (వేప) ఆకులు, పాతనూనె, పాతనెయ్యి జుట్టు బాగా పెరగటానికి ఉపయోగపడతాయి.

తేలుకుట్టిన వాడికి నెమలిపింఛం లేదా ఘృతం (నేయి)తో ధూపం వేస్తే మంచిది. లేదా జిల్లేడు పాలతో నూరిన పలాశ బీజాలు లేపనంచేస్తే తేలు

విషం దిగిపోతుంది. తేలు కరిచిన వాడికి కృష్ణాఫలంగానీ, శివాఫలంగానీ తినిపించాలి. జిల్లేడు పాలు, నువ్వులనూనె, పలలాలు, బెల్లం వీటిని సమానంగా వేసి త్రాగిస్తే భయంకరమైన కుక్కవిషం కూడా హరిస్తుంది.

చందనం, పద్మం, కుష్ఠం, లతాంబు ఉషీరం, పాటల, నిర్గుండి, శారిబ – ఇవి సాలెపురుగు విషాన్ని తొలగిస్తాయి. బెల్లం శొంఠి విరేచనాలకి మంచిది. నువ్వులనూనె వాతానికి, నెయ్యి పిత్తానికి, తేనె కఫానికి పరమౌషధాలు.

## మంత్రరూప ఔషధాలు

'ఓం' కారం జపిస్తే ఆరోగ్యం వృద్ధిచెందుతుంది. ఇది అత్యుత్తమమైన బీజమంత్రం. దీన్ని శ్రద్ధగా జపించిన వాడికి అపమృత్యు దోషాలు కలుగవు. గాయత్రీమంత్ర మంత్రరాజం. దీన్ని జపించిన వాడికి భుక్తి ముక్తులు రెండూ లభిస్తాయి. 'ఓం నమోనారాయణాయ' అనే మంత్రం సర్వార్థసాధకం. 'ఓం నమోభగవతే వాసుదేవాయ' అనే మంత్రం సకల శుభఫలితాల్ని కలిగిస్తుంది. 'ఓం హ్రూం నమో విష్ణవే' అనే మంత్రాన్ని జపిస్తే అది పరమౌషధంగా పనిచేస్తుంది. ఈ మంత్ర జపం వల్ల దేవతలు, దానవులు ఐశ్వర్యవంతులై రోగవిముక్తి పొందారు. ఇదిలోకోపకారాన్ని కలిగించే ఔషధమంత్రం.

'ధర్మః సద్ధర్మకృద్ధర్మీ' అనే ధర్మసంబంధ నామాల్ని జపించేవాడు నిర్మలంగా ఉంటాడు. 'శ్రీదః, శ్రీశః, శ్రీనివాసః, శ్రీధరః, శ్రీనికేతనః, శ్రియః పతిః, శ్రీపరమః" అనే శ్రీహరి నామాల్ని జపించేవాడికి ఐశ్వర్యం ప్రాప్తిస్తుంది. కామీ, కామప్రదః, కామః, కామపాలః, తథాహరిః, ఆనందో మాధవశ్చైవ అనే శ్రీహరి నామాలు సకల కోరికల్ని తీరుస్తాయి.

"రామః పరశురామశ్చనృసింహో విష్ణు రేవచ త్రివిక్రమః" అనే నామాల్ని జపిస్తే అన్నిటా జయం కలుగుతుంది. విద్యాభ్యాసం చేసే విద్యార్థులు నిత్యం 'పురుషోత్తమ' అనే నామాన్ని జపించాలి. బంధాలు తొలగించుకోవాలనుకునేవారు 'దామోదరః' అనే నామాన్ని జపించాలి. నేత్రరోగాలు తొలగి పోవాలంటే 'పుష్కరాక్షః' అనే నామాన్ని, భయం పోవాలంటే 'హృషీకేశః' అనే నామాన్ని,

ఔషధాలు సేవించేడప్పుడు 'అచ్యుత' అనే అమృత మంత్రాన్ని, యుద్ధంలో విజయం కోసం 'అపరాజితః' అనే నామాన్ని, నీటిని దాటేడప్పుడు 'నృసింహ' అనే నామాన్ని స్మరించాలి.

నాలుగుదిక్కుల్లో క్షేమం కోరుకునేవాడు చక్రీ, గదీ, శార్జ్ఞి, ఖడ్గి అనే నామాల్ని స్మరించాలి. వాసుదేవ నామాన్ని ఎల్లవేళలా జపించాలి. నిద్రపోయేడప్పుడు అనంత–అచ్యుత అనే నామాల్ని స్మరించాలి. దుఃస్వప్నాలు వచ్చినప్పుడు నారాయణ నామస్మరణ చెయ్యాలి. విద్యార్థి హయగ్రీవుణ్ణి, పుత్రప్రాప్తి కోసం జగన్నాథుణ్ణి, బల పరాక్రమాలు కావాలనుకునేవాడు బలభద్రుణ్ణి స్మరించాలి. ఈ తెలిపిన శ్రీహరి నామాల్లో ఒక్కొక్క నామం ఎన్నో శుభఫలితాల్నిస్తుంది.

## యమగీత

పూర్వం యమధర్మరాజు నచికేతుడికి చెప్పిన ఆధ్యాత్మిక, వేదాంత విశేషాలే 'యమగీత' గా విఖ్యాతి పొందాయి.

* మానవుడు తాను అస్థితుడైనప్పటికీ, అశాశ్వతుడైనప్పటికీ, మోహంలో పడిపోయి ఆసనం, శయనం, వస్త్రాలు, గృహాలు, భూములు ఇవన్నీ స్థిరంగా తనకుండాలని కోరుకుంటాడు.
* భోగాలమీద ఆసక్తి లేకపోవటం, సర్వదా ఆత్మదర్శనం చేసుకోవటం, ఇదే మానవులకి శ్రేయస్కరం అని 'కపిలమహర్షి' చెబుతాడు.
* సర్వత్రా సమదర్శనం చేయటం, మమకారం అతిగా లేకపోవటం, అసంగత్వం అనేవి మాత్రమే మనుషులకి మేలుచేస్తాయని 'పంచశిఖుడు' అంటాడు.
* గర్భవాసం నుంచి జన్మించి, బాల్యాది వయసులకి సంబంధించిన అవస్థల్ని తెలుసుకోవటమే మనుషులకి శ్రేయోదాయకం అని గంగాదేవి – విష్ణుమూర్తి చెప్పారు.
* ఆధ్యాత్మిక, ఆధిదైవికాది దుఃఖాల్ని ఆద్యంతం తెలుసుకుని వాటికి ప్రతిక్రియ చేయటమే మానవులకి శ్రేయస్సు కలిగిస్తుందని 'జనకమహారాజు' బోధించాడు.

* ఎలాంటి భేదంలేని తత్త్వంలో బేధాన్ని చూడటం మానుకుంటే అదే మానవుడికి శ్రేయోదాయకం అని బ్రహ్మదేవుడు చెప్పాడు.
* ఋగ్యజుస్సామవేద విహితమైన కర్మల్ని కర్తవ్య బుద్ధితో త్రికరణశుద్ధిగా ఆచరించటం మనుషులకి శ్రేయస్కరం అని జైగీషవ్య మహర్షి అంటారు.
* సకల కార్యాలనీ పరిత్యజించటమే సుఖానికి సాధనం అనగా అన్నిటిమీదా వైరాగ్యభావాన్ని కలిగి వుండటమే మనుషులకి శ్రేయోదాయకం అని దేవలుడు ప్రబోధిస్తాడు.
* కామాన్ని గనుక విడిచిపెడితే విజ్ఞానం, సుఖం, పరపదం మానవుడికి ప్రాప్తిస్తాయి, కామంలో చిక్కుకున్నవాడికి జ్ఞానం కలగదు అని 'సనకుడు' ప్రబోధించాడు.
* ప్రవృత్తి నివృత్తి రూపంలో ఉండే కర్మల్నే ఆచరించాలి.
* నిష్కామ కర్మ చేయటమే మానవులకి పరమశ్రేయస్సుని కలిగిస్తుంది.
* నిష్కామకర్మ శ్రీహరి స్వరూపం. జ్ఞానవంతుడైన మానవుడు పరం, అవ్యయం అయిన శ్రీహరి పేరుతో వుండే పరబ్రహ్మతో ఎప్పుడూ అభేదాన్ని పొందదు.
* తపస్సు వల్ల జ్ఞానం, విజ్ఞానం, ఆస్తిక్య భావం, సౌభాగ్యం, అందమైన రూపం లభిస్తుంది.
* తపస్సు వల్ల కోరిన కోరికలు సిద్ధింప చేసుకోవచ్చు.
* శ్రీహరితో సమానమైన దైవం లేదు. అలాగే గంగతో సమానమైనది లేదు.
* జగద్గురువైన విష్ణువు తప్ప మానవుడికి బంధువు ఎవరూ లేరు.
* పైనా, క్రిందా, ముందు, వెనకా, అన్నివైపులా దేహేంద్రియాలలో మనోముఖంలో శ్రీహరే కొలువున్నాడు అని స్మరిస్తూ ప్రాణాలు విడిచి పెట్టేవాడు. సాక్షాత్తు శ్రీహరి స్వరూపుడే అవుతాడు.
* దేని నుంచి ఈ సర్వం పుట్టిందో! దేనిలో అది నిలిచివుందో! అనే విషయాన్ని గ్రహించటానికి శక్యంకానిది, ఇది అని స్పష్టంగా నిర్దేశించలేనిది పరబ్రహ్మ.
* శ్రీహరి పరాపర స్వరూపంతో అందరి హృదయాల్లో కొలువున్నాడు.

* కొందరు శ్రీహరిని యజ్ఞేశ్వరుడని, యజ్ఞపురుషుడని భావిస్తారు.
* మరికొందరు శ్రీహరిని శివుడని, బ్రహ్మ అని, విష్ణువని, త్రిమూర్తి స్వరూపుడని, సాక్షాత్తు ఆ పరబ్రహ్మ అని సంభావిస్తారు.
* ఇంకొందరు ఇంద్రుడని, కాలస్వరూపుడని, సూర్యుడని, చంద్రుడని వ్యవహరిస్తారు.
* పండితులైనవారు బ్రహ్మ నుంచి స్తంభం వరకూ ఈ జగత్తు మొత్తం విష్ణుస్వరూపమే అని చెబుతారు.
* శ్రీ మహావిష్ణువే పరబ్రహ్మ. ఆ స్థానాన్ని చేరుకున్న వారికి పునర్జన్మ ఉండదు.
* శ్రీహరి స్థానాన్ని చేరుకోవాలంటే! సువర్ణాది మహాదానాలు, పుణ్యతీర్థ స్నానాలు, ధ్యాన, వ్రతాలు, యజ్ఞయాగాది క్రతువులు ఆచరించటం ద్వారా పొందవచ్చు.
* మానవుడి శరీరంలో ఉండే ఆత్మే అందరికన్నా గొప్పదని తెలుసుకోవాలి.
* ఈ శరీరం రథం, బుద్ధి సారథి, మనసు కళ్ళెం, ఇంద్రియాలు గుర్రాలు, విషయాలు వాటి దారులు.
* ఆత్మ ఇంద్రియ సముదాయాన్ని పండితులు భోక్త అంటారు.
* నిగ్రహం లేని మనస్సుతో జ్ఞానాన్ని పొందనివాడు పరమపదాన్ని చేరుకోలేడు. సంసారంలోనే ఉండిపోతాడు.
* మనో నిగ్రహంతో జ్ఞానవంతుడైన యోగ్యుడు మాత్రమే పరమపదాన్ని (మోక్షాన్ని) పొంది తిరిగి ఇక జన్మించడు.
* విజ్ఞానసారథిగా మారి మనసు అనే పగ్గాల్ని పట్టుకుని అనగా మనసుని అదుపులో ఉంచుకుని, విషయ సుఖాల మార్గాన్ని దాటినవాడే ముక్తిని పొందుతాడు.
* ఇంద్రియాల కన్నా ధనం పరమైనది. ధనం కన్నా మనస్సు, మనస్సు కన్నా బుద్ధి పరమైనది. బుద్ధి కన్నా మహత్తు, ఆ మహత్తు కన్నా అవ్యక్తం, అవ్యక్తం కన్నా పురుషుడు పరమైనవాడు. పురుషుడి కన్నా పరమైనది ఏదీలేదు. పురుషుడే పరాకాష్ఠ. అతడే పరాగతి.
* సర్వభూతాలలో నిగూఢంగా ఉండే ఆత్మ పైకి కనపడదు.

* ఆత్మ అనేది సూక్ష్మధర్మం చేయగల సమర్థులతో, సూక్ష్మమైన బుద్ధి కలిగిన వారిచేత మాత్రమే చూడబడేది.
* పండితుడైనవాడు మాటని మనసులో నిలపాలి. దాన్నే జ్ఞానం అంటారు. ఆ జ్ఞానాన్ని మహాదాత్మలో నిలపాలి. అప్పుడు దాన్ని శాంతం అని వ్యవహరిస్తారు.
* బ్రహ్మ ఆత్మల యోగాన్ని యమాది నియమాలు పాటించటం ద్వారా తెలుసుకున్న మానవుడు పరబ్రహ్మ అవుతాడు.
* అహింస, అస్తేయం, సత్యం, బ్రహ్మచర్యం, అపరిగ్రహం అనేవి యమాలు.
* శౌచం, సంతోషం, తపస్సు, స్వాధ్యాయం, ఈశ్వరపూజ అనే ఐదు నియమాలు.
* పద్మాది ఆసనాలు, వాయువుని జయించటం అనేది ప్రాణాయామం.
* ఇంద్రియ నిగ్రహాన్ని కలిగి ఉండటం ప్రత్యాహారం.
* పవిత్రమైన ఒకే వస్తువుమీద మనసుని ఏకాగ్రంగా నిలపటం ధారణ.
* ఒకే విషయాన్ని నిరంతరం ధారణ చేయటమే ధ్యానం.
* నేనే పరబ్రహ్మని అనే స్థితిలో ఉండటమే సమాధి.
* ఘటం (కుండ) పగిలిపోగానే ఆకాశంతో కలిసిపోయి అభిన్నమైనట్టు, ముక్తి పొందిన జీవుడు పరబ్రహ్మతో కలిసి అభిన్నుడవుతాడు. సద్బ్రహ్మ స్వరూపుడవుతాడు.
* జీవుడు అజ్ఞానంతో తాను బ్రహ్మ అభిన్నుడని అనుకుంటున్నాడు.
* అజ్ఞానం తొలగిపోగానే జీవుడు, తాను పరబ్రహ్మ వేరుకాదని గ్రహించి ఆయనతో అభేదాన్ని పొందుతాడు. అజరామరుడవుతాడు.

నచికేతుడికి యముడు చెప్పిన ఈ యమగీత విన్నవారికీ, పఠించినవారికి మోక్షం కలుగుతుందని సాక్షాత్తు అగ్నిదేవుడే చెప్పాడు.

## అగ్నిదేవుడు చెప్పిన పరబ్రహ్మ భావన

అగ్నిదేవుడు బ్రహ్మ విజ్ఞానాన్ని గురించి ప్రబోధిస్తూ, బ్రహ్మ జ్ఞానం కలిగినవాడు ఈ సకల సృష్టితో, పరబ్రహ్మతో తాను భిన్నమైనవాడిని కానని గ్రహించి ఎలా తనని తాను పరబ్రహ్మగా భావించుకోవాలో ఇలా ప్రబోధించాడు.

ఓంకార పరబ్రహ్మని నేనే. జ్ఞానరూపాన్ని నేనే, సమాధి రూపంలో ఉండే బ్రహ్మని, సచ్చిదానంద స్వరూపమైన బ్రహ్మని, అనంతరూపుడైన బ్రహ్మని నేనే. 'అయమాత్మ పరంబ్రహ్మ' "తత్‌బ్రహ్మత్వం అసి" అని గురువు ద్వారా బోధించబడ్డ శిష్యుడు పరబ్రహ్మ తత్త్వాన్ని సంపూర్ణంగా తెలుసుకోగలడు. నేనే ఓంకారాన్ని, నేనే అఖండమైన పరమేశ్వర రూపాన్ని అనే జ్ఞానాన్ని పరిపూర్ణంగా పొందినవాడు కష్ట భూయిష్టమైన సంసార సముద్రంలో చిక్కుకోడు. వాటినుంచి విముక్తుడై స్వయంగా తానే పరబ్రహ్మ అవుతాడు. పరబ్రహ్మ కావాలనుకునేవాడు ఆయన తత్త్వాన్ని సంపూర్ణంగా అవగతం చేసుకోవాలి.

* పరంజ్యోతి స్వరూపాన్ని, పృథివీజలవాయువులకి భిన్నమైన పరమాత్మని నేనే.
* వాయువు, ఆకాశాలతో భిన్నమైన జ్యోతిర్మయ పరబ్రహ్మని నేనే.
* జాగ్రదవస్థా శూన్యమైన జ్యోతిరూప పరబ్రహ్మని నేనే.
* అకారాక్షర వర్జితమైన జ్యోతిరూప పరబ్రహ్మని నేనే.
* విశ్వభిన్నమైన జ్యోతిరూప పరబ్రహ్మని నేనే.
* విరాట్ భిన్నమైన జ్యోతిరూప పరబ్రహ్మని నేనే.
* వాక్పాణిపాద శూన్యమైన జ్యోతిరూప పరబ్రహ్మని నేనే.
* పాయూపస్థ రహితమైన జ్యోతిరూప పరబ్రహ్మని నేనే.
* శ్రోత్రత్వక్ చక్షురహితమైన జ్యోతిరూప పరబ్రహ్మని నేనే.
* రూప, రస, స్పర్శ, గంధ, జిహ్వాఘ్రాణ రహితమైన జ్యోతిరూప పరబ్రహ్మని నేనే.
* మనోబుద్ధి, అహంకార; చిత్త వర్జితమైన జ్యోతిరూప పరబ్రహ్మని నేనే.
* ప్రాణాపాన, వ్యానోదాన, సమాన రహితమైన జ్యోతిరూప పరబ్రహ్మని నేనే.
* శోక, మోహ, క్షుత్పిపాసా వర్జితమైన జ్యోతిరూప పరబ్రహ్మని నేనే.
* హిరణ్యగర్భ, స్వప్నావస్థా, తైజసాది భిన్నమైన జ్యోతిరూప పరబ్రహ్మని నేనే.
* జాగ్రత్‌స్వప్న సుషుప్త్యాది రహితమైన జ్యోతిరూప పరబ్రహ్మని నేనే.

* తురీయం నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్త స్వరూపమైన పరబ్రహ్మాని నేనే.
* సత్యం, ఆనందం, అద్వయం, సవిజ్ఞానమయమైన జ్యోతిరూప పరబ్రహ్మాని నేనే.
* సమాధిరూప మోక్షప్రదమైన పరబ్రహ్మాని నేనే.

## అగ్నిపురాణ మహిమ

సప్రపంచ, నిష్ప్రపంచ, మూర్తామూర్త స్వరూపధారి అయిన శ్రీహరి పురాణాలలో అగ్నిపురాణంగా ఉన్నాడు. ఆయన స్వరూపాన్ని గ్రహించి పూజించిన వారికి భుక్తి ముక్తులు లభిస్తాయి. సత్త్వగుణ సంపన్నుడైన శ్రీహరి ఎంతో ప్రభావవంతుడు. అగ్ని సూర్యాది రూపాలలో ఉన్నది శ్రీహరే.

శ్రీమహావిష్ణువే అగ్నిరూపంలో దేవతలందరికీ ముఖంగా ఉన్నాడు. అయనే అందరికీ పరమగతి. వేదాలలో, పురాణాలలో యజ్ఞమూర్తిగా వర్ణించబడేది ఆ శ్రీహరే. ఎంతో గొప్పదైన ఈ అగ్నిపురాణం శ్రీహరి దివ్యరూపం. ఈ పురాణానికి కర్త శ్రోత రెండూ ఆ జగన్నాథుడే. అందుకే ఈ పురాణం సర్వవేదమయంగా, సకల విద్యామయంగా సర్వజ్ఞానమయంగా కీర్తి పొందింది.

## అగ్నిపురాణం ఫలశ్రుతి

శ్రేష్ఠమైన ఈ అగ్ని పూరాణాన్ని చదివిన వారికి విన్నవారికి సర్వాత్ముడైన శ్రీహరి దివ్యానుగ్రహం లభిస్తుంది. ఈ పురాణం విద్యార్థులకి విద్యని, ధనార్థులకి ఐశ్వర్యాన్ని, రాజ్యార్థులకి రాజ్యాన్ని, ధర్మార్థులకి ధర్మాన్ని, స్వర్గకాములకి స్వర్గాన్ని, పుత్రకాముకులకి పుత్ర సంతానాన్ని, గోవులు కావాలనుకునేవాకి గోసంపదని, రాజ్యం కావాలనుకునేవారికి రాజ్యాన్ని ప్రసాదిస్తుంది. అదేవిధంగా జయం కావాలనుకునేవారికి జయాన్ని, కీర్తికాముకులకి కీర్తిని, ముక్తి కోరుకునేవారికి మోక్షాన్ని ప్రసాదించి మానవులు చేసిన సకల పాపాల్నీ నశింపచేస్తుంది.

**స్వస్తి**

**సర్వేజనాః సుఖినోభవన్తు**

